# విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు



విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.

# విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు

## మొదటి అధ్యాయము

"ఏమోయి! షుల్లీ ఇంకేదో కొత్త నవల రాస్తున్నావట కదా! పూర్తయిందా?"

"ఇంకా కాలేదు. నవల వ్రాయటమంటే అంత తేలికా?"

"నీకుచాలా తేలికట కదా! ఎవరో రాస్తూ ఉంటే నువు చెపుతూ ఉంటావట!"

"అల్లాగే చెపుతూ ఉంటాను. ఆ కష్టం నాకు తెలుసు."

"వినిపిస్తే విందా" మని వచ్చాను.

"పూర్తి కాందే. సగంలో వింటే ఏం ఆందంగా ఉంటుంది."

"ఇంతకూ నవలపే రేమిటి? నువ్వు మజాగా పెడతావులే పేర్లు."

"విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు, అని ఈ నవలపేరు."

"ఇది ఏంపేరు? విష్ణుశర్మ ఎవడు?"

"విష్ణుశర్మ అంటే నీతిచంద్రిక వ్రాశాడే ఆయన"

"ఆ విష్ణుశర్మకి ఇంగ్లీషు చదువేమిటి? అత డెప్పుడు బతికాడోకూడ తెలియదు. అప్పుడు ఇంగ్లీషు చదువు లేదు. నీవు వ్రాసే వన్నీ ఇల్లాగే ఉంటాయి. ఇదొక పురాణధోరణి. మన పురాణాల్లో చూడు. శ్రీ కైలాస పర్వతం మీద పార్వతీ పరమేశ్వరులు వేంచేసి ఉండగా పరమేశ్వరుని ఒళ్లంతా చెమట పోసింది. పార్వతికి కోపం వచ్చింది. అయ్యో మొగుడికి చెమట పోసిందని ఏ చేతి రుమాలో పెట్టి తుడవడం లేదు. 'నీ కెందుకు చెమట పొయ్యాలి' అని ప్రశ్న. 'ఎందుకు చెమట పొయ్యాలి' అన్న ప్రశ్న ఏమిటి? చెమట పొయ్యదా? ఆకలివేయదా? తలమాయదా? తలమాస్తే మంగలివాణ్ణి పిలు-

స్తాము. ఒక్క అర్థరూపాయి ఇస్తాము. పని చేయించు కుంటాము. 'ఓసి తలా! ఎందుకు పెరుగు తున్నావే' అని దండిస్తామా? అట్లాంటిదే చెమట. చెమట పట్టింది. ఆవిడకి కోపం వచ్చింది. కోపం ఏమిటో తెలుసునా? ఆయన మన స్సులో యెవ్వరో ఇంకో స్త్రీని భావిస్తున్నాడట! అది సాత్త్వికస్వేదమట! అందుకని కోపము. ఏంచేస్తాడు శివుడు? వట్టి పూర్వకాలపు వాడు. అమాయ కుడు. కాళ్లా వేళ్లా బడి 'రామరామ, నేను నిన్నుతప్ప ఇంకో స్త్రీని భావిం చియే ఎరుగను. అమ్మతోడు' అన్నాడు. ఆవిడేం సామాన్యురాలా! "అమ్మా ఆశ్యా లేని వాడవు. దొంగ ఒట్లు వేసికోకు. నువ్వు ఎవ్వతెనో మనస్సులో భావించియే ఉన్నావు" అని బొడ్డులో చేయివేసి నిలబెట్టి అడిగింది. అప్పుడేం చేస్తాడు శివుడు. ఇల్లా చెప్పాడట. 'కాదమ్మా! కంచి నగరంలో చిరుతొండ డనే వైశ్యోత్తము డున్నాడు. అతని యింటికి ఒక శివయోగి భిక్షకి వచ్చాడు. ఆతడు శివయోగికి చెరకు రసం ఇద్దామని అంగడికి వెళ్లాడు. ఇన్ని చెరకు గడలు కొన్నాడు. కూలివా డెవ్వడూ దొరకలేదు. నెత్తిని పెట్టుకు వద్దా మను కుంటున్నాడు. అతనికి మోపు లేవలేదు. నేను వెళ్ళి తోడుపట్టాను. అందుచేత నాకు ఒళ్ళు చెమట పోసింది' అన్నాడు. "కొబ్బరిచెట్టెందు కెక్కా వురా అంటే దూడగడ్డి కోసం" అన్నట్లుంది. దీనికి సాత్వ్య మెట్లా? ఇల్లా ఉంటై పురాణాల కథలు. నీవు నవలలు వ్రాసే తరహా గూడా ఇల్లాగే ఉంటుంది". "సరే. అయితే వినకు. నిన్ను వినమని నేనడిగానా? నీవే వస్తివి. వినిపించ మంటివి. నవల పేరు చెప్పాను. విష్ణుశర్మ అప్పటివాడే. చచ్చిపోయిన వాళ్ళు మళ్ళీ పుడుతూ ఉంటారుగదా! ఈ కాలంలో పుడితే ఇంగ్లీషు చదువు కోక తప్పదాయెను." "ఏ ఊళ్ళో పుట్టాడు? అతని వయస్సెంత. వాళ్ళ తల్లి దండ్రుల పేళ్లేమి? ఏ వర్ణంలో పుట్టాడు. ఇది వరకు ఎక్కడ చదివాడు." ఇవన్నీ ప్రశ్నలు.

"అందుకోసమనే నవల వ్రాసేది. ఇన్ని తగాదాలు ఉన్నని కనుకనే నవల రాయవలసి వచ్చింది. ఇంతకూ అతను పుట్టలేదు. నాకు కలలో కనిపిం చాడు. ఇదంతా నాకు వచ్చిన కల. ఒక్క విష్ణుశర్మే కాదు. భారతం వ్రాశాడే తిక్కన్నగారు, ఆయనకూడా కలలో కనిపించాడు. తన కెక్కడన్నా ఉద్యోగం ఇప్పించ మంటాడు. తా దూర కంతలేదు, మెడకొక డోలట నేను ఎం. ఏ. ప్యాసైనాను. తెలుగులూ సంస్కృతాలూ పరవాలేదు, చదువుకున్నా నని చెప్పవచ్చు. కొంచెం హిందీ కూడా చదివాను. నాకు ఉద్యోగానికి దిక్కు లేదు. కాని ఆయన తిక్కన్నకదా! నా మాట ఎట్లా ఉన్నా ఆయనకైనా ఒక ఉద్యోగం ఇప్పిద్దామని ప్రయత్నం చేశాను. ఆయనకి ఉద్యోగం ఇప్పించే ప్రయత్నం, ఈ విష్ణుశర్మకు ఇంగ్లీషు చెప్పే ప్రయత్నం, వీటితో నా టంగు

తెగిపోయిందనుకో. నాకు నిద్రాహారాలు లేవనుకో. 'ఎవరైనా నిద్ర పడితే చాలురా బాబూ' అనుకుంటారు. రోజురోజుకి నా స్థితి ఏమైందంటే 'నిద్ర వస్తుందేమో బాబూ' అని భయం వేయడం మొదలు పెట్టింది. ఇంతకూ అసలు నిద్ర పడితేగా. ఈ రోజులలో నిద్ర పట్టటమే! నిదరల్లే రావటం. ఇహ కల అందుకోవటం. దానితో సతమతమైపోవటం ఎప్పుడు మెలకువ వస్తుందిరా' అని నాకు పట్టిన ఆదుర్దా ఎవ్వరికీ పట్టదు."

"ఇదేమిటోయి. తలా తోకా లేని కథ చెపుతున్నావు. నిద్దరలోగాని, కలలోగాని 'నాకు మెలకువ ఎప్పుడు వస్తుంది' అని అనుకోవటం సాధ్యం కాదు. నీవు ఇల్లాంటివి కల్పించి చెపుతావు. అందుచేతనే నీ వ్రాతలు చూస్తే మావంటి వాళ్ళకు కోపం వస్తుంది. ఏమిటీ పిచ్చి వ్రాతలు?"

"అబ్బాయి! నీవంటి వాళ్ళు నా రచనలు చూచి కోపగించు కుంటారని నాకు తెలుసు! ఆ కోపాన్ని గురించి కొంచెం మనవి చేస్తాను వింటావా? దానికి గూడా కోపగిస్తావా? చెప్పమంటే చెపుతాను."

"ఆ మనవి చేసేది ఏదో చేయి."

"నేను వ్రాసేదాన్ని చూస్తే నీకు కోపం రావటానికి కారణమేమిటి అని నేనాలోచించాను. చివరకు నాకు తేలింది ఏమిటంటే నీ కిష్టములేనిది నేను వ్రాయడం. ఇదొక్కటే కారణంగా నాకు కనిపిస్తున్నది. నువ్వు చెప్పినట్లే నేను పూర్వపు పద్ధతిగా వ్రాస్తాను. నీకు కొత్త పద్ధతిగా వ్రాయాలి. పూర్వపద్ధతిగా వ్రాసే వాళ్ళను చూస్తే నీకు కోపం. ఒకటి చూడు. పూర్వ పద్ధతిగా వ్రాస్తే సంతోషించే వాళ్లు కొందరున్నారు. క్రొత్త పద్ధతిగా వ్రాస్తే సంతోషించేవాళ్ళు కొందరున్నారు. పూర్వ పద్ధతిగా వ్రాస్తే సంతోషించేవాళ్ళు క్రొత్తపద్ధతిగా వ్రాసేవాళ్ళనుచూచి కోపపడరు. 'వాడి కర్మ అల్లాంటిది. వాణ్ణి భగవంతుడల్లా పుట్టించాడు పాపం!' అని జాలిపడ తారు. ఇంకా పాతపద్ధతిగా వ్రాసేవాళ్ళనుచూచి క్రొత్తపద్ధతివాళ్ళు కోప గించు కొంటారు. వీళ్లిద్దరినీ గురించి కొంత ఆలోచన చేద్దాము. మొదటి వాళ్ళకు జాలి వేయటమేమిటి? రెండవ వాళ్ళకు కోపం రావటమేమి? అది వాళ్ళ కనుకూలమైన వ్రాతకాదు. ఇది వీళ్ళ కనుకూలమైన వ్రాతకాదు. వాళ్ళు జాలిపడటమేమిటి? వీళ్ళు కోప పడటమేమి? దీని వెనక ఉన్న రహస్య మేమిటంటే వాళ్ల వీళ్ల జీవ లక్షణాల్లో ఉన్న భేదం. ఆ మొదటివాళ్ళు ఇల్లా అనుకుంటారు. "మనదేముంది? పరమేశ్వరుడు ఈ లోకాన్ని నడిపిస్తు న్నాడు. వాడి ఇష్టం ఎల్లా అయితే అల్లా సాగుతుంది. వాడు ఒకణ్ణి ధనవం తుణ్ణి చేస్తాడు. ఒకణ్ణి నిరుపేదను చేస్తాడు. ఒక రాజ్యాన్ని పైకి తీసుకవస్తాడు.

ఇంకొకరాజ్యాన్ని అణగ ద్రొక్కుతాడు. మన దేముంది? కాని ధర్మమనేది ఒకటుంది. ఆ ధర్మమనేది రక్షింప బడవలె గాని తక్కిన వాటితో మనకేమి పని?" అని అనుకొంటారు. అందుచేతనే వాళ్లకు కోపం రాదు. 'ఏదో పోనీలే మనకెందుకులే' అనుకుంటారు. రెండవ వాళ్ళకు కోపం వస్తుంది. కోపం ఎవడికి వస్తుంది. 'నే నింతవాణ్ణయితే నాకు వీడిట్లా చేస్తాడా ?. చూడు వీణ్ణెంచేస్తానో, వీడికి నా తడాఖా తెలియదు.' మొదలైనట్లుగా ఎవడూహిస్తాడో వాడికి కోపం వస్తుంది. అంటే ఏమిటి? వాడికి దేవుడియందు విశ్వాసం తక్కువ. తానే గొప్పవాడు. తాను ఏది నమ్ముతున్నాడో అదే ఒప్పు. ఇంకొకటి ఎవ్వడూ విశ్వసించకూడదు. ఒకవేళ వాడిలో వాడు విశ్వసించు కొంటాడేమో మనకు తెలియదు. వ్రాయట మనేది చేయకూడదు. ఇల్లాంటి వాళ్లకు కోపం వస్తుంది."

"నే నల్లాంటి వాణ్ణంటావా? నీవు వ్రానేది బాగానే ఉంది కాని నాకు కోపం వస్తేతప్పా? పైగా దాని కొక సిద్ధాంతం చెపుతావు. అసలు నీ సిద్ధాంతాల మూలంగానే నాకు ఒళ్ళు మండుతున్నది. నీవు ఇల్లాంటి వ్రాతలు వ్రాయటం ఎప్పుడు మాని వేస్తావో అప్పుడు బాగుపడతావు.''

" నే నింకా బాగుపడే దేమిటోయి. కాటికి కాళ్లు చాచుకొని కూర్చున్నాను. బ్రతికి ఉన్నాను గనక ఏదో వ్రాస్తున్నాను. నేను వ్రాయట మనేది నాకొక జాడ్యం క్రింద తయారైంది. ఇది కొందరు "ఆబ'' అను కుంటున్నారు, ఇది ఆబ ఏమీకాదు. ఒక ఊబిలో దిగానని నాకు తెలుసు.''

" నీవు ఏదైనా అంటే కాటికి కాళ్ళు చాచుక కూర్చున్నా నంటావు. నీవు పది కాలాలపాటు బ్రతకాలోయి. ఆంధ్రభాషకు సేవచెయ్యాలె. వ్రాయగలవాడవు నీవు అల్లా అనకూడదు. కాలాన్ని అనుసరించి వ్రాయి.''

"కాలం నన్నెందు కనుసరించ కూడదు? తనని అనుసరించ మని కాలం నన్నెందు కడగాలి? ఆకాలం గొప్ప ఏమిటి? అదైనా నేనైనా ఆలోచన మీద ఆధారపడి కదా నడవాలి. 'నేను కాలాన్ని గనక ఆలోచించను,' అని. అది అంటే నే నేమనాలి. నీవు కాలాని వైనాసరే. నీవు ఆలోచించి ప్రవర్తించక పోతే నేను నిన్ననుసరించను, అనాలి. అంతే.''

''నిజమే. ఇందులో ఒక పేచీ ఉన్నది. కాలం అధికారి. నీవు తెలుగు పంతులవు. అది నిన్ను దండిస్తుంది. అణగ ద్రొక్కుతుంది. నిన్ను పైకి రాకుండా చేస్తుంది. నీ డొక్క చీలుస్తుంది. డోలు కడుతుంది."

''ఆ పని మాత్రం చేయవద్దను. డోలు మోగుతుంది. నా డొక్కతో కట్టిన డోలు నా వలెనే మ్రోగుతుంది. ఆ కాలాని కేమిలాభం?''

''అదంతా వదలిపెట్టు. నీతో వాదన అనేది ఎప్పుడూ తేలే విషయం కాదు. నీవు కాలికి వేస్తే వ్రేలికి, వ్రేలికి వేస్తే కాలికి వేస్తావు. ఎప్పుడూ చివరి మాట నీది కావాలి. అందుచేత నీ నవలను గురించి చెప్పు.''

''చదివి వినిపించమన్నావు కదా ! చదువుతాను విను.''

''నీ ధోరణి చూస్తే నాకు తలనొప్పి కనుక కథచెప్పు. వింటాను.''

''అంత తలనొప్పి ధోరణి నీకెందుకు? నా మాట విని ఇంటికి పో. ఉభయతారకంగా ఉంటుంది. చిన్నప్పటి నుంచీ కలిసి చదువుకొన్నాం. నిన్ను నే నే మనటానికి వీలులేదు. నేను ఏమీ అనకుండానే అన్నానంటావు. నన్ను నీవు లక్షలంటావు. నేను పడి ఊరుకోవాలి.''

''ఎందు కూర కుంటావు. పుస్తకాలు వ్రాస్తావు. మాకు కోపాలు తెప్పిస్తావు''.

''అరే ! నీకుమల్లే బజారున బడి తిట్టమంటావా ? తిడితే నీకు చెల్లు బాటు. ఊళ్లో నీవు పెద్ద అధికారివి. రాజ్యాంగంలో పలుకుబడి ఉంది. లోకమంతా నీ పంపిణీ మీద వెళ్ళుతున్నది. నేనే మున్నది? ఏదో కూర్చుని నాకు తోచినది వ్రాయటం. దానికి నీ చేత తిట్లు తినడం.''

''అబ్బాయి ! నీవు నిజంగా ఇంకొక దేశంలో పుడితే నిన్ను నెత్తిమీద పెట్టుకునేవాళ్ళు. నీ అంతటి రచయిత లే డనేవాళ్ళు. ఒక టేమిటి నీ బొమ్మ ఇంటింటా వ్రేలాడ వేసుకునే వాళ్ళు. నీవు ఇల్లా వ్రాస్తున్నావు కనుక నిన్ను మేము పైకి రానియ్యడం లేదు.''

''పైకి వచ్చేందుకు నాకే ఓపిక లేదు. నేను బరువు. మునిగి ఉండే వాణ్ణే తప్ప పైకి తేలే వాణ్ణి కాదు.''

''ఇదీ నీ తెలివి. మాటలను విరిచి చమత్కార మనుకుంటావు. ఇ దొక వ్యాధి నీకు.''

''అరే ! అర్థమనేది మాటలని పట్టి వస్తుంది. మాటని వదిలి పెడితే అర్థ మెల్లా వస్తుంది. మీ చరిత్ర వాదులు రక రకాలుగా చెపుతున్నారు. కళ్ళతో చెప్పవచ్చు. చేతులతో చెప్పవచ్చు. మాటకందని భాష యెంతో ఉన్నది. మనోభావం అంతా చెప్పటానికి మాటకి సామర్థ్యం లేదు.' ఇల్లాంటి మాటలు మీరు చెపుతున్నారు. ఇల్లా చెపుతున్నారే తప్ప మాటలని వదలి పెట్టిన పద్ధతి ఏమీ లేదే. నే నేమంటానంటే 'మాట చెప్పలేనిది ఏమీ లేదు.' అంటాను. మాట చెప్పలేనిది ఒక్కటే ఉన్నది. అది బ్రహ్మ పదార్థము. అది అవాఙ్మానసగోచరము. తక్కిన వన్నీ మాటలతో చెప్పవచ్చు.''

"తాటిపట్టెకు ఎదురు దేకుతావు. ఎల్లా చెప్పటం. మాటకు శక్తిలేదే.. లేదని అందరూ అంగీకరించారే, నీ వంతే మునిగి పోయిందా."

"అందరూ అంగీకరించా రంటే ఎవరు ? మీ 'క్రొత్తజనం' ప్రతిదానికి: అందరూ అంగీకరించారని అంటారు. అందరు అంటే ఎవరు? అందరిలో నేను ఉన్నానా? నే నంగీకరించలేదు కదా? అందరు అని ఎల్లా అంటావు. నీ యిష్టం వచ్చిన కొందరిని తీసికొని వాళ్లే అందరు అంటావు. పైగా నే నొక్కణ్ణే ఒక్కణ్ణి కాదుగా. నావంటివాళ్లు చాలా మంది ఉన్నారు. మే మందరమూ నీవనే అందరిలో లేము. 'మాటకు ఈ శక్తి లేదని అందరూ అంగీకరించారు' అన్నావే, ఆ అందరూ ఎవరో తెలుసునా? మాటకు ఎంత శక్తి ఉన్నదో తెలియని వాళ్లు. మాట కున్నంత శక్తి మరొక దానికి లేదు. మాటకు అనేకములైన అర్థాలు ఉంటవి. వంద సందర్భాలల్లో ఒకే మాట వంద అర్థా లిస్తుంది.. ఒక్క మాటే ఇన్ని అర్థాలిస్తే రెండు మూడు మాటలు కలిస్తే ఎప్పుడు ఏ అర్థ మిస్తుందో చెప్పలేము. కనుక మాటకి శక్తిలే దనకు. శక్తి లే ని ది మనకు. మాట అర్థం ఇస్తుంది. అర్థం చేసుకోవలసినది మనము. అర్థం చేసికొనే శక్తి మనకు లేకపోతే 'ఆడలేక మద్దెల ఓడు' అన్నట్లుగా ఉంటుంది. మొదట తెలివి తేటలను సంపాదించాలె. నిజమైన చదువు చదువు కోవాలె. గాలి చదువు చదివి అర్థం కమ్మంటే కాదు."

"బాబూ నువ్వే గెలిచావు. ఆ నవల యేదో కొంచెం వినిపించు. పోతాను."

"కథ చెప్పు మన్నావు కదా ! వినిపిస్తే తలనొప్పి వస్తే?

"రాదులే. వినిపించు."

"కొంప తీసి తల ఇంటి దగ్గర పెట్టి వచ్చావేమిటి? ఎప్పుడు వచ్చినా అట్లాగే వస్తావు. అసలు నీకు తల ఉన్నదో లేదో అనే టట్లుగా వస్తావు."

"అన్నీ నేనే అంటానుగా. నువ్వు తిట్టవుగా. ఇది తిట్టుగా దేమిటి?"

"పరవాలేదు. తలని వెంటనే తెచ్చావు. వినిపిస్తాను."

"వినిపిస్తావుకాని, ఇవన్నీ కలలే కదా? అసలు కల లెందుకు వస్తయో తెలుసునా ?"

"అజీర్ణవ్యాధి ఉంటే కలలు వస్తవి. దానికి నీవు పెట్టింది పేరు. నీకు కల లెందుకు రావు ? నీ కల లన్నీ వ్రాస్తూ కూర్చున్నావా? ఆంధ్రభాష యొక్క టంగు తెగిందే. అయినా కలలని గురించి పుస్తకాలు వ్రాయటం మేమయ్యా !"

"సరే! నాకు బుద్ధి లేదు. నేను వ్రాస్తాను. నీకు బుద్ధి ఉన్నది కదా! వినటానికెందుకు వచ్చావు. నీకు కూడా బుద్ధి లేదా! నీకు లేదని నాకు తెలుసు ననుకో........."

"నాకు బుద్ధి లేదని నీకు తెలుసు. నీకు బుద్ది లేదని నాకు తెలుసు."

"అందు చేత వినిపిస్తా విను. మళ్ళీ ఏదో యొక దిక్కుమాలిన ప్రశ్న వేయకు. ఈ పుస్తకం మొదలు పెట్టక ముందు కలలని గురించి కొంత వ్రాశాను. అది పీఠిక అనుకో. ముందర అది వినిపిస్తాను. విను."

"నాకు పీఠిక వద్దు. గ్రంథమే వినిపించు.

"పీఠిక వినక పోతే గ్రంథం వినటానికి వీల్లేదు. వెళిపో."

"సరే పీఠిక గూడా తగల పెట్టవోయి."

"అల్లా దారికి రా. ఎవడి కోసం వింటావు. నన్ను రక్షించే అంతుకు వింటావా! నీకు పనీ పాట లేదాయె. కాలం గడవాలాయె. అందరూ ఎవళ్ల పనులువాళ్ళు చూచుకుంటూ ఉంటారాయె. నీవు వెళ్ళితే చీదరించి కొడతారు. దిక్కులేక నాదగ్గరకు వస్తావు. వచ్చినన్ను వెక్కిరిస్తావు. నా కవిత్వంబాగుండ లేదంటావు, మళ్లీ నేనే గతి. అందుచేత విను, నేను వ్రాయబోతున్న కలలు ఒకటా రెండా. చాలా కలలు ఉన్నవి. అన్నీ కలిపి ఈ పుస్తకంగా వ్రాస్తున్నాను. కాని లోకంలో ఉన్న కలలకూ, ఈ కలలకూ ఒక భేదం ఉంది. లోకంలో ఎవడికైనా ఒక కలవస్తే రెండో కల ఆ వెనుకటి కలలో ఉన్న సంధర్భాన్ని అందిపుచ్చు కొనిరాదు. ఇది యింకొకకల. నా కల లట్లాకాదే. ఒక దాన్ని ఒకటి అంది పుచ్చుకొని వచ్చినవి? అసలు కల అంది పుచ్చుకొని రావు, నిద్రాదరిద్రుడని ఒక కవి ఉన్నాడు. వాడిజన్మకు చరితార్థంగా వ్రాసింది ఒకటే శ్లోకం. ఆ శ్లోకం సంస్కృతంలో వ్రాశాడు."

శ్లోకం అనటంతోటే సంస్కృతం కదోయి. అది వేరే చెప్పాలా?"

"బలే వాడవే. ఇప్పుడు తెలుగులో శ్లోకాలు వ్రాసేవాళ్ళు చాలా మందివున్నారు, ఆ సంగతి నీకు తెలియదు కాబోలు. తెలుగులో శ్లోకాలు వ్రాస్తున్నారు. సంస్కృతంలో పద్యాలు వ్రాస్తున్నారు. అదట్లా ఉంచి వాడికి నిద్రాదరిద్రుడని పేరెందుకు వచ్చిందంటే వాడి శ్లోకంలో ఉన్న అర్థాన్ని బట్టి వచ్చింది. ముక్కు తిమ్మన్న అని పేరెందుకు వచ్చింది? ఆయన ముక్కు. మీద పద్యం వ్రాశాడు. అది రామరాజ భూషణుడి కమ్మాడు. పద్యం రామరాజ భూషణుని దయింది. ఆయనకు ముక్కు మిగిలింది. అల్లాగే ఒక్కొక్క లోకోత్తరమైన పద్యం వ్రాస్తే ఆ పద్యాన్నిబట్టి ఆ కవులకు పేరువచ్చింది, పూర్వం. భవ

భూతి అన్న పేరు అల్లా వచ్చిందే. నిచుళుడన్న పేరు కూడా అల్లాగే వచ్చింది. అల్లాగే వీడికి నిద్రాదరిద్రుడని పేరు వచ్చింది. ఆ శ్లోకంలో ఉన్న అర్థం ఇది. వాడు నిద్ర పోయినాడట. అందులో వాడికి ఒక కల వచ్చింది. ఆ కలలో వాడికొక అందకత్తె కనిపించింది. వాళ్ళిద్దరికీ ప్రేమ యేర్పాటైంది. వాళ్ళిద్దరూ ఆ ప్రేమ గొడవలో ఉండగా ఆవిడకి ఇతని మీద కోపం వచ్చింది. ఆవిడని బతిమాలుదామనుకుంటున్నాడు. ఇంతలో వాడికి మెలకువ వచ్చిందె. ఏం చేస్తాడు. ఆవిడ కోసం అల్లాగే ఉండిపోయెను. బతిమాలటానికి వీలులేక పోయెను. అందుచేత మళ్ళీ నిద్రపడితే, మళ్ళీ అకలే వస్తే, మళ్ళీ ఆవిడ కనిపిస్తే ఆవిడ కోపం తీర్చాలని, నిద్రపట్టించుకోవాలని ఎంతో ప్రయత్నం చేశాడు. నిద్ర పడితే, కల వస్తే. అయితేపల్లి కరిణీకం అయితే గియితే, అది వేరే మాట. అసలు నిద్దరే పట్టదాయె, అందుచేత వాడు ఈ భావాన్ని పెట్టి ఓపద్యం వ్రాశాడు. నేను నిద్రాదరిద్రీకృతుడ నయినాను అని. అందు చేత అతని కా పేరు వచ్చింది. తెలిసిందా!"

"శత విధాల ఆ కల ఇంకెవడికో వచ్చి ఉంటుంది. వాడు దాని కోపం తీర్చి ఉంటాడు."

"అదిరా రసజ్ఞుడంటే! నువ్వు అంత రసజ్ఞుడవు కనక నా నవలలు వినటానికి వస్తావు. నాకు తెలుసు. కాని పాపం ఏం చేయను ?"

"నీ నవలల్లో శృంగార రసం లేదు. చట్టుబండలు లేదు. ఆనందిద్దామంటే ఏమీ ఉండదు. లక్షణంగా సంఘంలో ఎన్ని రకాల పెళ్ళిళ్ళు జరుగుతున్నవి కావు. ఒక్కదాన్ని గురించి వ్రాయకూడదా ? ఎగబడి చదువుతాము గదా ! నీకు గండపెండేరం వేయించక పోయినామా ! అసలు నిమిషంలో క్రొత్తకవుల లిస్టులో వేయించే వాణ్ణే నీ పేరు."

"వేయించకపోతే మానెలే. నువ్వు వచ్చి వింటున్నావుగా. అది నాకు చాలు."

"వినేం లాభం. తిడుతున్నానుగా!"

"నీవు తిడుతున్నా వంటే అర్థమేమిటంటే నన్ను చదువుతున్నా వన్నమాట ! చదవక తప్పదన్నమాట. నీకు తెలియకుండా నన్ను మెచ్చుకుంటున్నా వన్నమాట. అసలు తిట్టడానికీ, మెచ్చుకోడానికి పెద్ద భేదం లేదు. రెండూ ఒకటే. రూపాయ ఉందనుకో. అక్షరాలవైపు ఒకటీ. బొమ్మవైపు ఒకటీ. ఎటు తిప్పినా రూపాయే. అదట్లా ఉంచి నా కలలు మాత్రం ఆ నిద్రాదరిద్రుడికి మల్లే కాకుండా వరుసగా వచ్చినవి."

"ఎందుకు వచ్చినవో నేను చెప్పనా ?"

"నువ్వేం చెబుతావో నేం చెప్పనా ? నేను నవల వ్రాసేందుకు వచ్చి నవి. నా కట్లా వస్తూ ఉంటవి. కొన్నాళ్ళ క్రింద నే నొకరోజున పగటిపూట పడుకుని నిద్రపోతున్నాను. మొదటికల పగటిపూట వచ్చింది."

"పగటికలలకు పాటింపులేదు."

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకనే నవల వ్రాయటం. పాటింపు ఉంటే నవల వ్రాయట మెందుకు ? దాని నమలులోనే పెట్టేవాణ్ణి. అసల్లో పెట్టే వాళ్ళేమో రాజకీయవేత్తలూ, మంత్రులూ. నేను వట్టి కలలు కనే వాణ్ణి. ఆ కలలు గ్రంథాలుగా వ్రాసేవాణ్ణి. నీవు వినేవాడవు. పాటింపు లేక పోయినా కల చెపుతాను మధ్యాహ్నం పూట పడుకొని నిద్రపోతున్నాను. నిద్ర పోతుండగా ఇద్దరు మనుష్యులు నా దగ్గరకు వచ్చారు. అనగా కలలో సుమా! ఒకాయన ఎఱ్ఱగా ఉన్నాడు, బొద్దుగా ఉన్నాడు. మంచి పొట్ట ఉన్నది. జందెం మాసి ఉన్నది. గడ్డం కూడా మాసే ఉన్నది. దోవతి మోకాళ్ల పైకి ఉంది. ఆయన్ని చూస్తే కొంచెం వెగటు వేసింది. రెండవ ఆయన కొంచెం పొడుగ్గా ఉన్నాడు. చామనచాయగా ఉన్నాడు. చెవులకు కుండ లాలు ఉన్నవి. గోష్పాద మంత జుట్టున్నది. గండభేరుండం అంచు దోవతి కట్టాడు. చేతులకు బంగారు కడియాలు ఉన్నవి. చేతికి దర్భముడి ఉంగరం ఉన్నది. రెండు ఉంగరాలు కూడా ఉన్నట్టున్నవి. పైన శాలువ వేసు కొన్నాడు. మొగం మాత్రం మంచి దీప్తిగా ఉన్నది.

ఇద్దరినీ కూర్చో మన్నాను. మొదటాయన కూర్చున్నాడు. రెండవ ఆయన నిలుచుండే ఉన్నాడు. 'ఏమిరా కూర్చోడు' అనుకొన్నాను. నా కప్పుడు తోచింది. నేను లేచి 'అయ్యా ! దయచేయండి' అని అనలేదని కాబోలు. నిద్దర పోతున్న వాణ్ణి నేను లేవడ మెట్లా ? అయినా ఈయన కింత దర్జా ఎందుకు ? ఆయన ఎవరో నాకు తెలియదాయె. తెలిసిన తరువాత కదా గౌర విస్తాము. అందుకనే మనవాళ్ళు రావటంతోటే ప్రవర చెప్పి 'అహంభో అభివాదయే' అంటారు. ప్రవర చెపితే ఫలానా వాడని తెలుస్తుంది. ఇంగ్లీషు వాళ్లు వీడు ఫలానా వాడని చెప్పే వాణ్ణి వెంట తీసుక వస్తారు. దాన్నే introduce చేయట మంటారు. ఆయన ప్రవరా చెప్పలే దాయె సరే. నే నాయనకి నమస్కారం చేయదగిన వాణ్ణి కాదు. అయినా నా దగ్గరకు ఆయన వచ్చాడు కాని నే నాయన దగ్గరకు వెళ్ళ లేదు కదా! నమస్కారం చేయకపోతే మానె. 'మాది ఫలానా ఊరు. నా పేరు ఫలానా. మీతో పని ఉండి వచ్చాను' అనవచ్చు కదా. కొందరేం చేస్తారంటే అర్ధ రాత్రి

"ఎందుకు వచ్చినవో నేను చెప్పనా ?"

"నువ్వేం చెబుతావో నేం చెప్పనా ? నేను నవల వ్రాసేందుకు వచ్చివవి. నా కట్లా వస్తూ ఉంటవి. కొన్నాళ్ళ క్రింద నే నొకరోజున పగటిపూట పడుకుని నిద్రపోతున్నాను. మొదటికల పగటిపూట వచ్చింది."

"పగటికలలకు పాటింపులేదు."

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకనే నవల వ్రాయటం. పాటింపు ఉంటే నవల వ్రాయట మెందుకు ? దాని నమలులోనే పెట్టేవాణ్ణి. అమల్లో పెట్టే వాళ్ళెమో రాజకీయవేత్తలూ, మంత్రులూ. నేను వట్టి కలలు కనే వాణ్ణి. ఆ కలలు గ్రంథాలుగా వ్రాసేవాణ్ణి. నీవు వినేవాడవు. పాటింపు లేక పోయినా కల చెపుతాను మధ్యాహ్నం పూట పడుకొని నిద్రపోతున్నాను. నిద్ర పోతుండగా ఇద్దరు మనుష్యులు నా దగ్గరకు వచ్చారు. అనగా కలలో సుమా! ఒకాయన ఎఱ్ఱగా ఉన్నాడు, బొద్దుగా ఉన్నాడు. మంచి పొట్ట ఉన్నది. జందెం మాసి ఉన్నది. గడ్డం కూడా మాసే ఉన్నది. దోవతి మోకాళ్ల పైకి ఉంది. ఆయన్ని చూస్తే కొంచెం వెగటు వేసింది. రెండవ ఆయన కొంచెం పొడుగ్గా ఉన్నాడు. చామనచాయగా ఉన్నాడు. చెవులకు కుండలాలు ఉన్నవి. గోష్పాద మంత జుట్టున్నది. గండభేరుండం అంచు దోవతి కట్టాడు. చేతులకు బంగారు కడియాలు ఉన్నవి. చేతికి దర్భముడి ఉంగరం ఉన్నది. రెండు ఉంగరాలు కూడా ఉన్నట్టున్నవి. పైన శాలువ వేసుకొన్నాడు. మొగం మాత్రం మంచి దీప్తిగా ఉన్నది.

ఇద్దరినీ కూర్చో మన్నాను. మొదటాయన కూర్చున్నాడు. రెండవ ఆయన నిలుచుండే ఉన్నాడు. 'ఏమిరా కూర్చోడు' అనుకొన్నాను. నా కప్పుడు తోచింది. నేను లేచి 'అయ్యా ! దయచేయండి' అని అనలేదని కాబోలు. నిద్దర పోతున్న వాణ్ణి నేను లేవడ మెట్లా ? అయినా ఈయన కింత దర్జా ఎందుకు ? ఆయన ఎవరో నాకు తెలియదాయె. తెలిసిన తరువాత కదా గౌరవిస్తాము. అందుకనే మనవాళ్ళు రావటంతోటే ప్రవర చెప్పి 'అహంభో అభివాదయే' అంటారు. ప్రవర చెపితే ఫలానా వాడని తెలుస్తుంది. ఇంగ్లీషు వాళ్లు వీడు ఫలానా వాడని చెప్పే వాణ్ణి వెంట తీసుక వస్తారు. దాన్నే introduce చేయట మంటారు. ఆయన ప్రవరా చెప్పతే దాయె సరే. నే నాయనకి నమస్కారం చేయదగిన వాణ్ణి కాదు. అయినా నా దగ్గరకు ఆయన వచ్చాడు కాని నే నాయన దగ్గరకు వెళ్ళ లేదు కదా! నమస్కారం చేయకపోతే మానె. 'మాది ఫలానా ఊరు. నా పేరు ఫలానా. మీతో పని ఉండి వచ్చాను' అనవచ్చు కదా. కొందరేం చేస్తారంటే అర్ధ రాత్రి

వేళ వస్తారు. తలుపు తట్టుతారు. 'ఎవరు వారు' అంటే 'నేను' అంటారు.ఏమి నేను శ్రాద్ధం నేను. వాణ్ణెవణ్ణో మనం ఐదారేండ్ల క్రింద ఎరుగుదుము. ఈమధ్య చూడలేదు. వాడు వచ్చి అర్ధరాత్రి వేళతలుపు తట్టి 'నేను' అంటే వాడికి జ్ఞానం ఉందను కోవాలా లేదను కోవాలా? అల్లాంటి మహానుభావులలో ఈయన ఒకడు అనుకొన్నాను. ఆయన యెవరో తెలిసిన తరువాత ఇంతవాణ్ణి గురించి ఇట్లా అనుకున్నానే అనిపించింది గాని, అప్పుడుమాత్రం అట్లా అనుకున్న మాట నిజం. పైగా ఆయనేమైనా పరాయి ఊరునుంచి వచ్చినవాడా. ఇది వరకు నేను చూచినవాడా. ఏమి కాదాయెను! స్వర్గలోకాన్నుంచి వచ్చాడు. కథ చెప్పితే తెలుస్తుంది. ఇంతకూ ఆయనని చూస్తే నాకు నవ్వు వచ్చింది. 'ఏమిటిరా ఇంత పిచ్చివాడు' అని. నవ్వా ననుకోండి. నాకు మెలుకువ వస్తుంది. అందుచేత నేను నవ్వలేదు. అందుచేత ఆకూర్చున్నాయనకి ఈయన యెవ్వరో తెలుసునేమో నని 'వా రెవరండీ' అని అడిగాను. కూర్చున్నాయన ఇట్లా అన్నాడు. "ఆయన ఎవ్వరో నాకూ తెలియదు. ఏదో మోస్తరు చూస్తే యజ్ఞం చేసినట్లున్నాడు. చాలా ధనవంతుడివలె ఉన్నాడు. గొప్ప అధికారివలె ఉన్నాడు.'' నేను "మీరెవరు? ఏమి పనిమీద వచ్చారు". అన్నాను.ఆయన "చెపుతాను లెండి, ముందర వారితో మాట్లాడి పంపించండి" అన్నాడు. ఆ నిలుచున్న సోమయాజి. "నేనూ పని ఉండే వచ్చాను. వెంటనే వెళ్ళటానికి రాలేదు. ముందర ఆయనపనే చేసి పంపించండి.'' అన్నాడు. నే ననుకొన్నాను. వీళ్ళద్దరి పనులూ చేసి పంపించకముందు నాపని అయ్యేటట్టు ఉందని. ఏమి చెయ్యాలి? ఆ సోమయాజి గారిని "అయ్యా! కూర్చోండి" అన్నాను. ఆయన చివరి కనుగ్రహించి కూర్చున్నాడు. కూర్చున్నారు గాని వాళ్ళ పనులేమిటో నాతో చెప్పరు. నేనా మధ్యాహ్నాపు పూట ఎక్కువసేపు నిదుర పోవటానికి వీల్లేదు. రెండున్నరా మూడింటికల్లా లేచి నా ఉద్యోగానికి నేను పోవాలి. ఏమి చెయ్యాలి. వారితో ఇట్లా అన్నాను, "అయ్యా! ఏదో కొద్దిపని అయితే ఇట్లా పగటిపూట రావాలిగాని పెద్దపెద్ద పనులు పెట్టుకొని ఇలా వస్తే ఎల్లాగ? సావకాశంగా రాత్రిళ్ళు రండి, రాత్రి ఏ పదకొండు గంటలకో నేను నిదుర పోతాను. తెల్లవారగట్ల ఆరయితే గాని నిద్రలేవను. ఏడుగంటల వ్యవధి ఉంటుంది. మధ్య ఒకటి రెండుసార్లు నేను మేల్కొన్నా మీ దయవల్ల వెంటనే నిదుర పడుతున్నది. కనుక మీరిద్దరూ ఇప్పుడు దయచేయ వలసింది. రాత్రికి రావలసింది' అన్నాను. వాళ్ళిద్దరూ కూర్చున్న వాళ్ళు కదల లేదు. 'చచ్చామురా దేవుడా' అనుకున్నాను. 'ఏమండీ వెళ్ళరేమి' అన్నాను. ఇద్దరూ కూడా మేము వెళ్ళేందుకు రాలేదన్నారు. బాబోయి ! ఇదొక తద్దినమా ! మా ఆవిడ పుట్టింటికి వెళ్ళింది. నేనే ఉడకవేసుక తింటున్నాను. వీళ్ళకు గూడా ఎక్కడ వండి పెట్టను.

ఇది పూటకూళ్ళ ఇళ్ళకి వెళ్ళే జాతివలె కనిపించటం లేదు. నా సెత్తిన ఎక్కే వాళ్ళల్లేనే ఉన్నారు. పైగా చేతిలో దమ్మిడిలేదు. ఈ సోమయాజులు గారిని చూస్తే రెండు మూడు కూరలూ, పచ్చళ్ళూ, భక్ష్యాలూ ఉంటేగాని భోంచేసే వాడల్లే కనిపించలేదు. రెండవ ఆయన పట్టుపడితే తవ్వెడు బియ్యం అన్నం లాగే అట్లున్నాడు. ఏమి చేయాలో తోచలేదు. ఇంతలో అదృష్ట వశాత్తు ఒకటి జ్ఞాపకం వచ్చింది. ఆనాడు ఆదివారం: ఉద్యోగానికి వెళ్ళక్కరలేదు. సరే నని 'బాబూ! మీ పను లేమిటో తరువాత చెపుదురు గాని మొట్టమొదట మీ రెవరో చెప్పండి' అన్నాను. ఆయన కాకపోతే ఈయన ఆయెను, ఈయన కాకపోతే ఆయ నాయెను, మొదలు పెట్టరే! బస్సు నిండా జనం ఉంటారు. ఇద్దరు స్నేహితులు వెళతారు. ఎవరో ఒకరు ముందు రెక్కాలి. నువ్వెక్కమంటే నువ్వెక్కమంటూ నులుచుంటారు. ఆ టిక్కెట్లమ్మేవాడికి ఒళ్ళు మండుతూ ఉంటుంది. అల్లా ఉంది వీళ్ళ తరహా. నా కొక్కటి తోచింది. ఈ బోద్దాయన చతికిల పడి కూచున్నాడే ఈయనా తక్కువమూర్తి కాదు. యజ్ఞం చేయలే దన్న మాటేకాని, కుండలాలూ సింహతలాటపు మురుగులు లేవన్న మాటేకాని, ఎవరో పెద్దపండితుడై ఉంటాడు. మన దేశంలో పూర్వం పండితు లందరూ ఇట్లాగే ఉండే వారట! చూడటానికి సామాన్యులల్లే ఉంటారు. వాళ్ళ దుంపలు తెగ! వాళ్ళని కదిలిస్తే ఒకడు ఆరు శాస్త్రాలు చదివినవాడూ, ఇంకొకడు వేదాలతో సహా చదివిన వాడు. అయినా ఈ సోమయాజులు గారు యజ్ఞం చేసినా కొంచెం లౌక్యుడల్లే ఉన్నాడు. ఈయన అచ్చంగా వైదికు డల్లే ఉన్నాడు. కనుక ఆయనతో అన్నాను. 'స్వామీ' మొట్టమొదట తమ రెవ్వరో చెప్పండి. ఏమి పనిమీద వచ్చారు మీ వంటి పండితులకు నావంటి వాడితో ఏమిపని ఉంటుంది.. నే నేదో కళాశాలలో ఒక తెలుగు పంతులని. అయినా నా చాతనైంది చేస్తాను. పైగా ఇవ్వాళ ఆదివారం. ఏ కచేరీలూ తెరచి ఉండవు" అన్నాను.. అంటే ఆయన "ఆదివారమైతే ఎందుకు తెరచిఉండవు" అన్నాడు. నాకు వెంటనే తెలిసింది. ఇది ఏదో ప్రాతకాలపు మేళంరా అని. ఆదివారంనాడు సెలవు అని తెలియని వాడెవడంటా అని అన్నా గదా ! 'ఆదివారాలు సెలవులు కదండీ' అన్నాను. ఆయన 'అదే తెలియక అడుగుతున్నాను. 'ఎందుకు సెలవు' అన్నాడు. నే నన్నాను. "ఆదివారాల నాడు కళాశాలలు ఉండవు. చదువు చెప్పము. అన్నాడు ఆయన" అదేమిటయ్యా! అష్టమి అయితే చదువము. పూర్ణిమ అమావాస్యలనాడు చదువము. పాడ్యమి నాడు చదువము.. ఈ రోజుల్లో చదివితే.చదువురాదు. పాడ్యమినాడు అసలు చదువ కూడదు.. అందుకనే వాల్మీకి తన రామాయణంలో లంకలో చిక్కి ఉన్న సీతను వర్ణిస్తూ "ప్రతిప త్పాఠశీలస్య వి ద్యేవ తనుతాం గతా" అన్నాడు అని అన్నాడు. నాకు

ఆయన చదివిన సంస్కృత శ్లోకార్థం తెలియలేదు. నేను సంస్కృతంతో ఎం. ఏం. ప్యాసైనా సుమండీ. మరైతే ఎందుకు తెలియదంటారు? మేము ఆ సంస్కృతాన్ని గుర్తు పెట్టుకొని ఇంగ్లీషుతో వ్రాసి ప్యాసైన వాళ్ళము. మాకు సంస్కృతము యొక్క శబ్దాలు కాని, ప్రత్యయాలు కాని ఎక్కువ తెలియవు. వాక్యంగా ఉంటే చప్పున అర్థం కాదు. ప్రతిపత్ అంటే ఏమిటో తెలియలేదు. అయినా నేను పండితుణ్ణనికదా వీళ్ళు నాదగ్గరకు వచ్చారు. నాకది అర్థం కాలేదు అంటే మనకు మర్యాదా నష్టం కదా! అందుకని అర్థమైనట్లు గంభీరంగా ఊరకున్నాను. ఆయన మళ్ళీ అన్నాడు "ఇవిఏవీ కాకుండా ఆదివారం సెలవేమిటి" అని. నే నన్నానుకదా "అయ్యా! దేవుడు సృష్టి చేయటం మొదలు పెట్టాడు. సోమవారం మొదలు పెట్టాడు. ఆరు రోజులు సృష్టి చేశాడు. ఇంతలో వాడికి అలుపు వచ్చింది. ఆదివారం సెలవు తీసుకున్నాడు. అందుచేత అప్పటి నుంచీ ఆదివారాలు సెలవు లగుతూ వచ్చినవి" అన్నాను. ఆయన పకాపకా నవ్వటం మొదలు పెట్టాడు. ఆ సోమయాజిగారు ఈయన కన్న మర్యాదస్థుడు. ఆయన నవ్వకుండా నిలుచున్నాడు. నాకు బలే కోపం వచ్చింది. "ఏమండీ! భగవంతుడు లేడంటారా! సృష్టి చేయలేదంటారా!" అని అడిగాను. ఆయన "నే నదీ అనను ఇదీ అనను గాని భగవంతుడికి అలు పేమిటి అంటాను" అన్నాడు. నిలుచున్న సోమయాజిగారు మానవునికి అలుపు ఉంటే భగవంతుడికికూడా ఉండి ఉండాలి అన్నాడు. కారణము నందు లేని గుణము కార్యము నందు సంక్రమించదు కదా! భగవంతుడు కారణం, జగత్తు కార్యం. అందుచేత భగవంతుడు అలిశాడనే అనవలె అన్నాడు. ఈ బోద్ధాయన ఏమంటాడు. "సరే. ఆదివారంనాడే అలుపు దీర్చుకొన్నాడని ఎల్లాగు" అన్నాడు. సోమయాజిగారు మాట్లాడలేదు. నాకేమనిపించింది. వీళ్ళ కింత తర్కం తెలిస్తే నాకు మాత్రం ఎందుకు తెలియదు అని. ఏదో ఒక రోజున అలుపు తీర్చుకోవాలిగదా ! ఆ రోజు ఆదివారమెందుకు కాకూడదు అన్నాను. వాళ్ళిద్దరూ నా తర్కం క్రింద పడిపోయినారు. 'నిజమే నయ్యా అంటే నిజమే' అన్నారు!. కనుక ఆదివారాలు సెలవే. అప్పటికి బోద్ధాయన ఊరకున్నాడా. "సరేనయ్యా మీ రాదివారాలు సెలవిచ్చుకొంటే ఇచ్చుకోండి. అష్టమి, అమావాస్య, పాడ్యమి వాటికిగూడా ఇవ్వండి" అన్నాడు. ఇచ్చేవాణ్ణి నేను కాదు, అయినా వాళ్ళ యిద్దరి ముందూ మనం గొప్పనటించకపోతే ఎల్లాగా? లేకపోతే వీళ్ళు ఆ కార్య కారణ భావమో, సదసద్భావమో, ఇల్లాంటి శాస్త్రపు చర్చలు లేవదీసి నాటంగు తెంచుతారు, కనుక మొట్టమొదటే వీళ్ళని దబాయించాలని తోచింది. అల్లా యివ్వటానికి వీల్లేదు, పాడ్యమినాడు చదివితే ఇంతకూ ఆయన మాటలవలన కొంత తెలివికలవాణ్ణి కనక ప్రతిపత్ అంటే

పాడ్యమి అని తెలిసింది) చదువురాదంటారు అంతేకాదా అని అన్నాను. అనటంలో ఎల్లా అన్నాననుకొన్నారు. ఈ రాజ్యమంతా చేస్తున్నవాణ్ణి నేనే అన్నట్లన్నాను. ఆ కూర్చున్నాయన మెత్తబడ్డాడు. ఆయన అన్నాడుకదా "ఏమోనండీ. వాల్మీకి వ్రాశాడు. పాడ్యమినాడు చదివినవానికి విద్య ఎల్లా సన్నగిల్లుతుందో సీతాదేవి అల్లా సన్నగిలి ఉన్నది" అని. అప్పుడు నాకు తెలిసింది. ఆ శ్లోకానికి ఇదా అర్థం అని. నేనన్నాను. "ఇవన్నీ తీసి అవతల పెట్టండి. రెండుమూడు వందల యేండ్ల నుంచి ఈ దేశంలో పాడ్యమినాడు చదువుతునే ఉన్నారు. ఎం. ఏ. లు ప్యాసవుతున్నాం. డాక్టరేట్లు తెచ్చుకుంటున్నాము. రెండు వేల రూపాయలనుంచి జీతాలు తెచ్చుకుంటున్నారు. మీ మాట ఏమీ నిజంకాదు" అన్నాను. ఆ కూర్చున్నాయన మెత్త పడ్డాడనుకొన్నాను. కాని ఆయన చాలా గడుసువాడు. ఆయన పుటుక్కున అన్నాడు కదా! "ఇదంతా చదువేకాదేమో, అందుచేత వస్తుంది" అన్నాడు. నా గుండెలో రాయి పడ్డది. కొండనాలుకకు మందు వేయబోతే ఉన్ననాలుక ఊడి పోయినట్లైందే, ఏమి చేయాలి? మన మర్యాద ఎల్లా నిలబెట్టుకోవాలి. వీళ్ళు నన్ను చూడటానికి వచ్చారు తప్ప నేను వాళ్ళను చూడటానికి వెళ్ళలేదు. మనచేయి పైన ఉండాలి. నాకేమీ తోచలేదు. ఇంతలో ఆ సోమయాజి ఇట్లా అన్నాడు. ఆయన కాదూ ఇందాక కార్య కారణ వాదం చేస్తే బొద్దాయన ఊరకున్నాడు. అందుచేత బొద్దాయన అంటే లోకువ అనిపించింది. అన్నాడు కదా "ఆకాలానికి అది విద్య. ఈ కాలానికి ఇది విద్య. ఆ విద్య అష్టమి నాడూ, అమావాస్యనాడూ, ప్రతిపత్తునాడు చదువకూడదు. ఈ విద్య ఆది వారాలనాడు చదువకూడదు" అని. మన ఎత్తు గెలిచింది. అయినా మనం గెలువలే. మనంకూడా ఒక మాటవేస్తేనే కాని మన మర్యాద నిలువదు. అందుచేత నేనన్నానుగదా "సరిగ్గా నే ననబోతున్నమాటే మీరన్నారు. బాగా అన్నారు. కానీ ఇంకో విషయం ఉన్నది. ఆదివారంనాడు చదివితే ఈ విద్య రాదు అన్న నిషేధంలేదు. కొంత విశ్రాంతి కావలెగనక ఆదివారాలనాడు ఊరకుంటున్నాము. పూర్వంలో శని అదివారాలు రెండూ చదువుచెప్పే వాళ్ళంకాదు. ఆ రోజుల్లో బలహీనంగా ఉండేవాళ్ళం. ఇప్పుడు కొంచెం బలం వచ్చింది. అందుచేత శనివారాలు కూడా మేము పాఠశాలలు నడుపుతున్నాము." అన్నాను. అని మీపేరేమిటండీ అన్నాను. కూర్చున్నాయన "నాపేరు విష్ణుశర్మ" అన్నాడు. మీ ఇంటిపేరేమిటన్నాను. ఆయన తెల్ల బోయినాడు. "ఇంటి పేరేమిటి"అన్నాడు. సోమయాజి "అదేమిటయ్యా! ఇంటి పేరుండదా ? మా యింటిపేరు గుంటూరువారు. తెలుగు వాళ్లందరికీ ఇంటిపే రుంటుంది." అన్నాడు. నాకు కొంచెం ధైర్యం వచ్చింది. ఈయనని

ఇందాకటి నుంచి అడుగుతుంటే పేరు చెప్పాడుకాడు. ఇప్పుడు తనంతట తానే ఇంటిపేరుచెప్పాడు. ఇంకో చిన్న ఎత్తువేసి ఈయన పేరు కూడా చెప్పిద్దా మని పించింది. అన్నాను కదా ! గుంటూరు ఇంటిపే రేమిటండీ ఊరు పేరు కదా ! అన్నాను. విష్ణుశర్మకి పట్టుదొరికింది. మీతెలుగు వాళ్ళందరూ ఇంతే. ఊళ్ల పేర్లు పెట్టుకొని, "ఏవో పౌరుష నామాలు పెట్టుకొని ప్రవర్తిస్తూ ఉంటారు. మాకు గోత్ర నామాలే ఉంటాయి నేను భారద్వాజుడను. నాపేరు విష్ణుశర్మ" అన్నాడు. దానితో ఆ సోమయాజి ఎక్కడలేని ఆపేక్షతో "మాదీ భారద్వాజస గోత్రమే. మమగోత్రం వర్ధతాం" అన్నారు. "మేము ఊరికే పౌరుష నామాలు పెట్టుకొన్నాము కాని మన మిద్దరమూ ఒక్కటే" అన్నాడు. అంతలో మళ్ళీ అన్నాడు కదా "మీరు తెలుగువాళ్లు కారు కాబోలు. మీరు ఏమైనా సంస్కృతంలో గ్రంథాలు వ్రాశారా" అని. అంటే ఆ విష్ణుశర్మ వ్రాశాను లెండి; ఏం లాభం ? నాకేమి పేరా ప్రతిష్ఠా ? సంస్కృతంలో పంచతంత్ర మన్న గ్రంథం వ్రాసింది నేనే" అన్నాడు. దానితో సోమయాజికి కొంత మర్యాద తగ్గిందని అనటానికి వీలులేక పోలేదు. కాని ఆయన సంస్కృతంలో వ్రాశాడు కదా ! అందుచేత కొంత గౌరవం గానే ఉన్నాడు. విష్ణుశర్మ "మీరు ఏం వ్రాశారు" అన్నాడు. సోమయాజి "తెలుగులో భారతం వ్రాసింది నేనే" అన్నాడు. నేను "మీరు నన్నయ్యగారా" అన్నాను. ఆయన కాదు అన్నాడు. కాక పోతే తాను తిక్కన్నో ఎఱ్ఱాప్రగడో పిల్లలమఱ్ఱి పినవీర భద్రయ్యో ఎవణ్ణో ఒకణ్ణని చెప్పవచ్చుకదా. ఆయన చెప్పలేదు. నేనను కొన్నాను ఎఱ్ఱా ప్రెగ్గడ వట్టి పల్లెటూరి కరణం. ఈయన తిక్కన్న గారైయే ఉంటాడు అని. ఆ విష్ణుశర్మకి నన్నయ్యో తిక్కన్నో ఎఱ్ఱయ్యో ఈ గోడేమీ తెలియదు. ఆయనకు కాళిదాసు, భవభూతి ఇల్లాంటి పేర్లు తెలుసు కాని శ్రీనాథుడు, వాచన సోమన్న ఇల్లాంటివాళ్ల పేర్లు తెలియవు. నేను "తమరు తిక్కన్నగారా' అండీ అన్నాను. ఆయన తల ఆడించాడు. 'దయ చేయండి. కూర్చోండి. నేను లేవటానికి వీలులేదు. నేను లేస్తే నా నిదుర చెడిపోతుంది. వాక్కల చెదరిపోతుంది. మీ పని పాడవుతుంది. అందుచేత కూర్చోండి" అన్నాను. తిక్కన్నగారు కూడా ఆలోచించాడు. 'నిజమేరా ! ఇతడు లేస్తే ఈ స్వప్నం కాస్తా చెడిపోతుందాయె. మని పని పాడౌ తుం'దని అనుకున్నాడు కాబోలు కూర్చున్నాడు. ఇంతలో నాకొక భయమేసింది, వీళ్ళిద్దరిదీ ఒకటే గోత్రం. నేను కేటాయింపుగా ఐపోతాను. కనుక ఈ తిక్కన్నని నావైపుకి లాక్కున్నా నా విష్ణుశర్మమీద అధికారం చేయవచ్చని పించింది. అని విష్ణుశర్మను కొంత యేడిపిద్దా మనిపించింది. ఏమండీ వదలిపెట్టి "ఏమయ్యా !' అన్నాను. తిక్కన్నగారి పేరే వినలేదా. కవిబ్రహ్మ పేరే వినలేదా? అన్నాను. చిన్నయసూరి పేరు విన్నావా? అన్నాను. ఆయన "విన్నాను

నా నీతిచంద్రిక కొంత తెలుగులో వ్రాశాడట" అన్నాడు. నిజానికి విష్ణుశర్మ అంటే తిక్కనగారి కేమిటి ? నాకూ అలుసుగానే ఉంది. అంత భారతం వ్రాసినాయనకు ఏదో పంచతంత్రం వ్రాసినవాడంటే అంతగౌరవం. లేక పోవచ్చు. నాకెందుకో. అదేంమాట ? నేను మాత్రం పద్యాలు వ్రాయలేదా? తిక్కనగారి అంతవాణ్ణి అనుకోవటం లేదా ఆ మాటకువస్తే తిక్కన ఏమిటి. కాళిదాసంతవాణ్ణి. అందరితో చెప్పననుకోండి. మా యిద్దరి ఈ తనంటే అంత అభిప్రాయం లేకుండా ఉండటం విష్ణుశర్మ గ్రహించాడు. ఆయన అసాధ్యుడాయె. ఆయన అసాధ్యత్వం నాకు తెలియలేదు కాని రాజనీతి అంతా కథలలో ఆరునెలలలో చెప్పినవాడు. పూర్వం గుణాఢ్యు డెంతవాడో నిజం మాట్లాడితే విష్ణుశర్మ అంతవాడు. కాని ఆయన యేం చేస్తాడు. తిక్కనగారు వ్రాసిన భారతం చదివి యెరగడు. 'వ్యాసుడు వ్రాసిన భారతమే యెరుగు. అంతటితో అన్నాడు కదా ! "ఓహో! మీరా తిక్కన్న గారు. స్వర్గంలో మీ పేరు విన్నాను. మీ తెలుగు' కవులందరికీ ఒక పేట ఉన్నది కదూ ! మా సంస్కృత కవుల మెప్పుడూ ఆ ప్రాంతాలకి రాలేదు. ఎప్పుడో వ్యాసమహర్షి చెప్పాడు. మీరొకసారి వారి దర్శనానికి వెళ్ళారట!" అన్నాడు. ఓరి వీడి తస్సాగొయ్య. ఆతని నీతి చూశారా ! ఆ మాటల్లో అర్థమేమిటంటే తాను వ్యాసమహర్షి అంతవాడనీ, తానూ వ్యాసమహర్షీ ఒకపాయా వాళ్ళనీ, తెలుగు భాషఅంటే అనేక భాషల్లో అది ఒకటనీ, సంస్కృత పండితులు ఈ భాషను లెక్కచేయరనీ, ఈ పంచతంత్రము నీతంతా తిక్కన్న మీదా నామీదా ప్రయోగించాడు. యథార్థానికి మేమిద్దర మనుకొన్నాం గదా 'ఈయనతో మనకు పేచీ ఎందుకు? నిజానికి పంచతంత్రం చాలా గొప్ప గ్రంథం కదా ?' నిజమే, తిక్కన్న భారతం తెలుగు చేశాడు. ఏదీ పంచతంత్రం వ్రాయమనండి. అటువంటి తిక్కన్నకే దిక్కులేకపోతే ఏదో వచ్చినకలలు పుస్తకాలుగా వ్రాసికొనే నాకెందుకూ?' అని నేనన్నాను కదా ! "అయ్యా తమరేపనిమీద వచ్చారో చెప్పండి" అన్నాను. అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. "ఇదేమిటిరా ! ఇంతవాళ్ళు వస్తే మనం అర్ఘ్య పాద్యాలు ఇవ్వలేదాయె. మా ఇల్లు పవిత్రమైంది అనికూడా అనలేదాయె" అని. "అయ్యా ! తమరు సావకాశంగా రండి. ప్రస్తుతం మీకు చేయవలసిన గౌరవం కూడా చేయలేకుండా ఉన్నాను. అయినా ఉండండి, కాళ్ళు కడు క్కునే అందుకు నీళ్లైనా తెస్తాను." అన్నాను. అన్నాను లేచాను. మెలకువ వచ్చింది, అక్కడ విష్ణుశర్మలేడు, తిక్కన్నా లేడు. 'అరే ఎందుకు నిద్ర మేలుకున్నానురా' అనిపించింది, మళ్ళీవీళ్లు వస్తారా రారా ? నాతో పని ఉన్నదన్నారు కదా? తప్పకుండా రాత్రికి మళ్ళీవస్తారని అనుకొంటాను

రాత్రికి ఇట్లాకాదు. రెండు చెంబులతో నీళ్ళు మంచంకింద పెట్టుకు పడుకోవాలి. వాళ్ళని ఆ నీళ్ళతో కాళ్లు కడుగు కోమ్మనాలి. వాళ్ళ కేదైనా ఫలాహారం పెట్టాలి. మా ఆవిడ ఇంట్లో లేదాయె. బజారునుంచి ఏమన్నా కొనుక్కొద్దామంటే డాల్డాఆయె. పాపం వాళ్ళకి కడుపునొప్పి వస్తుందేమో!. ఎట్లాగైతే ఏం ప్రొద్దు గ్రుంకింది.

# రెండవ అధ్యాయము

రాత్రి నిద్దర పట్టటం తోనే ఇద్దరూ ఎదురుగా కూర్చున్నారు. నా కాశ్చర్యం వేసింది. 'అప్పుడే వచ్చారే' అన్నాను. వారు "మేం వెళ్ళనేలేదు, ఇక్కడ ఉన్నాము" అన్నారు. ఇక్కడే ఉండట మేమిటి? ఎట్లా ఉన్నారు. అయితే నేను మంచం కింద పెట్టిన నీళ్ళు వృధా: వారికి ఫలహారం పెడదామని ఏవో కొనుక్కు వచ్చాను. మ రన్నానుగదా! "మీరు మధ్యాహ్నం అనగా వచ్చారు ఆకలి వేయటం లేదా? మీ కోసం ఫలహారాలు తెచ్చాను, తినండి మంచం కింద పెట్టా న'న్నాను. విష్ణుశర్మ అన్నాడు, 'ఇంకా నాల్గైదు రోజులవరకూ ఆకలి ప్రసక్తి లేదు. అక్కడి నుంచి ఆకలి' అన్నాడు. తిక్కన్న గారూ అట్లాగే అన్నాడు'. 'నాలుగైదు రోజులవరకూ ఆకలి ప్రసక్తి ఎందుకులేదు:' అని అడిగాను. విష్ణుశర్మ ఇట్లా అన్నాడు. "నేను స్వర్గాన్నుంచి వచ్చాను:. స్వర్గంలో మా కాకలి దప్పులు లేవు. నేను పంచతంత్రం వ్రాశాను. అప్పటినుంచీ నా కీర్తి లోకంలో వ్యాపించి ఉన్నది. దానితో నేను స్వర్గానికి వెళ్లాను. ఇన్నాళ్ళూ అక్కడే ఉన్నాను. ఈ మధ్య స్వర్గంలో చాలా తగాదాలు వచ్చినవి. ఈ భూలోకంలో ఉన్నవాళ్ళు కొందరు చచ్చి, స్వర్గానికి వస్తున్నారు. ఎవ్వడూ మాకుమల్లే చాలా ఏండ్లుగా స్వర్గంలో ఉండటంలేదు కాని వచ్చి నాలుగు రోజులో అయిదు రోజులో ఉంటారు. నాలుగు రోజులంటే మీకు నాలుగు సంవత్సరాలో ఎంతో ఔతుంది, వాళ్లేదో కొంచెం పుణ్యం చేస్తారు. వాళ్ళను తీసుక వచ్చి స్వర్గంలో నాలుగైదు రోజులు ఉంచి పంపించే చోటికి పంపిస్తారు. ఈనాలుగు రోజుల్లో వాళ్లు చేసే హాంగామా ఇంతిం తనికాదు. ఒక వద్ద తేమిటి? వాళ్ళ గోల మన కెందుకని ఊరకున్నాను నేను. ఇట్లా ఉండగా నామీద ఒక తగాదా లేవదీశా డొక బుద్ధిమంతుడు. పంచతంత్రం వ్రాసింది నేను కాదనీ, ఇంకెవరో ననీ అతడి పేరు తెలియదనీ, ఆ వ్రాసినవాడు నన్ను కల్పించాడనీ ఒక సిద్ధాంతం లేవ దీశాడు. నేను లెక్క చేయలేదు. కాని వాళ్ళు చాలామంది ఉన్నారు. వాళ్ళందరూ ఒక కాగితం మీద అర్జీ వ్రాసి దస్కతు లన్నీ పెట్టి ఇంద్రుడికి తీసుక వెళ్ళి ఇచ్చారు. ఆ యింద్రుడు నవ్వి 'పొండి' అన్నాడు. వాళ్ళు పోలేదు. 'విచారించి తీరాలి' అన్నారు. వాళ్ళందరూ తలా నాలుగురోజులు స్వర్గంలో ఉండి తీరాలి, వాళ్లేవో యేవో

చిన్న చిన్న పుణ్యాలు చేశారట! శిక్షించటానికి వీల్లేదు, ఇంద్రుడు నన్ను పిలిపించాడు. నేను వెళ్ళాను. "ఏమయ్యా! విష్ణుశర్మా! పంచతంత్రం వ్రాసింది నువ్వేనా" అన్నాడు. చిత్తం అన్నాను, వీళ్ళందరూ కాదంటు న్నారే అన్నాడు. వాళ్ళందరూ నాతో "నీవా విష్ణుశర్మవు? నీవు కానే కావు. విష్ణుశర్మ ఇట్లా ఉండనే ఉండడు. ఆయన నీతులన్నీ కథలలో చెప్పిన వాడు. ఇట్లా బొద్దల్లే ఉంటా డటయ్యా! బక్కపలచగా చలాకీగా ఉంటాడు. ఆతని మొఖం చూస్తే తెలివి కొట్టవస్తుంది. నీ మొహంలో తెలివే లేదు. మేం ఒప్పుకోం" అన్నాడు. నాకైతే కోపం వచ్చింది. వాళ్ళమీద కాదు. ఇంద్రుని మీద. ఈ కలికాలపు మనుష్యులు వచ్చి ఇల్లా మాట్లాడు తుంటే ఇంద్రుడి కేం మాయరోగం? అతడు వైదికు డాయె. ఆస్తికు డాయె, వీళ్ళకి మల్లె నాస్తికుడా? నన్ను పిలిపించట మేమిటి? అయినా ఇంద్రుడిమీద కోపపడతే ఏమిలాభం? నే నాయనవంక కోపంగా చూచాను. ఇంద్రు డన్నాడు కదా? "ఇదంతా ప్రజారాజ్య మయ్యా, వాళ్ళందరూ కాదంటే కాదు. ఔ నంటే ఔను. న న్నేమి చేయమంటావు? నేను నిస్సహాయం గానే ఉన్నాను. భగవం తుడైన విష్ణుమూర్తి బుద్ధుడై పుట్టి, ఈ దేశాన్ని మరికొంత ఖరాబు చేశాడు. గోరు చుట్టుపై రోకటిపో టన్నట్లు తరువాత ముసల్మానులూ, ఇంగ్లీషు వాళ్ళూ వచ్చి మరీ చేశారు. ఆ ఇంగ్లీషు వా డున్నాడే అతడికంటె ఘనుడు ఆచంటమల్లయ్య. ఆ చదువుతో వచ్చిం దయ్యా? నీదాకా ఎందుకు? నాకే యెసరు పెడుతున్నారు. స్వర్గలోక మంటే ఈ ఆకాశగోళంలో ఉన్న ఈ తేజోలోకం కాదట! టిబెట్ అన్న దేశం ఉందే భూలోకంలో అదట! స్వర్గ లోకం. త్రివిష్టప శబ్దంలో నుంచి టిబెట్ పుట్టిందట! రెం డక్షరాలు పోయి నవి. షకారపకారాలు. త్రివిట్ ఒక వేళఅయితే టిబెట్ కావచ్చు. షకార పకా రాలు ఏమైనట్లు? ఏమిటో అదంతా ఒక గోలగా ఉంది. ఈ స్వర్గంలో వీళ్ళు చేసే అల్లరి ఇంతా అంతా కాకుండా ఉన్నది. పూర్వం రావణా సురుడూ, హిరణ్య కశిపుడూ, వృత్రాసురుడూ, నరకాసురుడూ వచ్చారంటే యుద్ధాలు చేస్తే చేశాం. వాళ్ళు గెలిచేవాళ్ళు. మేం పోయి ఎక్కడో తలదా చుకొనే వాళ్ళం. వీళ్ళతో యుద్ధాలూ లేవు. ఏమీ లేవు. కత్తులూ లేవు కటా రులూ లేవు. వీళ్ళకి ఒక్కటే పెద్దఆయుధం. దానిపేరు కుతర్కం. అది ఆవురా అంటాము. వాడు కా దంటాడు. అం టాడనడం అల్లావుంచు. గోవు శబ్దం లోంచి ఆవు పుట్టనే పుట్ట దంటాడు. నే నీయిబ్బందిలో పడి ఉన్నా నబ్బాయి, వాళ్ళు స్వర్గానికి వస్తున్నారు. నాలుగు రోజులో, అయిదు రోజులో ఉంటారు. వీళ్లుపోతున్నా రంటే వీళ్ళలాంటి వా ళ్ళింకొకళ్లు వస్తున్నారు. వీ ళ్ళందరూ ఒకటే మోస్తరు మనుష్యులు. ఇంతకూ పంచతంత్రం నువ్వేవ్రాస్తే ఆ వ్రాత ప్రతి ఉంటే తీసికొని వచ్చి చూపించు" అన్నాడు. నేను "యిప్పుడు ఎక్కడ

ఉంటుంది. కొన్ని వేలయేండ్లక్రింద వ్రాసిన పుస్తక మాయెను. పైగా నేను నా చేతితో వ్రాశానా పెట్టానా? నాకు వ్రాయటం చేతకాదాయెను. చదువంటే వ్రాయటంగా పూర్వం లెక్కలో లేదు. నేను నోటితో చెప్పాను. వ్రాయసకా డెవడో వ్రాశాడు. దానికి సాక్ష్యమెల్లా?" అన్నాను. ఇంద్రుడన్నాడు. "నీవు ఏ రోజుల్లో వ్రాశావు? నీవు వ్రాసినప్పటి వాళ్ళెవ్వరైనా ఉన్నారా? వాళ్ళు స్వర్గంలో ఉంటే పిలిపిస్తాను. అన్నాడు. 'నే నాలోచిస్తే నా కెవ్వరూ కనిపించలేదు. "ఆచిన్నయసూరి అన్నవాడు నీతిచంద్రికను కొంతభాగం తెలుగుచేశాడుకదా. మరి కొంతభాగం కందుకూరి వీరేశలింగం పంతులు అన్నాయన చేశాడు. వాళ్ళిద్దరూ నా పక్షం మాట్లాడతా రనుకుంటాను. వా రిక్కడుంటే పిలిపించండి" అన్నాను. ఇంద్రుడు ఆలోచించాడు. "చిన్నయసూరి ఉన్నాడనుకుంటా నయ్యా! ఆ వీరేశలింగం పంతులు ఉన్నట్టులేదు. ఆయన కేదో స్వర్గం మీద కోపం వచ్చి వెళ్ళిపోయినాడు" అనగా నేను 'స్వర్గంమీద కోపం ఎందుకు వచ్చింది అన్నాను!' ఇంద్రుడు 'ఆ గోలంతా నీ కెందుకులే. ఆయనకూ మాకూ చాలా పేచీ లున్నాయి. అస లాయన మీద విఘ్నేశ్వరుడికి కోపం వచ్చింది.' 'అనగా విఘ్నేశ్వరుని కెందుకు కోపం వచ్చిందండీ' అన్నాను. ఇంద్రు డన్నాడుకదా 'నోటితో చెప్పకూడ దయ్యా కొన్ని మాటలు' అన్నాడు. నేను విష్ణుశర్మని కాదని అర్జీలు పెట్టిన వాళ్ళందరూ ఏకవాక్యంగా వీరేశలింగం పంతులుగారు కనుక ఒప్పుకొంటే పంచతంత్రం వ్రాసింది ఈయనే అని మేము ఒప్పుకుంటాము అన్నారు. నే నన్నాను "నేను వ్రాసిన పుస్తకానికి ఒకడు ఒప్పుకోవట మేమిటి? మీలో ప్రతివాడూ ఎవడో ఒకడై ఉంటాడు కదా! వాడు వాడే నని ఇంకొకడు చెపితేగాని కాడా ఏమిటి?' అన్నాను. అందులో ఒకడు 'అంతే' అన్నాడు. ఇదేమిటయ్యా అంటే బ్యాంకులోకి చెక్కు తీసుకవెళతా మనుకో. ఒక టేమిటి ఏ వ్యవహారమైనా సరే ఎవడో ఎరిగి ఉన్నవాడు వీడని నిరూపిస్తేగాని ఆ వ్యవహారం సాగదు. అంటే నే నన్నాను. 'ఎవ్వడూ ఎరగని వా డొక డుంటాడు, వాడిగతి ఏం కావాలి?' అన్నాను. అంటే అతడు 'వాడిగతి అంతే' అన్నాడు. ఈ వాదనా పద్ధతికి నేను విస్తుపోయినాను. నే నైదారుశాస్త్రాలు చదువుకొన్నవాణ్ణి, లోకోపకారం కోసం పంచతంత్రం వ్రాశాను. చేసిన పొరపాటది. దేనికో భాష్యం వ్రాస్తే, ఒక మహాకావ్యం వ్రాస్తే ఈ భాధలు ఉండేవి కాదుకదా? అనుకొని వాణ్ణిచూచి 'నీ పేరేమిటి' అన్నాను. వాడు తనపేరు డేనియల్ అన్నాడు. ఈపే రేమిటి అన్నాను. తక్కినవా ళ్లందరికి కోపం వచ్చింది. ఇంద్రుడు వా ళ్లందరివంకా చూశాడు. కొంచెం గాబరా పడ్డాడు. అన్నాడు కదా ఏమీ లేదయ్యా ఆ శబ్దం వికృతి. ప్రకృతి ధనియాలు అన్నాడు. అంటే

నే నన్నాను. ధనియాలులో ఇంతకారం ఉండదే. ఇతని దగ్గర చాలా కారం ఉంది అన్నాను. ఇంద్రుడు 'కారం కాదయ్యా అది చేదు. నీకు తెలియదు కాబోలు. నీవు ఒక్కసారి భూలోకానికి వెళ్ళివస్తేనే కాని ఇవన్నీ తెలియవు. మిరియాలు మిరియాలు కావు. ధనియాలు ధనియాలు కావు. మిరియాలల్లో ఏవో నయ్యా రుద్రాక్షగింజలో పారిజాతపు గింజలో కలుపుతున్నారట. అందుచేత మిరియాలు కారంగా ఉండటం లేదు. చేదుగా ఉంటున్నవి. ధనియాలూ అల్లాగే' అన్నాడు. నేనూ ఆ ధనియాలు వంకచూచి ఇల్లా అన్నాను. నీవు ధనియాలవు కావు అని అంటే ఏమి చేస్తావు' అన్నాను. ఆ ధనియాలన్నాడు. 'నేను' నిస్సందేహంగా ధనియాలనే, ఇదిగో వీళ్ళందరూ సాక్ష్యం' అన్నాడు. పైగా వా డన్నాడు 'ఇదేం మజా అనుకున్నావా!' మా వూళ్లో మునిసిపాలిటీ లెక్కలు ఉన్నవి. ఆలెక్కల్లో నేను పుట్టినట్లు ఉంది. మా బడిలో నేను పుట్టిన తేదీ ఉన్నది. నా ఎస్.ఎస్.ఎల్.సి సర్టిఫికేటులో ఉన్నది. నేనునేను కాదనటానికి వీల్లేదు. నా పుట్టుమచ్చలు వాళ్ళు వ్రాసి అట్టి పెట్టారు. నేను ఇంత ఎత్తు. ఇంత బరువు. నువ్వు చెప్పు 'ఏం చెపుతావో' అనేటప్పటికి నా పై ప్రాణాలు పైన పోయినవి. చచ్చాముగా మహానుభావుడా, నేను పుట్టిన తేదీ లేదాయె. నేను స్కూళ్ళల్లో చదువ లేదాయె. నా పుట్టుమచ్చలగుర్తు పెట్టించుకో లేదాయె మరిప్పు డేం చేయాలి? ఇంద్రుడితో అన్నాను. "స్వామీ! త్రిలోకాధినాథా! ఇప్పటి నీ స్థితికంటె నాస్థితే కొంచెం మెరుగ్గా ఉంది." అనినాకు తెలుస్తున్నది. తమరిని ఏమీ అని లాభం లేదు. రామచంద్రుని వంటివాడు ఎవడో చాకలి ఏదో అన్నాడని పెళ్ళాన్ని అడవికి పంపించాడు. ఆయన విష్ణుమూర్తి. మీ స్వర్గలోకానికి ఆయన గతి. నీవు నన్ను భూలోకానికి పొమ్మంటే నేను సీతాదేవివంటి వాణ్ణి కాక పోయినా పోక తప్పదు. వెళ్ళి ఆ పుట్టుమచ్చలూ అవీ ఏవో చూచుకొని వస్తాను' అన్నాను. ఇంతలో వాళ్ళల్లో ఒకడు చిన్నయసూరిని తీసుక వచ్చాడు. ఆయనే చిన్నయసూరి అన్నారు. మనిషి చామనచాయగా ఉన్నాడు. కొంచెం దర్జాగా ఉన్నాడు. మెడదాకా గుండీలుగల కోటు తొడిగాడు. తలపాగా పెట్టాడు. పైన ఒక ఉత్తరీయం వేసికొన్నాడు. నేను ఆయన నడిగాను, "ఏమండీ మీరేనా చిన్నయసూరిగారు? మీరు చిన్నయ సూరిగారు అన్న దాఖలా ఏమిటి?' అన్నాను. ఆయన 'నేను బ్రిటిష్ గవర్నమెంటు వారిస్కూళ్ళలో మాస్టరీ చేశాను. నలుగురు దొరలు సాక్ష్యం ఉన్నార'న్నాడు. నేను సరే అయితే మీరు పంచతంత్రంలో మిత్రలాభం మిత్రభేదం తెలుగుచేశారుకదా. ఆ పంచతంత్రం వ్రాసినవా డెవరు అన్నాను. ఆయన విష్ణుశర్మ అన్నాడు. 'బతికామురా బాబూ' అనుకున్నాను. తక్కిన వాళ్ళందరూ ఒక్కపెట్టున అరిచారు 'మేము ఒప్పుకోము అంటే ఒప్పుకోము'

అన్నారు. వీరేశలింగముగారు వచ్చి చెప్పవలసిందే. ఏమి చేయాలి ? నే నన్నాను కదా సరే నయ్యా ఆయననే తీసుకరండి. ఆయన స్వర్గంమీద కోపం వచ్చి వెళ్ళా డంటున్నారుకదా. కనీసం నా మీద దయ తలచి రమ్మనండి. అనడిగాను. చాలా సేపటికి ఆ వీరేశలింగంపంతులు వచ్చాడు. ముసలివాడు. కత్తిరించిన మీసాలు ఉన్నట్లున్నవి. ఏదో యెఱ్ఱని గుడ్డ తలపాగా చుట్టాడు. నల్లనికోటు తొడుక్కున్నాడు. వచ్చాడు, నిలుచున్నాడు. చిన్నయసూరి వచ్చి ఇంద్రుడికి దండం పెట్టాడు కాని ఈయన పెట్టలేదు. నా గుండెలో రాయిపడ్డది. ఏదో పెందలకడ తేల్చుకుందామని. 'ఏమండీ వీరేశలింగంగారూ సంస్కృతంలో పంచతంత్రం వ్రాసిన దెవరు?' అన్నాను. 'ఆయన ఎవరో తెలియదు. అనాదినుంచి ఆ గ్రంథం వస్తూ వున్నది. శతవిధాల ఆ కథలన్నీ గ్రీసుదేశమునుండి వచ్చి వుంటవి. ఎవరో వాటిని సంస్కృతంలో వ్రాసి ఉంటారు. ఒకడు వ్రాశాడని చెప్పడానికి వీలు లేదు. భారతం అనేది వ్యాసు డనేవాడు వ్రాశాడు కనుకనా అనేకమంది వ్రాశారు. చివరకి వ్యాసుడిపేరు పెట్టారు. అట్లాగే పంచతంత్రమున్నూ. ఏదో పిల్లలకోసం వ్రాశాడు. అది ఒక పెద్దగ్రంథ మేమిటి ?' అన్నాడు. 'నేను అది అంత పెద్దగ్రంథం కాకపోతే మీరు తెలుగు ఎందుకు వ్రాశారు' అన్నాను. చిన్నయసూరి అన్నాడుకదా అది తెలుగు కాదయ్యా పాషాణం. నేను చక్కగా మిత్రలాభం సులభంగా రమ్యంగా మధురంగా వ్రాశాను. మిత్రభేదం కొంచెం కఠినంగా వ్రాశా ననుకోండి. అయినా తెలుగు వచనంతో పరమ రమణీయమైన శైలిలో వ్రాశాను. ఈ కాలంలో నిజంగా తెలుగువచన గ్రంథాలు అని చెప్పాలి అంటే నేను వ్రాసిన నీతిచంద్రిక ఒకటి, భారతసావిత్రి ఒకటి ఇవి రెండే అన్నాడు. ఆ మూగిన వందమందికీ చెప్పటానికి వీలులే నంతకోపం వచ్చింది. ఆ ఆ యే మన్నావు. వీరేశలింగం పంతులుగారినే కాదంటున్నావా ? ఆయన గద్యతిక్కన. ఏమి టనుకుంటున్నావు ? చిన్నయసూరీ ! నీవు వ్యాకరణం వ్రాశావు. నీ వ్యాకరణ మంతా ముక్కలు ముక్కలు చేసి పారేశా. మా వా డొకడు నీ కంత్యక్రియలుచేశా డిదివరకే. అసలు నువ్వు బ్రదికిలేవు. ఇది పూర్వకాలపు స్వర్గంగనక ఇక్కడికి వచ్చావు. తొందరపడకు. రేపు ప్రొద్దున మా వాళ్లు ఈ స్వర్గంలోకి ఒక రాకెట్ పంపిస్తారు. దీన్ని ఆక్ర మిస్తారు. అప్పుడు నీ యింద్రుడూ, నీ చిన్నయసూరి, నీ వన్నయభట్టూ వీళ్ళ బ్రతుకు లేమౌతవో చూస్తాం" అన్నారు. వీరేశలింగం పంతులుగారు 'ఛీ ! అసలు ఇక్కడికి రావటమే తప్పని వెళ్ళిపోయినాడు. నేను ఇంద్రునితో చెప్పాను. 'అయ్యా మీరి బాధ పడలేరు. నేను మళ్ళీ భూలోకానికి వెళతాను. ఇప్పటి చదువులే చదువుకుంటాను. ఏదైనా మళ్ళీ ఒకగ్రంథం వ్రాస్తాను అన్నాను. ఇందుడు ఏమంటాడు, సరే నన్నాడు. నేను వెళ్ళబోతూ ఉంటే

ఇంద్రుడు కన్ను గిలిపాడు—ఆగమని. వాళ్ళందరూ నెమ్మది. నెమ్మదిగా ఎవళ్ళదారిని వాళ్లు వెళ్ళారు. వాళ్ళు వెళ్లిన తరువాత ఇంద్రుడు నాతో రహస్యంగా ఇల్లాచెప్పాడు. "వాళ్ళందరితో నీ కేమిటయ్యా! వాళ్ళేమి ఇక్కడ స్థిరంగా ఉండేవాళ్ళా పెట్టేవాళ్ళా? వాళ్లు ఇక్కడ ఉన్న నాలుగు రోజులూ నే నేమీ అనటానికి వీల్లేదు కనుక ఊరుకున్నాను. ఈ నాలుగు రోజులూ అయినతరువాత చెపుతాను వీళ్ళపని. మన ఇంట్లో పెళ్ళి జరుగుతుం దనుకో. ఎవడో వచ్చి అల్లరి చేస్తాడు. మనపెళ్లి రసాభాస ఔ తుందని వాణ్ణి కొంచెం సర్ది పంపిస్తాము. పెళ్ళి అయిన తరువాత మళ్ళీ ఒకసారి పిలిచేదీనూ నీవు విమానంమోత మోగించేదీనీ. వాళ్ళపని తరువాత ఉన్నదిలే. అయినా నీవు భూలోకానికి వెళతానన్నావు. నీకా ఊహ వచ్చింది కనక వెళ్ళితీరాలి. మళ్ళీ ఒక తల్లిగర్భాన పడటం గర్భనరకవాసం చేయటం ఇవన్నీ అక్కరలేదు. భూలోకంలో ఒక డున్నాడు. వాడిదగ్గరకు వెళ్ళు. వాడు నిన్నాద రిస్తాడు. వాడు నీకు ఇంగ్లీషు చదువు చెపుతాడు"అన్నాడు. నేను వాడికి తెలుగూ సంస్కృతమూ వచ్చునా అని అడిగాను. ఇంద్రుడు "వాడు వచ్చు ననే అను కుంటాడు. ఇప్పు డక్కడ ఉన్నవాళ్ళందరూ అం తే. అందులో వీడు కొంచెం నయం. గుడిలో మెల్ల. ను వ్వేదన్నా శ్లోకం చదివితే వా డర్థ మైనట్లు నటి స్తాడు. అది నయం కాదా! నిన్ను మ రెవ్వరిదగ్గరి కయినా పంపిస్తే వాళ్లు సంస్కృతం చచ్చిన భాష. నా దగ్గర సంస్కృతం మాట్లాడావా నిన్ను ఖైదులో వేయిస్తా మంటారు. కనుక వాడిదగ్గరకే వెళ్లు. మొదట కలలో కనిపించు. నాల్గురోజులు మాత్రం నీ కాకలి లేకుండా చేస్తాను. భూలోకంలో ఆకలేయకుండా ఉండటం కష్టం. తరువాత నీ ఏంగ్లీషు చదువుకో. ఏదన్నా ఉద్యోగం చేయి, నీబ్రతుకు నీవుబ్రతుకు. ఇప్పుడే చెపుతున్నాను. అక్కడ నీకు విసుగుపుడితే వెంటనే వచ్చేసేయి. స్వర్గంలో నీ యిల్లు ఖాళీగానే ఉంచుతాను. పైగా నీవు ఇంగ్లీషు నేర్చుకొనిరా. నాకుకూడా చెపుదువు గాని. వీళ్ళందరూ ఇంగ్లీషులో మాట్లాడు తున్నారు. నాకు తెలియ దాయెను. కనీసం వాడుకునే మాటలన్నా నేర్చుకునిరా. ఆ హిందూదేశంలో ఆడవాళ్ళకు కూడా ఇంగ్లీషు మాటలు చాలా వస్తవట. ఆ భాష బలేభాషలే! నాకు యెవడో చెప్పాడు. దేవుడూ, కుక్కా, ఒకటే అట. కుక్కని తలక్రిందులుగా నిలుచో బెడితే దేవు డౌతాడట. మన కెందుకు? అదంతా విష్ణుమూర్తి చూచుకోవలసిన పని. ఆయన పాపం అన్ని అవతారా లెత్తినాడు కాని కుక్క అవతారం ఎత్తలేదు" అంటే నే నన్నాను. "ఆయన బదులు శివుడు ఎత్తాడు కదా" అని ఇంద్రుడు 'ఇంకా ఏం నీకు తప్పకుండా ఇంగ్లీషు వస్తుంది. నీవు దారిలో ఉన్నా వన్నమాటే, వెళ్ళ' మన్నాడు. నేను ఎల్లా వెళ్ళను? అన్నాను. ఎప్పుడు వెళ్ళమంటారు అన్నాను. ఇంద్రుడు 'అతడు రోజూ నిద్ర

పోతూ ఉంటాడు మధ్యాహ్నపు పూట. ఇప్పుడు వెళ్ళు. కలలో కనిపించు. తక్కినవిళ్లన్నీ అతడే చేస్తాడు అన్నాడు. నేను వచ్చాను. ఇదీ నా కథ. పాల ముంచినా నీటముంచినా నువ్వే' నన్నాడు. నేనన్నానుకదా ! 'మాకు పాలూ నీళ్ళూ రెండు విడివిడిగా ఉండవు. కలిసే ఉంటయి. ఇల్లు దూర మైనకొద్దీ నీళ్ళెక్కువ కలుస్తవి' అని. విష్ణుశర్మ అన్నాడు. 'ఇల్లుదూరం కావట మేమిటి' అని. నేను చెప్పాను. 'మాకు పాలుపోసేది ఉన్నదయ్యా ! అది మాచవరం నుంచి వస్తుంది. దానికి ఒకగేదో రెండుగేదెలో ఉన్నవట. ఆ గేదెలు పాలు ఇచ్చినాసరే, ఇవ్వకపోయినాసరే అది రోజూ నాలుగు చెంబులనిండా పాలు తీసుక వస్తుంది. దారి పొడుగునా ఒక పాతిక ఇండ్లల్లో పోసి వస్తూ ఉంటుంది. మాయింటికి వచ్చేటప్పటికి నాలుగుగిన్నెలూ నిండానే ఉంటవి. వాళ్ళ కెట్లా పోసిందంటావు. అంటే తాత్పర్య మేమిటంటే రెండిండ్లల్లో పాలు పోస్తుంది. ఆపాలవారడి మళ్ళీ నీళ్లుపోస్తుంది. ఊరు చివరదాకా ఇల్లా పోస్తూనే వెళ్ళుతుంది. చివరకు అవి పాలు అనటానికి గుర్తేమిటంటే అవి తెల్లగా ఉంటవి. దాని పుణ్యమా అని తెలుపుకూడా విరిగేటట్లు పోయదు. అందుచేత నేను పాలల్లో ఒకసారి, నీళ్ళల్లో ఒకసారి, రెండుసార్లు ముంచట మనేది లేదు. నేను ఒకసారే ముంచుతాను. అంటే ఏమిటంటే మీకు ఇంగ్లీషూ తెలుగూ కలిపి చెపుతాను. మీకు తెలుగు వచ్చునా?"అంటే అయన 'నేను తెలుగు వాణ్ణే నయ్యా !' అన్నాడు. నాకాశ్చర్యం వేసింది, మీరు తెలుగువాళ్ళా అన్నాను. మరి ఇంటిపేరు లేదేమి అన్నాను. అంటే ఆయన 'పూర్వకాలంలో ఈ దేశంలో ఇంటి పేర్లుండేవి కావు. నన్నయ్య కింటిపే రేమిటి ? శ్రీనాథుడి కింటి పేరేమిటి?' అన్నాడు. నేను 'మా పరిశోధకులు వాళ్ళకు గూడా ఇంటిపేర్లున్న వంటున్నారే. సరే అదంతా ఎందుకు. నేను ఇక్కడి నుంచీ ఉపన్యాసా లిచ్చేటప్పుడు 'పంచతంత్రం వ్రాసిన విష్ణుశర్మకూడా తెలుగువాడే' అని చెపుతాను అన్నాను. ఆయన 'ఉపన్యాసా లివ్వటమేమిటి' అన్నాడు. అని ఏదైనా శాస్త్రచర్చ చేస్తారా? స్వమతం స్థాపించి పరమతం ఖండిస్తారా? శాస్త్రాల్లో ఉన్నవిషయాలని గురించి చెపుతారా? అదా ఉపన్యాసం అంటే అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. నవ్వాను. నాకు మెలుకువ రాలేదు. నాకు రాదని తెలుసు. ఎందుచేతనో తెలుసునా? ఈ విష్ణుశర్మని ఇంద్రుడుకదా పంపించాడు? నాకు కలలో కనిపించమని పంపించాడు కదా? అందుచేత నాకలని ఇంద్రుడు పోగొట్టడు. మరి నేనిట్లా చెప్పాను. "ఉపన్యాసాలంటే మీకు తెలియవు. శాస్త్రాలూ చర్చలూ, పూర్వపక్షాలూ సిద్ధాంతాలూ అవన్నీ బి.సి. నాటి మాట అన్నాను. ఆయన బి.సి. నాటి మాటలేమిటి? బి.సి. అని ఎవరైనా గొప్పరాజు ఉన్నాడా అన్నాడు. నేను బి.సి. అంటే Before Christ. ఇప్పుడే చదువు చెప్పటం

మొదలు పెడుతున్నా ననుకో. క్రీస్తు అనే వాడొకాయన ఉన్నాడు. ఆయన దగ్గరనుంచీ సంవత్సరాలను లెక్క వేయటం మొదలు పెట్టాము. ఇప్పటికి పందొమ్మిది వందల అరవై ఏళ్ళయింది. ఈ పందొమ్మిది వందల అరవై యేళ్ళల్లో ఏది జరిగితే అదే నిజం. తత్పూర్వం జరిగింది నమ్మటానికి వీలులేదు. ఏదైనా విశ్వసించటానికి వీలులేని మాటలు చెపితే అవన్నీ బి.సి. మాట లంటాము. విశ్వసించటానికి వీలున్నా ఇప్పుడా పప్పు ఉడకవనే అర్థంలో అంటాము అని ఆయనతో ఇదికొత్త మాట వ్రాసుకోండి అన్నాను. ఆయన నాకు వ్రాత చేతకాదు అన్నాడు. నే నన్నాను 'అయితే బాబూ! మీరు వెంటనే స్వర్గానికి దయచేయండి, ఆయింద్రు డెల్లాగూ మిమ్మల్ని రమ్మన్నాడుకదా! ఇక్కడ వ్రాయటం చేతకానివాళ్ళు ఎందుకూ పనికిరానివాళ్ళు. వాళ్ళు చవటలు' అన్నాను. ఆయన "అదేమిటయ్యా! నాకు వ్రాయటం చేతకా దనుకో. నేను పెద్ద పండితు ణ్ణాయెను. అక్షరాలు నాకు తెలుసు. చూచి చదవగలను! వ్రాయటం అలవాటు చేయలేదు. ఏదో అది గుమా స్తాలు చేసే పని. పండితులు వేరే ఉంటారు. వ్రాయసగాళ్ళు వేరే ఉంటారు." అన్నాడు. నే నన్నాను. "మేమందరమూ వ్రాయసగాళ్ళమే. పండితులు ఉంటే ఉంటారు. లేకపోతే లేదు. ఉండవలసిన అవసరంలేదు. ఇప్పుడూ ఉన్నారనుకోండి. వ్రాయసగాళ్లుందరు. Type writers ఉంటవి. పెద్ద పెద్ద అధికారులు చెపుతూ ఉంటే ఆ యంత్రంమీద కొడుతూ వుంటారు. గొప్ప పాండిత్యానికదే లక్షణ మనుకోండి. అది పాండిత్య లక్షణం కావటం కంటె అధికారి లక్షణం. సరే మీకు చదవటం చేతనయితే అక్షరా లెంతసేపు నేర్చు కోవాలె' అన్నాను. ఆయన 'మీ ఉపన్యాసాల మాట ఏమిటి?' అన్నాడు. నే నన్నాను 'నే నీ దేశంలో గొప్పవక్తలలో ఒకణ్ణి. నాదగ్గర కొన్ని విష యాలు ఉన్నవి. నన్ను ఉపన్యాసాలకు పిలుస్తూ ఉంటారు. నేను వెళ్లుతూ ఉంటాను. అంటే ఆయన ఎందుకు అన్నాడు. "నేను ఎందుకు ఏమిటి ? ఉప న్యాసాల కోసమే ఉపన్యాసాలు. మేము ఏ పనీ ఎందుకూ చేయము. మాకు అనేక హైస్కూళ్ళు ఉన్నవి. కాలేజీలు ఉన్నవి. లైబ్రరీలు ఉన్నవి. ఆంధ్ర వారోత్సవాలు చేస్తూ ఉంటారు. స్కూళ్ళల్లో inaugural addresses అనీ valedictory addresses అనీ అనగా ప్రారంభోపన్యాసములూ, అంత్యో పన్యాసములు ఇప్పిస్తూ ఉంటారు. ప్రతి కళాశాలలో తెలుగుభాషా సమితులు ఉంటవి. వాటికి మమ్మల్ని పిలుస్తూ ఉంటారు' మేము వెళ్లుతూ ఉంటాము. ఉపన్యాసా లిస్తూ ఉంటాము." అంటే ఆయన ఏమి చెపుతారు అన్నాడు. నేనన్నాను. "మాలో ఒక్కొక్కడికి కొన్నికొన్ని అభిమాన విషయా లుంటవి. నాకు నాలుగైదు విషయా లున్నవి. ఒకటి మన ఆంధ్రజాతియొక్క గొప్ప దనము. రెండవది వేమన్న కవిత్వము. మూడవది తెలుగు సారస్వతము మీద

ఇంగ్లీషుభాషా ప్రభావము. ఇవి మూడే నేను ముఖ్యముగా చెప్పే ఉపన్యా
సాలు. అనగా విష్ణుశర్మ 'ఎప్పుడూ ఇవే చెపుతారా విన్నవే వింశే వాళ్ళకు
విసుగు పుట్టదా' అన్నాడు. నేను నవ్వి అన్నాను. "వాళ్ళు ఎప్పుడూ
వినరండీ. సభలో కూర్చున్న వాళ్ళందరూ వాళ్ళల్లో వాళ్ళు నవ్వుకొంటూ
ఉంటారు 'మాట్లాడుకుంటూ ఉంటారు. వాళ్ళు విననే వినరు. వాళ్ళదారి
వాళ్ళది. నా దారి నాది. వాళ్ళు ఒక్కశే వింటారు. వాళ్ళని వినిపించే
అందుకు మధ్యమధ్య మేమందరమూ కొంచెం శృంగారరసవిషయకంగా
కొద్దిగా అసభ్యంగా మాట్లాడుతూ ఉంటాము. వాళ్ళు దానిని మాత్రం
వింటారు. ఆ విన్నప్పుడు వాళ్ళు పెద్దగోల చేస్తారు. అందుచేత వాళ్ళు మా
ఉపన్యాసాలు వింటా రనిలేదు. ఒకశే ఉపన్యాసం ఎన్నాళ్ళు చెపితే మాత్రం
ఏం ? ఈ మూడు విషయాలతో ముప్పై ఏళ్లు గడిపాను. ఏమో ! ఇంకొక
పదేళ్ళు గడవక పోతుందా ?" అన్నాను. ఆయన సరే రేపటినుంచి నాకు
చదువు చెప్పండి అన్నాడు. నాకు ఒక్కశే దిగులు ఇంకా మూడురోజులు
ఫరవాలేదు. తరువాత ఈయన మన ఇంట్లోనే తిష్ఠ వేసేటట్లు ఉన్నాడే అని.

# మూడవ అధ్యాయము

ఇంత సేపూ వింటూ నిల్చున్న తిక్కన్నగారు "వేమన్న గూడ కవేనా" అన్నాడు. నాకాశ్చర్యం వేసింది. సహజమేగదా. ఒక గొప్పకవిని చూస్తే ఇంకొక కవికి మాత్సర్యం ఉండటం అనుకొని 'కవేమిటి? గొప్పకవి, ఎంత గొప్పకవి అంటే మేమందరం మీ అంత గొప్పకవి'' అని అనుకుంటున్నాము అన్నాను. ఆయన కొంచెం మొగం చిట్లించుకున్నాడు. ఏమండీ అలా చిట్లించు కుంటారన్నాను. ఆయన అన్నాడు. "నాకేమోనయ్యా అర్థంకావటం లేదు. మీరందరూ వేమన్న నా అంతటి కవి అంటూంటే నా మనస్సుకే భ్రాంతి కలుగుతున్నది. మేమెప్పుడూ అనుకోలేదు. ఆయనను కవే అనుకోలేదు. ఏదో యోగి; పద్యాలు వ్రాసుకున్నాడు. ఆ పద్యాలు ఎవళ్లు పడితే వాళ్లే వ్రాయ వచ్చు" అని ఆయన అంటూండగా నేనన్నాను. అవునండీ ఇప్పుడా వేమన్నకి మల్లే మా దేశంలో చాలామంది వ్రాస్తున్నారు. అంతకన్న కూడా బాగా వ్రాస్తున్నారు. అసలు కొందరు కవుల ప్రతిష్ఠ అట్లా వ్రాయటం మీదనే ఆధార పడింది కూడాను. అంటే ఆయన "అదేమి కావ్యమా. ఒక రసముందా? వైదిక మతంలో ఉన్న కొన్ని ఆచారాలు నిందించటం మొదలైనవి చేశాడు. వాళ్లకి మన సంఘం, సమాజం అర్థం కాలేదు. అర్థంకాని వాళ్లు అట్లాగే వ్రాస్తారు. అయినా అది రచన యేమిటి? అట్లా అయితే వచనం మాత్రం కవిత్వం ఎందుకు కాకూడదు" అన్నాడు. నాకు పట్టు చిక్కిందిరా అనిపించింది. నే నన్నాను కవిత్వ మనేది పద్యాన్ని ఆశ్రయించే ఉంటుందా? అసలు కవిత్వ మనే వస్తువు వేరే ఉంటుంది. అది ఒక్కొక్కప్పుడు పద్యంగా ఉంటుంది. ఒకొక్కప్పుడు గద్యంగా ఉంటుంది. మరి ఒకొక్కప్పుడు గద్యంగా పద్యంగా ఉంటుంది అన్నాను. ఆయన "ఇంతేనా ఇంకో విధంగా కూడా ఉంటుందా?" అని ఆక్షేపించాడు. నాకు కోపం వచ్చింది. ఏదో తిక్కన్న గదా అని ఊరుకున్నాను. అయినా మళ్లీ అన్నాను. "వేమన్న కవికాదా అండి. కవి అని ఎవరన్నారో మీకు తెలుసునా? ఎవరు మిమ్మల్ని మహాకవి అనిఅన్నారో ఆయనే వేమన్నను కూడా మహాకవి అన్నారు. తెలిసిందా" అంటే తిక్కన్న "దానికేమి లేవయ్యా! ఒక చోట పొరపడవచ్చు" అన్నాడు. నేను "పొరపడితే మీరు పడాలి. ఆయన పడేవాడే కాదు. ఇంతలావు పుస్తకం రాశా డండి. అది మా విశ్వవిద్యాలయాలల్లో పాఠ్యగ్రంథంగా మేమందరం చదివాము.

రచనలో ఎన్ని మెలకువలు ఉండాలో అన్ని మెలకువలూ ఆయన దగ్గర ఉన్నవి. ఎంత భావమైనా సులువుగా చెపుతాడు. సంఘాన్ని విమర్శిస్తాడు. దురాచారాలను ఖండిస్తాడు. ఉపమాలంకారాలను దొర్లిస్తాడు. తెలుగు పలుకుబడి ఆయనకు స్వాధీనమై ఉన్నది. ఆటవెలది ఆయన చేతిలో ఉన్నది." అన్నాను. అంటే తిక్కన్న "ఔనయ్యా! అందుకనే ఆయన యోగి అయినాడు. నువ్వుకూడా ఒక ఆటవెలదిని పట్టుకో. నువ్వుకూడా యోగి వవుతావు" అన్నాడు. నేను ఇప్పుడు మా దేశంలోనుంచి ఆటవెలదులను తీసివేశాం. వాళ్ల బదులు పాటవెలదులను పెట్టాము." అనగా తిక్కన్న "ఇంక మీరు వచ్చినా యోగులు గారు" అన్నాడు, నాకు కోపం వచ్చి "యోగులేమిటయ్యా మా వాళ్లేమంటున్నారో తెలుసునా. యోగి అనేవాడు స్వార్థపరుడు. తన కొక్కడికే ముక్తి కావాలని కోరుతూ ఉంటాడు. అటువంటి ముక్తి కోరకూడదు. అది తప్పు. మీ పూర్వులభ్యాలన్నీ ఇట్లాంటివే. వా టన్నింటికీ మే మెదురు తిరిగాము. అదట్లాఉంచి వేమన్న నీ అంతటికవి అంటేనే నీకింత ఎగేసుకు వచ్చిందే. మీ యిద్దరి అంతవాడు ఇంకొక డున్నాడు. ఆయన పేరు చెపితే నీవు మళ్లీ భూలోకం వైపు చూడకుండా వెళతా వనుకుంటున్నాను. ఎందుకంటే ఆ వేమన్న కనీసం పద్యాలన్నా వ్రాశాడు. ఆటవెలదులో, తేటగీతులో, కందాలో వ్రాశాడు. ఈ మూడవ ఆయన పద్యమనేది వ్రాయలేదు. వ్రాశాడేమో నాకు తెలియదు. ఒకవేళ నాకు తెలియకుండా వ్రాసి ఉన్న పద్యా లుంటే ఆ పద్యాల బలంచేత మాత్రం కాదు మేము ఆయన్ని నీ దగ్గర నిలబెట్టడం. నన్నడిగితే ఒకవేళ వేమన్న నీతోపాటువాడేమో గాని, ఆయన మీ యిద్దరికంటే గొప్పవాడు. ఇంత గొప్పవాడని చెప్పటానికి వీల్లేదు. ఈ మధ్య మా వాడొకడు వ్రాశాడు. 'అది వరకు ఉన్నదంతా తెలుగుభాష కాదు. తెలుగు కవిత్వం కాదు. తెలుగుకవిత్వం ఆయనతోనే మొదలు పెట్టింది' అని ఆయనంతవాడు. మరి ఆయనమాట ఏం చెప్పావు" అన్నాను. అని ఊరుకున్నాను. ఎందు కూరుకున్నా నంటే ఆయన పేరు చెప్పమని తిక్కన్న అడుగుతాడని. నేను ఫిరంగిని పేల్చినట్లుగా ఆయనపేరు-చెపుదామని, దానితో ఉచ్చాటనమంత్రం పూర్తి అయిపోతుం దని. ఈయనకూడా నానెత్తిన గూర్చుంటే నేనేం చేయను ? ఆ విష్ణుశర్మ కొంచెం సాధువల్లే ఉన్నాడు. ఆయనతో ఎట్లాగో ఒకట్లా వేగవచ్చు.. ఈయన నా మీద అధికారం చేసే అట్టున్నాడు. ఈయన యింట్లో కూచుని అక్కడికి వెళ్లి ఆపని చేసిరా, ఇక్కడికి వెళ్లి ఈ పని చేసిరా, నా చెప్పు ఉంగటం ఊడింది బజారుకు వెళ్లి మేకు వేయించుకురా, నా గడ్డం మాసింది మంగలివాణ్ణి పిలుచుకురా, అని నామీద భార్షికపు పంతులుగిరీ సాగిస్తా డల్లే ఉంది.

ఈయన దగ్గర దమ్మిడీ లేదు. ఈ ఖర్చంతా నాది. డబ్బు వదలి కనిపట్టైనసీ నాడబ్బుతో ఈయ న్నింట్లో కూర్చోపెట్టి ఈ ఒత్తులన్నీ ఎక్కడ ఒత్తేను. అందుచేత ఆయనపేరు చెప్పలే. అడిగితే పెద్దగొంతుకతో బ్రహ్మాండంగా చెపుదా మనుకొన్నాను. నా యింతటి యెత్తూ వృథా అయిపోయింది. ఈ తిక్కన్న ఆయన పేరేమిటి అని అడగలేదు. అడగలేదు సరికదా అన్నాడు. "సరేలే పోనీ, నేనూ వేమన్నా ఒక్క మోస్తరు కవులం. ఆ మూడోవాణ్ణి ఇంకొకణ్ణి తీసుకవచ్చి మా నెత్తిన ఎందుకు పెడతావు" అని. నేను తప్పించుక పోతున్నాడురా అనుకొన్నాను. నే నెందుకు ఊరుకుంటాను. నే నన్నాను గదా "నే నెక్కించేది కాదు. ఆయన ఇదివరకే ఎక్కి కూర్చున్నా" డన్నాను. నా ఉద్దేశం తల తడుముకుంటాడని. ఆయనకి నదురూ బెదురూ లేదు. "నా నెత్తిన ఎవడు కూర్చుంటాడు. రా పో" అన్నాడు. "నాదాకా వస్తేకదా, నా నెత్తిమీద ఎక్కటమో ఎక్కకపోవడమో. దూరంగా ఉండగానే నేనొక్క చూపు మాస్తాను. వాడు తాసాలుబందయి తోక ముడవాలి. ఇదేం మజా అనుకున్నావా" అన్నాడు. నేను చూచాను. ఆ విష్ణుశర్మ మధ్యమధ్య నన్ను ఏమండీ అన్నాడు కూడాను. ఈయన నన్ను ఏంరా అనటం మొదలు పెట్టాడు. ఈయనని ఇంట్లో పెట్టుకున్నానా నాటంగు తెగిందే. ఆపేరు అడగడాయె, అంత లెక్కదాయె. ఓరి బాబోయి ఇంత అహం కార మేమిటి అనుకున్నాను. మళ్ళీ అనిపించింది అడుగకపోతే మానె చెపు దాము. చెప్పినతర్వాత అయినా గాబరా పడడా అనుకున్నాను అని. ఆమూడో ఆయనపేరు మీరు వినలేదు గనుక మీరింత దర్జాగా మాట్లాడు తున్నారు. వింటే ఈపాటికే గుండెలో రాయిపడేది. అన్నాను. ఆయన "నువ్వు చెప్పట మెందుకు. నా గుండెలో రాయిపడట మెందుకు? తీరా నీవు చెప్పిన తరువాత నా గుండెలో రాయిపడకపోతే ఆరాయి నీగుండెలో పడుతుంది. నీ గుండెలో రాయిపడటం మాత్రం నాకిష్టంలేదు. నీతో నేను పనుండి వచ్చాను. నాపని అయిన తరువాత ఆరాయి నీగుండెలో పడవేసుకో, మాను." అన్నాడు. ఇంక నాకేం గతి? నాకేమీ లేదు భయం మళ్ళీ విష్ణుశర్మలా ఈయన ఇంక ఏదోకథ మొదలు పెడతాడు. విష్ణుశర్మ స్వర్గంలో జరిగిన చిన్న రివల్యూషన్‌ని గురించి చెప్పాడు. ఈయన ఏంచెపుతాడో తీరా అక్కడి అప్సరస్త్రీల గూడెంలో జరి గిన విషయాలు నానెత్తిన క్రుమ్మరిస్తాడేమో అందుచేత ఇంక కొంత ఆలస్యం చేద్దామని "అయ్యా ఆరాయి నాగుండెలో పడితే పడనివ్వండి. నేను చెప్పేదే నిజం' అన్నాను. ఆయన "చెపితే చెప్పుకో వోయి. ఏమిటో బెదరిస్తా వేమిటి? ఊరిస్తా వేమిటి? నాకేం బాగాలేదీ తరహా "అన్నాడు. నేను "ఆయన కేమీ ఉభయకవిమిత్రుడన్న బిరుదు లేదు. కవిబ్రహ్మ అన లేదు. ఆయన యేమీ యజ్ఞం చేయలేదు. నిజంగా కవి అవటానికి ఇవేమీ అక్కరలేదు" అన్నాను.

అంటే తిక్కన్న అన్నాడు: "కవి అవటానికి అక్కరలేదురా! భారతం వ్రాయటానికి కావాలి? నువ్వు లిల్లాయిపదాలు వ్రాసుకో. ఊరూరా యెన్ని ఉన్నవి. చింత చెట్టెక్కిన వాళ్ళను గురించి కూడా పాటలు ఉన్నవి. రావి చెట్టెక్కిన వాళ్ళను గురించి కూడా ఉన్నవి. వాటికి యజ్ఞం చేయ అక్కర లేదు. భగవంతుడైన వ్యాసుడు వ్రాసిన భారతాన్ని తెలుగు చేయవలె నంటే యజ్ఞం చేయవలె" అన్నాడు. నేను నవ్వి "స్వామీ! ఈ బుకాయింపులు అట్లా పెట్టండి. భారతం మీ రొక్కరే వ్రాయలేదు. నన్నయ్య వ్రాశాడు. ఎఱ్ఱయ్య వ్రాశాడు. వాళ్ళిద్దరూ యజ్ఞాలు చేయలేదు. ఇప్పుడు మా దేశంలో రక రకాల భారతాలు వ్రాస్తున్నారు. వాళ్ళల్లో యెవ్వడూ యజ్ఞం చేయలేదు. కనుక కొంచెం కట్టిపెట్టండి. ఆ మహాకవి ఉన్నాడే, ఆయన కీ బిరుదులన్నీ లేవు. ఆయన అచ్చమైన కవి. ఆయనపేరు చెపుతున్నాను. చెపుతున్నాను. చెపుతున్నాను. ఒకటోసారి రెండోసార్రి చెప్పి వేస్తున్నా. ఏమంటావు" అన్నాను. ఆ తిక్కన్న కడుపుబ్బ నవ్వాడు. నే ననుకున్నాను "ఈయన చాలా గండాగొండువాడు. ఓరి బాబోయి! ఇంకో డయితే ఈపాటికి శరీరా వయవాలన్నీ కుంచించుకు పోయి, పెదవు లెండిపోయి, కళ్ళు తేలిపోయి, గుండె దడపుట్టి 'చచ్చాముగా బాబూ! ఎవడి పేరు వస్తుందో' అని కంపనపడ్డ కాకివలె కారాడే వాడు. ఈయన బెల్లము కొట్టిన రాయల్లే నిలుచున్నాడు. ఈయన కేమీ చీమకుట్టినట్లుకూడా లేదు" అనుకొని ఇంతదూరం వచ్చి వెనక్కి మళ్లటమెందుకని తరహాకొంచెం మళ్ళించి ఇల్లా అన్నాను. "అయ్యా! తిక్కన్న గారూ! మీరు ఎంతనిర్భయస్థులైనా, ఎంతకవిబ్రహ్మలైనా, ఎంత ఉభయకవి మిత్రులైనా ఎఱ్ఱాప్రెగ్గడ ఎంత మీ శిష్యుడైనా, నాచనసోమన్న మిమ్మల్ని ఎంత అనుసరించినా, 'తన కావించిన సృష్టి తక్కొరుల చేతన్ కాదునాన్'" అని మిమ్మల్ని గురించి ఎవడో ఎంత అన్నా, యథార్థమైన ఆధునిక విమర్శ సూత్రాలవల్ల, నేడు పొందిన భాషాపరిణామంవల్ల, నేడఖండంగా ప్రపంచంలో చెలరేగుతున్న మహా విజ్ఞానజ్యోతి ప్రభావం వల్ల, పూర్వపు చిత్తాలన్నీ తిరిగిపోయినవి. లెక్కలు తారుమారయినవి. మీరు ముగ్గురూ ఒకటే మోస్తరు కవులు అని మేము తీర్మానించాము: మొదటమీరు, రెండవది వేమన్న, మూడవది గురజాడ అప్పారావు పంతులుగారు. కాలక్రమేణా మొదట మిమ్మల్ని చెప్ప వలసి వచ్చింది తప్ప, లేకపోతే మొదటే ఆయనని చెపు తాము" అన్నాను. అంటే తిక్కన్న "ఎవరాయన? ఆయన పేరు నేను వినలేదే. ఆయన బ్రతికి ఉన్నాడా, చనిపోయినాడా?" అన్నాడు నేను: "భూలోకపు లెక్కప్రకారమైతే చనిపోయినాడు" అన్నాను. ఆయన 'స్వర్గానికి రాలేదే' అన్నాడు. అంటే నే నన్నాను "స్వర్గానికి రావలసిన దుర్గతి ఆయనకేమి? ఇంకా వీరేశలింగం పంతులు గారు గనక కొంత మంచివాడు

గనక ఏదో పెళ్ళిళ్ళు మొదలైన వాని జోక్యం పెట్టుకున్నాడు గనుక 'ఛీ ఇల్లాంటి పాడు స్వర్గానికి నేనురాను' అన్నాడు కాని, మా అప్పారావు పంతులు గారు మీ స్వర్గం ప్రసక్తే ఎత్తడు. స్వర్గ మన్నమాట నోటితో ఉచ్చరించడు కదా! మీ స్వర్గానికి వస్తాడంటారా! కనుక అయ్యా అది స్వర్గానికి వచ్చే మేళం కాదు. ఆయన పరమస్వతంత్రుడు. స్వర్గం, వైకుంఠం కైలాసం, సత్యలోకం ఇల్లాంటి టూర్లు ఆయన దగ్గర పనికిరావు. అదట్లా, ఉంచి తిక్కన్న గారూ ఆ స్వర్గమూ వైకుంఠం కూలి పోనివ్వండి. కైలాస మన్నారు కదా! ఆ కైలాస పర్వతం హిమాలయాలమీద ఉన్నది. అక్కడికి మా టేన్సింగు వెళ్ళి వచ్చినాడు. అతనితోపాటు మరికొందరు దొరలుకూడా వెళ్ళారు. అంతదాకా ఎందుకు. నిన్నకాక మొన్న చీనావాళ్ళు కైలాస పర్వతం మీదికి వెళ్ళి అక్కడ జండా పాతారు. ఆ చీనావా ళ్ళొక్కవరకూ కైలాసపర్వతం ఎక్కడం చాలా కష్టమని మే మనుకొనే వాళ్ళం. వాళ్లు ఇట్లా బుడింగన ఎక్కి వచ్చారు. అంత సులభమైనది కైలాసం. కైలాసమే ఇట్లా అయితే మీ స్వర్గాన్ని గురించి ఇంక చెప్పాలా? మా అప్పారావుగారు మీ స్వర్గానికి రాలేదని ఏదో దర్జా పోతున్నారు. మీ స్వర్గానికి వచ్చి జండా పాతివచ్చే అందుకు అసలు మా అప్పారావుగా రెందుకంటా? బొడ్డూడని కవులు, కాలి గిట్టలు గిల్లని కవులు, మా వాళ్ళల్లో ఎవడు బయలుదేరినా మీ స్వర్గం హారోహారి రామార్పణ మవుతుంది. మా వాళ్ళని పంపిద్దా మను కున్నాము కాని మా వాళ్ళందరూ విజితేంద్రియులు, మహా ధర్మాత్ములూ. ఆ స్వర్గంలో వెలయాండ్రు ఉన్నారనటం మూలంగా మా వాళ్ళకు అసహ్యం వేసింది. ఛీ ఛీ స్వర్గంలో భోగపు పేటా? రంభా తిలోత్తమ ఊర్వశి ఘృతాచి, వీళ్ళందరూ దేవతాస్త్రీలా? వీళ్ళందరూ ఉంపుడుకత్తెలాయె. వాళ్ళకు నీతీ లేదాయె, జాతీ లేదాయె. అటువంటి అపవిత్రపు చోటికి మేము వెళ్లము అని వాళ్లు బద్ధకంకణులై యున్నారు. ఆ స్వర్గాన్నిగురించి ఆ వేలుపు వెలయాండ్రను గురించి అసహ్యించుకుంటూ మాకవు లెంతమంది వ్రాశారో చెప్పలేను. కనుక తిక్కన్నగారూ! అప్పారావుగారు మీస్వర్గానికి వస్తారని అనుకోకండి" అని నేను ఒక్కబిగువున ఉపన్యాసం చేశాను. ఇది అప్పారావు పంతులుగారి దగ్గర నేర్చుకొన్న విద్యే. అంటే ఆయన పుస్తకాలు చదివి నేర్చుకొన్న దన్నమాట. ఆ గిరీశం పూనాకి గాబోలు వెళ్ళి అక్కడ ఒక్క బిగువున ఉపన్యాసం చేస్తే అక్కడి ప్రొఫెసర్లందరూ డంగైనారట. ఆ ప్రయోగం తిక్కన్నగారిమీద చేస్తేగాని ఈయనరోగం కుదురదని చేశాను. రోగం కుదిరినట్టే ఉంది కొంతమట్టుకు. అసలు ఇది చూడండి "ఒక్కబిగువున గంటసేపు ఉపన్యాసం చేస్తే అక్కడి ప్రొఫెసర్లందరూ డంగైనారు." అన్న వాక్యంలో ఉన్న తెలుగుపలుకుబడి, తెలుగువాక్య పద్ధతి, నవీనభాషా సంప్ర

దాయులు తెలుగువాళ్ల గుండెలని పట్టుకొనే లక్షణం, తిక్కన భారత మంతా వెతకండి ఎక్కడైనా చూపించండి. అట్లా అనటం తిక్కన్నకి చేతకావటమే; ఎన్నిజన్మ లెత్తితే కావాలి. తనతోపాటు వేమన్ననే అంగీకరించని ఈయన అప్పారావుగారిని అంగీకరిస్తాడూ ? మళ్ళీ వచ్చి మన దేశంలో చదువుకుంటే, ఇంగ్లీషులో ఉన్న షోకు తెలిస్తే, తెలుగూ ఇంగ్లీషు కలిపి మనం ఎంత ఒడుపుగా వాడుతామో, ఆ ఒడుపు తెలియాలి. అప్పుడు గాని తిక్కన్నకు తెలియదు 'అయ్యో ! మన భారతమంతా వృథాగా వ్రాశాంరా' అని. అది కాకుండా ఇంకొకటి తెలియాలి. మనం సరదాగా ఎట్లా మాట్లాడుకుంటామో మనం ఎల్లా మారిపోయినామో మనం ఎల్లా ఆక్షేపించుకొంటామో, ఏదుష్టమైన భావాలు పెట్టుకోకుండా వట్టి చమత్కారము కోసం చమత్కారంగా, భీముడు గదాయుధాన్ని తిప్పినట్టు ( దుర్యోధనుని చంపేటప్పుడు కాదు. గరిడీలో అభ్యాసం చేస్తున్నపుడు, లేకపోతే సౌగంధికాపహరణానికి వెళ్ళే ముందు ద్రౌపదీ తానూ అడవిలో షికారు వెళ్లుతున్నారు చూడండి అప్పుడు ఆగదను ఎట్లా చేతికఱ్ఱను ఆడించినట్లు ఆడించాడో, పూర్వకాలపు జిల్లాబోర్డు మునసబులు ఒకమట్టలాగూ తొడుగుకొని ఒక పొట్టిచేతుల కోటు తొడుగుకొని, సాయంత్రంపూట ఊరిబయటికి ఒక రెండుమైళ్లు నడచివస్తూ ఉంటారు, వాళ్ళ చేతుల్లో ఉంటుంది చేతికఱ్ఱ అది ఆడినట్లు) అల్లాగా తెలుగుని వాడట మనేది తిక్కన్నకి తెలిస్తే, అప్పుడు తెలుస్తుంది మాగురజాడ అప్పారావుగారి రచనా సౌందర్యం. ఊరికే మేము భారతాలు వ్రాశాము, మేం స్వర్గాల్లో ఉన్నాము, అంటే తేలుతుందా? పిరిపంక ఎవరు చూచారంట! విశ్వవిద్యాలయాలల్లో గతిలేక వీళ్ళ పుస్తకాలలోంచి అక్కడక్కడ ఏ పది పద్యాలో ఏరి పిల్లలచేత చదివిస్తూ ఉంటే చదివినపిల్లలు పెద్దవాళ్లై ఆ పద్యాలే సభల్లో అప్పచెప్పుతూంటే ఈయన ఇంకా మహాకవి ననుకుంటున్నాడు. ఆ రోజులు వెళ్ళిపోయినవి తిక్కన్నగారూ ! నీ కన్న. పూర్వ మెప్పుడో వేమన్న మహాకవి అయినాడు.ఇప్పుడు వేమన్నా కాదు మీరూ కాదు తెలిసిందా అండి' అన్నాను. నా మనస్సులో తిక్కన్నగారిని గురించి ఇట్లా అనటం బాగా లేదు. కాని ఈయన నా ఇంట్లో తిష్ఠ వేస్తాడేమో అని భయం. ఎట్లాగైనా సరే, ఈయనని వెళ్ళగొట్టానా నెలకి కొన్నిబియ్యం కలిసివస్తవి. అని యిల్లా ఆయనని రకరకాలుగా ఆక్షేపించాను. చివరకు నాకు తెలిసిం దేమిటంటే నేను శతమొండినైతే, ఆయన సహస్రమొండి. ఆయన అన్నాడుకదా "ఒరే అబ్బాయి ! నీ పాండిత్యం నాకు తెలియక పోలేదు. మీరుపొందిన భాషా పరిణామం కూడా నాకు తెలుసు. అయినా నే నిక్కడి కెందుకు వచ్చానంటే ఒక్క ఉదాహరణ చెపుతా విను. పూర్వం మన దేశంలో వైష్ణవులూ, శైవులూ

గురువులుగా, - అయ్యావార్లంగార్లుగా ఉంటూ ఉండేవారు. వాళ్ళకి శిష్య సంచారం ఉండేది. వాళ్ళ వాళ్ళ శిష్యులు ఏ ఊళ్ళో ఏ ఊళ్ళో ఉన్నారో అక్కడక్కడికి వాళ్ళు వెళ్లి వాళ్ళ మతంలో ఉన్న కొన్ని మంచిమాటలు చెప్పి తీర్థమిచ్చి, ప్రసాదమిచ్చి శిష్యులేమైనా దక్షిణ లిస్తే పుచ్చుకొని వెళ్ళుతూ ఉండేవాళ్ళు. ఇప్పుడు ఆ పోడిమి అంతా పోయింది. ఎందుచేత నంటే వీళ్లు శిష్యసంచారం వెడితే, వాళ్ళు వీళ్ళని గురువులుగా అంగీకరించటమే లేదు. వాళ్ళకి మాగానులు పండుతున్నవి. ఇంగ్లీషు వచ్చింది. అందరూ ఉద్యోగస్థు లవుతున్నారు. అందుచేత వీళ్ళూ శిష్యసంచారం మానివేశారు. అయినా అప్పుడప్పుడు ఎవడో ఒకడు శిష్యసంచారం వెళుతూనే ఉన్నాడు. నిజానికి చాలామంది ఆ గురువులు వాళ్ళూ ఇంగ్లీషు చదువుకొని వాళ్ళూ ఉద్యోగాలలోకి దిగారు! అయినా తలకుమాసిన వాడెవడో సంచారానికి వెళ్ళుతూనే ఉన్నాడు. నేనూ అల్లాగే వచ్చానోయి, నేనూ స్వర్గంలో ఉండి ఆలోచించాను. 'మనంకూడా భూలోకంలోకి పోయి ఇంగ్లీషు చదువుకొని భారతం ఇంగ్లీషులో వ్రాద్దామా' అనిపించింది. ఆయనయెవరో రామాయణం ఇంగ్లీషులో వ్రాశాడట. భారతం కూడా వ్రాశాడట; కాని రామాయణానికి వచ్చిన ప్రతిష్ఠ భారతానికి వచ్చినట్లు లేదు. ఆ రామాయణానికి వచ్చిన ప్రతిష్ఠను చూచి వాల్మీకి, తులసీదాసు, భాస్కరుడు, రంగనాథుడు వీళ్ళం దరూ స్వర్గంలో గప్ చిప్‌గా కూర్చున్నారు. నే నోపిక పట్టలేకపోయినాను. నిజానికి ఆ వ్యాసుడికి మల్లే నేనుకూడా కూర్చుంటే సరిపోయేదే. నన్నయ్యగారు కూర్చోలేదా ? నేనూ కూర్చోవచ్చు. కాని ఈ తెలుగు మండలంలో నేనంటే గొప్పకవి ననుకొనే వాళ్ళు కొంద రున్నారు. వాళ్ళను చూచి, వాళ్లతో మాట్లాడి, నా ప్రతిష్ఠ మరి కొంచెం దృఢముగా చేసి వెళ దామని వచ్చాను. చాలా మంది నేను మహాకవి నంటున్నా నేను వ్రాసిన కొన్ని రహస్యాలు వాళ్ళకి తెలియటం లేదు. ఆ రహస్యాలు కూడా చెప్పి పోదాము. ఇక్కడ మనకీర్తి దృఢమైనకొద్దీ, స్వర్గంలో మన ఉనికి గట్టి పడుతుంది అనే తాత్పర్యంతో వచ్చాను. మరింకొక చిన్న పేచీ కూడా వచ్చింది. స్వర్గంలో ఇంద్రుడు నాకూ నన్నయ గారికీ ఇద్దరికీ చెరొక మేడా ఇచ్చాడు. నన్నయ్యగారి మేడకంటె నామేడ నిజంగా పెద్దది. అందమైనది. ఇట్లా ఉండగా ఈ మధ్య ఎవడో నన్నయ్యగారి కవిత్వంలో అరహస్యాలు ఉన్నవి, ఈ రహస్యాలు ఉన్నవి, అంతశిల్పం ఉన్నది, ఇంత శిల్పం ఉన్నదని వ్రాశాడట! దానితో దేవేంద్రు డేం చేశాడంటే ఆయన మేడమీద క్రొత్తక్రొత్త పూవులు చెక్కించాడు. వాకిట్లో పెద్దదీపం పెట్టించాడు. అప్పు డప్పుడు పారిజాత ప్రసూనములు ఆయన ఇంటికి పంపిస్తూ ఉంటున్నాడు. నా కనాదినుంచి వచ్చే ఆచారాలే తప్ప క్రొత్తవి ఏమీ కనపడలేదు. అందు

చేత నా శిష్యులు ఉన్నారే ఈ లోకంలో కొందరు. వాళ్ళచేత నా కవిత్వంలో ఉన్న క్రొత్త శిల్పాలు వ్రాయింపించి వెళదా మని వచ్చాను. వెళ్ళితే ఇంద్రుడు నామేడకూడా క్రొత్తపూలతో అలంకరిస్తాడు. అని వచ్చాను నేను. అనేటప్పటికి నాకు పంచ ప్రాణాలూ దిగజారి పోయినవి. ఈయన మనని వదలి పెట్టి వెళ్ళేవాడు కాడు. ఏమి చేయాలి. అంత్య నిష్ఠురం కంటె ఆది నిష్ఠురం మంచి దన్నారు. తెగబడి అడుగుదాము. "సరేనయ్యా ఇక్కడ ఎన్నాళ్లుంటావు. ఉంటే నీతిండి తిప్పలూ ఎక్కడ? వేరే యిల్లేమైనా అద్దెకి పుచ్చుకుంటావా? ఇంద్రు ణ్ణడిగి ఏమైనా డబ్బు తెచ్చావా లేదా? ఇవన్నీ అడిగి తేల్చుకుంటే మంచిది. చివరకి ఊరకే లోపల లోపల పిసుక్కుంటూ కూర్చుంటే ఏంలాభం?" అని. మళ్ళీ అంతవాణ్ణి ఇంత వెలుసుగా అడగటం బాగుండ దేమో అనుకుని ఇల్లా అన్నాను. "అంటే మీకు విష్ణుశర్మకి మల్లే ఏపేచీ రాలే దన్న మాట. మీ అంతట మీరే వచ్చారా? ఇంద్రుణ్ణి అడిగి వచ్చారా! ఆయనతో చెప్పివచ్చారా, చెప్పకుండా వచ్చారా? తీరా ఆయన మీ కోసం పాపం స్వర్గమంతా వెతికిస్తాడేమో! ఏమయినాడురా ఈ తిక్కన్న? కొంపతీసి గంగలో పడి చచ్చిపోలేదు కదా! ఏ సంతాన వృక్షం కిందన్నా వడదెబ్బ తిని పడిపోలేదు కదా! ఏ యప్సర_స్త్రీ అయినా ఈయనని కొంగున ముడి వేసుకొని కూర్చుండ లేదుకదా అని పాపం ఇంద్రుడు గాబరా పడతా డేమో! ఆ బృహస్పతినీ, మాతలినీ, జయంతుణ్ణీ అటూ ఇటూ ఉరికిస్తాడేమో? చెప్పి వచ్చారా లేదా" అన్నాను. మొత్తానికి తిక్కన్న తెలుగువా ణ్ణని పించాడు. నేను ఇంత ఆదుర్దాగా మాట్లాడుతుంటే నా ఆదుర్దా అంతా దాని దారిని అదిపోయింది. 'ఏ అప్సర_స్త్రీ అయినా కొంగున ముడివేసికొన్న దేమో, అన్న నా మాట పట్టుకున్నాడు. "ఏమోయి ! ఏ మనుకొన్నావు ? మేమేం చిల్లర మనుష్యుల మనుకున్నావా ? ఆకాసి పోకాసివాణ్ణను కొన్నావా ? నీ యింటికి వచ్చానని నీకు లోకువైనానా ? అసలు నేను మీయింటికి వచ్చా నంటే ని న్ననుగ్రహించడానికి వచ్చా నన్నమాట. అసలు నా వంటివాడు నీ వంటివానికొంప కెందుకు వస్తాడురా ? నీవు ఎం. ఏ. ప్యాసైనావనీ నీకింగ్లీషు వచ్చనీ. నీవేదో కళాశాలలో మాస్టరువనీ, నేనేం విష్ణుశర్మ ననుకొన్నా వేమిటోయి. తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్ళు జడువవు. మీకు వచ్చిన భాష నాకు రాదనుకుంటున్నావా ? ఇప్పుడు నే నన్నమాటలే ఉన్నవి. ఇవ్వన్నీ నేను భారతంలో వ్రాయలేదు గనుక నాకు రావని అర్థమా ? ఎవడురా నీకు బోధన చేసిన వాడు ? లత్తుకోరు మాటలు నేర్చుకొని, అది పాండిత్యమనీ, అది భాషఅనీ, గ్రంథాలు ఆ భాషలో వ్రాయవలెననీ, ఈ భాష నీకు వచ్చుకనుక నీవు నాకన్న గొప్పవాడవనీ, ఏమిరా ! చెప్పేవాళ్ళు లేక చెడిపోతున్నారు. నేను యజ్ఞం చేశానంటే అప్సరస్త్రీల కౌగిళ్ళకోసమే

చేశాననుకొంటున్నావా? యజ్ఞమంటే ఏమిటో మీ మొగాలకేనా తెలిసేది? తెలుగులో భారతం వ్రాసే అందుకు నా జిహ్వను పవిత్రం చేయవలెనని నేను యజ్ఞం చేశాను: పురోడాశం భుజించటం వల్ల జిహ్వ పవిత్ర మౌతుంది. అరేయి! నా జిహ్వ ఎంతపవిత్ర మైందంటే అక్కడ నన్నయ్యగారంత వాడుంటే, ఆయనకంటె ప్రతిష్ఠ నాకెక్కువ వచ్చిందిరా! అదిరా నా యజ్ఞము యొక్క ఫలితము. కవిగా ఆయనకంటె నేను గొప్పవాడను కాను. ఆయన నిత్యసత్యవాక్కు, ఆయన మత్యమరాధిపాచార్యుడు. అయినా నేను యజ్ఞం చేయటం మూలంగా నాకి దీప్తి వచ్చింది. అప్సరస్త్రీలు వాళ్ళ కొంగులు, వాళ్ళు వేసే ముదులూ, నీ విల్లాంటి చపట వని తెలిస్తే ఇక్కడికి వచ్చేవాణ్ణికాదు" అన్నాడు. ఇంక నేనేం చేయను. ఆయనస్థితి ఎల్లాఉందంటే యుద్ధభూమిలో కృష్ణు డన్నాడే 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' అన్నట్లుంది. అయితే ఇంక నేను చేయవలసింది ఏమీలేదు. కాని అర్జునుడు ఊరకున్నాడా? యుద్ధం చేశాడుకదా! నాకొక్కటే ధైర్యం. నాది పాంచభౌతికమైన శరీరం. ఈయనది తేజోమయమైన శరీరం. ఈయన ఉఫ్ఫంటే ఎగిరిపోతాడు. అందుచేత నే నన్నాను. "అయ్యా! కోప పడకండి. అప్సరస్త్రీ సంగమమంటే మా వాళ్లకు మల్లే మీకుకూడా ఇంత వెగటని నాకు తెలియదు. అది ఏదో దివ్యానుభూతులలో ఒకటి అనుకున్నాను. క్షమించండి' అన్నాను. తిక్కన్న నవ్వాడు. నా ప్రాణాలు గూటికి చేరుకొన్నవి. ఆయన అన్నాడు కదా! 'అవునోయీ; చాల బాగా అన్నావు. అది ఒక దివ్యానుభూతి. కాని అక్కడ అప్సరసలు లేరు. యజ్ఞాలూ లేరు. అట్టే మాట్లాడితే స్వర్గమూ లేదు. నీ నోటివెంట బహురమ్యమైన మాట వచ్చింది. నీవు కొంత బుద్ధిమంతుడవు కనుక నే ఇంద్రుడు నన్ను నీదగ్గరకు వెళ్ళ మన్నాడు'' అంటే నే నన్నాను గదా ''స్వామీ! అసలేమి జరిగిందేమిటి స్వర్గంలో. మీరడిగారా? ఆయన వెళ్ళమన్నాడా! నాపేరుకూడా స్వర్గంలో వచ్చిం దన్నమాట. నేనుకూడా తెలివిగలవాణ్ణని మీరందరూ అనుకుంటూ ఉంటారా అండి'' అని అడిగాను. ఆయన పరమ గడుసు. నా తెలివితక్కువకి నవ్వలేదు. అసాధ్యు డాయెను. కొంచెం శిరఃకంపం చేశాడు. నేనేమై పోయినాను? ఆయనకి దాసానుదాసుడినై పోయినాను. ఆయన చుట్టచుట్టుకొని నిప్పుతేరా అంటే తీసుకువచ్చే స్థితిలోనికి వచ్చాను. పొరపాటు, పొరపాటు. అప్సరస్త్రీలంటేనే అంత కోపం వచ్చి నాయన చుట్టలు తాగుతాడా! ఊరకే మాటసామెతగా చెప్పాను. అయినా అడిగేశాను. "తమరు ఎన్నాళ్ళుంటారు. బస యెక్కడ? భోజనభాజనాదు లెట్లాగా? అన్నాను. అంటే ఆయన ''ఏం విష్ణుశర్మకి ఇంట్లో అన్నం పెట్టేవాడవు నాకు పెట్టలేవా? ఓరి చవటా? నాకన్నం పెట్టే

అందుకు ఏడుస్తా వెందుకురా ? నీకేదో పెద్దగా ఈ కాలపుతెలివితేట లున్న ట్లుగా మాట్లాడుతున్నావు. నీతెలివి తెల్లవారి నట్లే ఉన్నది. నీ యిష్టంవచ్చిన చోటికి మనిద్దరం పోదాము. స్వర్గాన్నించి తిక్కన్నగారు దిగివచ్చారు. ఆయన భారతంమీద ఆయనే ఇవ్వాళ్ళ మాట్లాడతారు. టికట్టు . రూపాయి. అని పెట్టరా ! నీ యిష్టం వచ్చినంత డబ్బు వస్తుంది. మొదట కొన్నాళ్ళు వస్తుంది. ఈ లోపుగా నే నెక్కడన్నా ఉద్యోగం సంపాదిస్తానులే. పాపం విష్ణుశర్మకు ఈ ఒడుపులన్నీ తెలియవు. అవన్నీగూఢా మనమే పోషిద్దాములే" అన్నాడు. నాకు ధైర్యం వేసింది 'ఓరిబాబోయి ! వీళ్ళు చచ్చారన్నమాటే తప్ప, చచ్చారుగనక బతికిపోయినాం గాని, బ్రతికి ఉంటే వీళ్ళని కిందపెడితే పంటలూ, పైనపెడితే వానలూ ఉండేవికావు. అవును కాకతీయ గణపతి చక్ర వర్తి ఆస్థానంలోనికి వెళ్ళి మనుమసిద్ధిరాజ్యం ఇప్పించిందానికంటె ఇప్పుడు నాలుగురూపాయలు సంపాదించటం ఎక్కువా?' అనుకున్నాను. అనుకొని ఇల్లా అన్నాను. "ఏమి ఉద్యోగం సంపాదిస్తారండీ" అని. ఆయన అన్నాడు కదా ! "ప్చ్ ! అందులో ఏమున్నదోయి ! విశ్వవిద్యాలయాలల్లో తెలుగు ప్రొఫెసర్లందరూ నా శిష్యులేకదా ! నేనుపోయి ఒరే ! నాయనా నీవు నాలుగురోజులు వండుకోగా ! ఎంతకాలం అక్కరలేదు, మహా అయితే ఒకసంవత్సరం. ఈ పదినెలలూ నేను చేస్తాను. వేసవికాలపు సెలవులజీతం తీసు కొంటే నువ్వే తీసుకొందువు గాని అంటే ఎవళ్లు ఒప్పుకోరు" అన్నాడు. నాకు లోపలనుంచి చచ్చేటంత నవ్వు వచ్చింది. 'ఓయి పిచ్చిబ్రాహ్మణుడా' అనుకున్నాను. అయినా రహస్యం నేను చెప్పటమెందులకు, చెపితే నాకు నష్టంకదా, టిక్కెట్లడబ్బు పోతుందిగా, అందుచేత అన్నాను గదా "చిత్తం చిత్తం. తమరంటే కాదనే వాళ్లెవరుంటా" రన్నా. ఆయన యింకా మనుమ సిద్ధి కాలం, గణపతి చక్రవర్తికాలం అనుకుంటున్నాడు. అనుకో బాబూ ఇంకో పదిరోజు లనుకో.



# నాలుగవ అధ్యాయము

వీళ్ళ ఇద్దరి పనులూ చేయవలెనంటే వెంటనే చేయటానికి వీలు లేదు. వాళ్ళుమన లోకంలోకి రావాలి. అప్పుడుగాని తేలదు. నేను ఈయనకి చదువు చెప్పవలెనన్నా ఆయనని వెంటనే తీసుక వెళ్ళాలన్నా ఎల్లా ఉంటుంది. నేను తీరా ఒక సభ పెట్టించి ఇదుగో తిక్కన్న అంటే ఎవళ్ళకీ కనపడడు. వెనుకటి కేదో దేవతా వస్త్రాలకథ ఉందే అల్లా అవుతుంది. నన్ను నలుగురూ పరి హాసిస్తారు. ఏమి చేయాలో తెలియదు. వాళ్ళతో అన్నాను. బాబూ ఈ బాధ ఒకటి ఉన్నది. మీరైనా నాకు కలలో కనిపిస్తున్నారు కాని మేల్కొని ఉన్నప్పుడు కనిపించటం లేదుకదా! నేను మేలుకని ఉన్నప్పుడు మీరు నాకు కనిపిస్తేకదా ఇతరులకు కూడా కనిపించగలిగి ఉండటం ఈ విష్ణుశర్మ వ్యవ హారంకూడా అంతేను. ఆయనకి ఉద్యోగం సద్యోగం అక్కర లేదనుకోండి. నేను పడుకొని నిద్దురపోతూ ఈయనకి చదువు చెపుతూ ఉంటే మా వాళ్లు నాకు సంధి పుట్టిందని అనుకోవచ్చు. నేను చస్తా నేమో నని వాళ్ళకు భయం. మా ఆవిడ పుట్టింటికి వెళ్ళింది. రెండుమూడు రోజుల్లో వస్తుంది. ఆవిడ పరమ పల్లెటూరి మనిషి. నీదుంపతెగ, ఎవరో ఒకాయన కలలోకి వచ్చి నాకు చదువుచెప్ప మన్నాడే, చెపుతున్నాను అంటే సంధి పోయి పిచ్చి ఎక్కిందని అనుకుంటుంది. దాని అన్నగార్లున్నారు ఇద్దరు. వాళ్ళిద్దరూ మారీచ సుబాహులు. నన్ను తీసుక వెళ్ళి పిచ్చాసుపత్రిలో చేర్పించవచ్చు. మీకేం మహారాజులు. మళ్ళీ స్వర్గానికీ దయచేస్తారు. నేను పిచ్చాసుపత్రిలో ఉంటే నా పిల్లల విషయం ఎవరు చూస్తారు? పైగా మీరు మా యింట్లో అన్నం తింటా నంటున్నారు. మీరిద్దరూ మనుష్యులు కనపడకుండా మీ యిద్దరికీ మా ఆవిడ విస్తళ్ళలో అన్నం వడ్డిస్తుంది. మీరన్నం తింటూ ఉంటారు. కూరకావాలో, పప్పుకావాలో, మజ్జిగకావాలో ఆవిడ కెట్లా తెలుస్తుంది. మీరు అర్థాకలితో లేచిపోతారేమో! అది నాకొక పాపం. అదట్లా ఉండగా, ఇంక ఊరంతా చెప్పుకోవటం మొదలు పెడతారు. అరేయి వాళ్ళింట్లో రెండు దయ్యాలు ఉన్నవి. విస్తళ్ళల్లో అన్నం వడ్డిస్తారు. ఆ దయ్యాలు తినిపోతూ ఉంటవి, అవి ఎవ్వరికీ కనిపించవు. ఇక జనం మా యింటికి రావటం మొదలు పెడతారు. మాయిల్లు అప్పుడు యిల్లంటారా? కోటప్పకొం డౌతుంది. తిరనాళ్ళ ప్రవేశ అనుకోండి, పాతిక

రూపాయల అద్దె ఇచ్చి ఈ రెండు గదులలో ఉంటున్నాను. ఆ ముందరి కొంచెం మెల్ల వుంది. అల్లా జనం రావటం మొదలుపెడితే ఇది ఇల్లేమిటి ? నేనిక్కడ నివసించట మేమిటి ? కనుక ఓ తిక్కన్నవిష్ణుశర్మల్లారా ! దీని కేదైనా మార్గం ఆలోచించండి. లేకపోతే మీ దారిన మీరు సెలవు పుచ్చు కోండి అన్నాను. విష్ణుశర్మ అన్నాడు. "నీవు చాలా తెలివిగలవాడ వయ్యా; ముందు జరుగ బోయే విషయాలన్నీ ఆలోచించి చెప్పావే" అన్నాడు. నేను "నా తెలివి తెల్లవారినట్లే ఉంది. ముందర ఈ గండంలో నుంచి ఎల్లా బయటపడాలో చెప్పండి.అన్నాను. తిక్కన్నగా రన్నాడుకదా నీకా భయమక్కర లేదయ్యా, మాకు ఇల్లా గాలి ఆకారాలు, ఇవ్వాళ గడవనే గడచి పోయింది. ఇంకా మూడురోజులు మాత్రమే ఉంటవి. తరువాత మేము కూడా నీవలెనే ఉంటాము. మనుష్యులవలెనే తిరుగుతూ ఉంటాము. అందరికీ కనిపిస్తూ ఉంటాము. అప్పుడు పేచీలేదు అన్నాడు. నేను ఇట్లా అన్నాను. "పరవాలేదు బాబూ ! మీరు మాత్రం మా ఆవిడ రాకముందే మాకుమల్లే మనుష్యులవలె ఉండవలె. ఆవిడ వచ్చిన తరువాత హఠాత్తుగా మనుష్యుల వలె అయినారా. ఆవిడ దయ్యే మనుకోవచ్చు, ఎవడో దొంగ అనుకోవచ్చు, కెవ్వున కేక పెట్టవచ్చు. అప్పుడు నేను మన దురదృష్టం కొద్దీ స్కూల్లో ఉన్నాననుకోండి. చుట్టుపట్లవాళ్ళు పదిమంది వస్తారు కట్టిలు పుచ్చుకు బజా యిస్తారు. నేను తిక్కన్ననోయి బాబూ అంటే వాళ్ళకేం తెలుస్తుంది, తిక్కన్నవా నీ తిక్క కుదురుస్తా నుండ మంటాడు. ఎవరైనా పిల్లలైనా వస్తే నేను విష్ణుశర్మనిరా అని ఈయన అంటే 'ఒరేయి' మన నీతిచంద్రిక వ్రాశా డురా అని వాళ్ళనుకోవచ్చు. ఇప్పుడు ఆ నీతిచంద్రికకి ఇంకొక ఆపద పట్టింది. గద్యపాఠ్యము చదివించే అందుకోసము పాఠ్యపుస్తకాలల్లో వాళ్ళూ వీళ్ళూ వ్రాసిన ఏదో భాగాలు వేస్తున్నారు కాని నీతి చంద్రికలోని భాగాలు వేయటం తక్కువ. అవతారిక చదివిన వాళ్ళసలు లేరు. అందుచేత నేను విష్ణుశర్మని రోయి అంటే అరణ్యరోదనమేకాని ఫాయిదా ఉండదు. అందుచేత మీరిద్దరూ మా ఆవిడ రాకముందే మానుషాకారాలతో మాయింట్లోకి రండి. చెప్పాను గదా ! ఇవ్వాళ ఆదివారం. మా ఆవిడ బుధవారం ప్రొద్దున వస్తుంది. మీరు మంగళవారం రాత్రికల్లా మనుష్యులు కావాలి" అన్నాను. అంటే విష్ణుశర్మ "అలా కాదయ్యా, మేము గురువారం ప్రొద్దునకాని మీకు మల్లే కాము, మీ ఆవిడని రానియ్యి. ఆ రోజున రాత్రి నీతో మాట్లాడము, నీకు సంధి అక్కర లేదు. పిచ్చి పట్టనక్కరలేదు. గురువారం ప్రొద్దుననే కనిపిస్తాము అన్నాడు. ఈ లోపుగానీవు నీ భార్యతో చెప్పి పెట్టు. ఏమని అంటే "మనఇంటికి ఇద్దరు బ్రాహ్మలు వస్తారు. కొన్నాళ్ళు మనింట్లోనే ఉండవచ్చు.-" ఈ మాటలు తిక్కన్న అంటున్నాడు. నేను ఒక వారం పదిరోజులకన్న ఎక్కువ ఉండనులే-విష్ణు

శర్మ నాలుగైదు నెలలు ఉండవచ్చు అని. విష్ణుశర్మ అన్నాడు కదా! "ఇంగ్లీషు నాలుగైదు నెలలలో వస్తుం దంటావా" అని. నేనునవ్వి "బలేవాడవయ్యా, మా దేశంలో పదఘయేటో ఎనిమిదవఏటో ఇంగ్లీషు మొదలు పెడుతున్నాము. మాకు పాతిక యేళ్ళొచ్చేవరకూ ఆ యింగ్లీషు చదువుకుంటూనే ఉంటాము. ఆ భాష మాకు వచ్చిం దనటానికి వీలు లేదు. ఒక సామెత ఉంది మాలో. మా వాడు A B తో మొదలు పెట్టాడు. ఆ అక్షరం అటూ ఈఅక్షరం ఇటూ తిరిగేవరకూ పాతికఏళ్ళు పట్టిందని. అంటే B. A. ప్యాసయ్యే టప్పటికి అని అర్థం. అంటే B A అని ఒక పరీక్ష ఉన్నది ఇంగ్లీషులో. అది ఒకటో క్లాసు మొదలు పదిహేనేండ్లు చదివితేగాని పరీక్ష ఈయరు. ఇందులో మధ్య మధ్య కొందరు తప్పుతూ ఉంటారు. ఒక్కొక్క క్లాసు రెండేళ్ళు తప్పుతూ ఉంటా వనుకో. నీవు బి. ఏ ప్యాసయ్యే టప్పటికి నలుభై ఏళ్లు అవుతవి. అల్లాంటి చదువు నీకు నాకు నాలుగు నెలల్లో రావాలి ? అమ్మ, ఎంత ఆశ ? అన్నాను. ఆయన అది ఏమిటయ్యా ! ఏ శాస్త్రమైనా ఆరేళ్ళల్లో పూర్తిచేయ వచ్చుకదా. ఈ చదువు పదిహేనేళ్లేమిటి ? అన్నాడు. నేను బి. ఏ తో అయిం దనుకున్నావా, తరువాత M. A. అని ఉంది. తరువాత Ph. D. అని ఉంది. ఇదేం శాస్త్రిలను కున్నారా? పాతికేళ్ళుండవు. నేను భాష్యాంత వైయాకరణినసీ, నేను తర్క-శాస్త్రం ఆపాంతం చదివాననీ, ఈయన నాలుగు శాస్త్రిల్లో గట్టివాడండీ, తర్కం వ్యాకరణం, మీ మాంసా, వేదాంతమూనూ అని చెపుతూ ఉంటూరు. వాడికి వడసారం పాతిక ఏళ్లుండవు. నాకు ఒళ్ళుమండి పోతూ ఉంటుంది. మా దొరతనం వారి దయవల్ల వాళ్ళన్ని శాస్త్రిలు చదివినా మాకింగ్లీషు సరిగ్గా రాకపోయినా, మే మింగ్లీషు చదివా మనటం, వాళ్లు అన్ని శాస్త్రిలు చదివినా అంతకంటె గొప్పది కావటం వల్ల బ్రతికి పోతున్నాము. లేకపోతే వీళ్ళు మమ్మల్ని బ్రతక నిచ్చేవాళ్లా ? ఆ ఇంగ్లీషు విద్య అంత గొప్ప విద్య. దానికి మొదలే తప్ప చివర అనేది లేనే లేదు. భాష్యాంతం చదివే టప్పటికి ఇంక వ్యాకరణం మిగులలేదుకదా? పదెనిమిదేండ్లలో నీవు వ్యాకరణశాస్త్రం అంతా చదివేశావు కదా ! ఇంక చదువవలసిన దనేది ఏమీలేదు గాని మా ఇంగ్లీషులో అట్లా కాదు. చచ్చేదాకా చదువుతూ ఉండవలసిందే. మా ఇంగ్లీషులో పెద్ద పెద్ద పండితులు కొందరు వృద్ధులై గర్వపు మాటగా ఒకటంటూ ఉంటారు. నేను బ్రతికి ఉన్నన్నినాళ్ళూ స్టూడెంటునే అని. స్టూడెంటు అనగా విద్యార్థి. అంత ఉన్నది మా ఇంగ్లీషు భాష. దానిని నాలుగు నెలల్లో చదివే స్తావేం ? అవునులే స్వర్గాన్నించి దిగి వచ్చావుగా" అన్నాను.

"నేనీ ఉపన్యాసం ఎందు కి చ్చానంటే విష్ణుశర్మను హడలగొట్టాలని. రేపు నేను చదువు చెప్పాలి అంటే కష్టంకదా ! జమీందారుగారి కొడుక్కి ట్యూషన్ చెప్ప బోయినట్లు. వాడు మనమాట వింటాడా పెడతాడా. పైగా

వాణ్ణి ఏమండీ అనాలి. దొరగారూ! తమరట్లా తిరగకూడదు. తమరు కూర్చొని చదువు కోవాలి అనాలే తప్ప 'ఏమిటయ్యా అట్లా తిరుగుతావు' అని కసరుకొన్నావా నీకు వాళ్లు నెలకు ఇచ్చే సలభయ్యో ఏభయ్యో ఊరికే వదలు కొన్నట్లే. అసలు జమీందార్ల ఇంట్లో ట్యూషన్ కుదరటం కంటె అదృష్టం ఉండ దనుకోండి. అది వేరే అధ్యాయం. విష్ణుశర్మ వంటి పండితుణ్ణి తీసుకవచ్చి ఆయనకి చదువు చెపుతామని కూర్చోటం కొరివిపెట్టి తలగోకి కోవటమే. ఏ జమీందారు కొడుకు కైనా ట్యూషన్ చాలా మంచిది. మన మేమీ చెప్పనక్కరలేదు. నెల అవటం తోటే నాలుగురాళ్ళూ జేబులో పడతవి. ఆ జమీందారుగారి కొడుకుని గౌరవిస్తూ ఉంటే చాలు. ఇక్కడో ఈ విష్ణుశర్మని ఏమండీ అనాలి. నీకేం బుద్ధిలేదా, చెపుతూఉంటే తెలుసుకో లేవా, అనకూడదు. నెలాఖరుకి మనకు వచ్చేదమ్మిడీ లేదు. ఈ బాధలు ఉన్నవి. సరే మా ఆవిడ వచ్చిన తరువాత ఇంకొక విషయం తీర్మానం కావాలి. ఆవిడ వీళ్ళకి అన్నం పెడతానంటుందో పెట్టనంటుందో. రెండు తద్దినాలు తెచ్చి నా నెత్తిన పెట్టారంటుందేమో! అదట్లా ఉండగా ఆవిడ బయట ఉంటే ఇదివరకే నేను చేయి కాల్చుకుంటూ ఉండేవాణ్ణి. ఇప్పుడు వీళ్ళద్దరికి కూడా వండి పెట్టాలి. తిక్కన్నగారు వంట చేయలేడని అడ గక్కరలేదు. చేస్తే విష్ణుశర్మ ఏమైనా చేయగలిగి ఉండాలి. పూర్వం మన పండితులు పేదవాళ్లై ఉండి శాస్త్రాలు చదువు కున్నారని ప్రతీతి. తర్క శాస్త్రంలో పరమప్రమాణమైన గదాధరీయ మనే గ్రంథం వ్రాసినవాడు, వాడి పేరు గదాధరుడు, ఆయన వంగదేశీయుడట! ఏదో పెళ్ళికి వంటల వాడుగా వెళ్లాడు. పెళ్ళివారి బంధువు లందరూ పంక్తి తీర్చి భోజనాలు చేస్తున్నారట. వారిలో వారు తర్కశాస్త్రాన్ని గురించి కొంత చర్చ చేసు కుంటున్నారు. వాళ్లు తప్పుగా వాదిస్తూ ఉండగా ఈ పులుసు వడ్డిస్తున్న గదాధరుడు అది తప్పు అని చెప్పాడట. చెప్పి వాదించాడు, వాళ్ళు ఆశ్చర్య పోయినారు. తీరా నీ పేరేమిటంటే గదాధరుడు అన్నాడు. ఆయన పేరు ఆసేతు శీతాచలమూ తెలిసినదే. మహాపండితుడని అందరికీ తెలుసు. కాని పెండ్లిళ్ళలో వంటలు చేసే అందుకు వెళ్లేవాడు. తిండిలేక ఆరోజుల్లో చదువు లట్లా ఉండేవి. చదువులు చదువులకోసం చదివే వాళ్ళు తప్ప, పదవుల కోసం చదివేవాళ్ళు కారు. విష్ణుశర్మకు శతవిధాల వంటచేయటం చేతనై ఉండవచ్చు అని విష్ణుశర్మ నడిగాను. "అయ్యా! ఎప్పుడైనా మా ఆవిడ బయట ఉంటే మీరేమైనా చేయి కాల్చుకోగలరా" అని. ఆయన "ఒక్కచెయ్యే మిటయ్యా. కావలిస్తే ఒళ్ళంతా కాల్చు కుంటాను. నీ కాభయ మక్కరలేదులే. నే నున్నాను కదా! నీ పిల్లలకి చదువు కూడా చెపుతాను. ఆ రాజకుమారు లకు ఆరునెలల్లో సర్వనీతి శాస్త్రము చెప్పాను కదయ్యా! నీ కొడుకులకి

అల్లాగే చెపుతాను కావలిస్తే అన్నాడు. నాకు భయం వేసింది. వెంటనే ఆయనకాళ్ళు పట్టుకున్నాను. "బాబోయి ! ఆ పనిమాత్రం చేయకు, మా వాళ్ళని నీతిశాస్త్రవేత్తలను చేయవద్దు. మీ నీతికి, మా నీతికీ, సంబంధం లేదు. మా చదువు ఇల్లా మొదలు పెట్టి ఇరవైఏళ్ళు వచ్చే వరకూ చదువ వలసిందే తప్ప, అంతా కలిపి ఆరునెలల్లో చదువుతా మనటానికి ఏమీ వీలులేదు. ఒకవేళ చదివినా వనుకో. అది బూడిదలో పోసిన పన్నీరే. దాని కేమీ ఆలనా పాలనా? ఉద్యోగమా సద్యోగమా? ఎందుకు వచ్చిన చదువు ఆవెధవ చదువు. క్రమంగా S. S. L. C. ప్యాసు కావాలి. తరువాత బి. ఏ. ప్యాసు కావాలి కాని మొదటనే పాండిత్యమంతా నాకు వచ్చు అంటే నీకు ఉద్యోగం ఎవ్వడూ ఇవ్వడు. నీ వడుక్కు తినవలసిందే. బాబూ! ఇంకో జన్మలో నీ కడుపున పుడతాను. నాపిల్లలకు మాత్రం అ అపకారం చేసి పోకు" అన్నాను. అంటే విష్ణుశర్మ నవ్వి మరి నేను పదిహేనేళ్ళు చదవా లంటావా అన్నాడు నేను "కొంత తగ్గించటానికి వీలున్నది. అది నీ ఓపికనిపట్టి మొదటి ఐదు క్లాసులూ చదువ అక్కరలేదు. ఆట్టే మాట్లాడితే ఎనిమిదవ క్లాసులోనే చేరవచ్చు. ఒక హెడ్ మాష్టరుకానీ, ఒక ప్రిన్సిపాలుకానీ, నే నితనిని తయారు చేశానూ అని చెప్పితే వాళ్ళు ఎనిమిదవ క్లాసులో చేర్చుకోవచ్చు. మిగిలిన ఎనిమిదేళ్ళూ మాత్రం తప్పకుండా చదవాలిసిందే" అనగా విష్ణుశర్మ అన్నాడు. "ఇం కేదన్నా కొంచెం తగ్గేమార్గం చూచి పెట్టవయ్యా. ఇక్కడ ఎనిమిదే ళ్ళెక్కడ చావను." అన్నాడు. నేను "దానికి మార్గం ఉన్నది. ప్రైవేటుగా చదివి పన్నెండో క్లాసుకి సమానమైన మెట్రిక్యులేషన్ అనే పరీక్ష ఉన్నది, దానికి కూర్చుని ప్యాసైతే నాలుగేండ్లలో బి. ఏ. ప్యాసు కావచ్చు అన్నాను. దానికేమీ మార్గంలేదా' అనడిగాడు. నే నన్నాను. "ఆశకి అవధి, ఎక్కడ? పదిహేనేండ్ల చదువు నీకోస మని నాలుగేండ్లకి చేసిపెడితే నీకింత దురాశ" అన్నాను. "అంటే అది తప్పదన్నమాట స్కూళ్ళలో ప్రవేశించి చదువవలసిందే." అనగా నేను మళ్ళీ అన్నాను కదా. పూర్వం ఇంక కొంచెం సులువుగా ఉండేది. ఉభయభాషాప్రవీణ, శిరోమణి, విద్వాన్, మొదలైనవి పరీక్షలుండేవి. వాటికి స్కూళ్ళల్లో చదు వక్కరలేకుండా ఉండేది. ప్రైవేటుగా రెండేళ్ళు చదివి వెళితే అవి ప్యాసైతే ఎక్కడో తెలుగు పండితుడి ఉద్యోగం చేసుకుంటూ మెట్రిక్యులేషన్ ఎఫ్ ఎ., బి.ఏ. ఈతరగతులు స్కూల్లో చదువ నక్కర లేకుండా ప్యాసు కావటానికి, వీలుండేది. ఇప్పు డట్లా వీల్లేదు అక్కడ కూడా ఇట్లాగే పెట్టారు. నీవు విద్వాన్ పరీక్షకి వెళ్ళవలె నంటే ఆరేళ్లూ స్కూల్లో చదువ వలసిందే. అన్నాను. ఠక్కున్న 'ఎందుకి గోలంతా' అన్నాడు. నే నన్నాను. "ఎందుకంటే మీరందరూ వట్టి పండితులు, మన చదువుల్లో భూగోళము, దేశచరిత్ర, సామాన్యశాస్త్రము, గ్రామశాస్త్రము రాజ్యాంగ

సభలూ, వీటిని గురించిన వాకబు ఏమీలేదు. అవి లేకపోతే చదువు పూర్తి కాదు. అవి చిన్నప్పటినుంచీ నేర్పక పోతే అలవాటు కావు. అందుచేత మేము విద్యాపథకం ఇల్లా పెట్టాము." అన్నాను. తిక్కన్నగారన్నాడుకదా అది యేమిటయ్యా నాకు ఖగోళం తెలియదంటావా, దేశచరిత్ర తెలియదంటావా. సామాన్యశాస్త్రం తెలుసుకోవట మెందుకు. అందరికీ తెలిసేది గనుకనే కదా సామాన్యశాస్త్ర మన్నారు." అంటే నే నన్నాను "బాబూ! అల్లా అనకండి. సామాన్యశాస్త్రం అంత తేలిక కాదు. గాలి ఉన్నదనుకోండి. దానిని మనం చూడలేము. చెట్ల ఆకులు కదులు తూంటే గాలి ఆడుతున్నదని మనకు తెలుసు. విసనకఱ్ఱ పెట్టి విసురుకుంటూ ఉంటే గాలి వస్తూన్నదని తెలుసు. గాలి అనేది ఒక పదార్థం. పదార్థానికి మూడు ధర్మాలు ఉంటవి. ఒకటి దానికి కొంత బరువు ఉంటుంది. రెండవది అది కొంత ఒత్తిడి కలిగిస్తుంది. మూడవది అది కొంత స్థలాన్ని ఆక్రమిస్తుంది. పదార్థములు మూడు రకాలు, ఒకటి ఘన పదార్థము. రెండవది ద్రవ పదార్థము. మూడవది వాయు పదార్థము. ఇవన్నీ మీకు తెలుసునా" అని. తిక్కన్న మళ్ళీ మాట్లాడలేదు. నా చేయిపైన అయిందికా, అన్నాను కదా "చూచారు కదా, మీకిన్ని సంగతులు తెలియవు. అది శాస్త్రం కాదంటారు. చెప్ప నక్కరలే దంటారు" అన్నాను. ఆయన కాపాటున కోపం వచ్చింది. "ఛీ బుద్ధిలేనివాడా ! నోరు మూయి" అన్నాడు. నేనేం చేయను. నాతో పని ఉండివచ్చి నన్నింతమాట అంటాడా ? లేచి ఒక్క దెబ్బ వేద్దామా అనిపించింది. కాని అతిథికదా. నేను కొట్టకూడదు. మళ్ళీ ఇంకో ఆలోచన వచ్చింది. ఆయన వట్టి గాలికదా, దెబ్బేం తగులుతుంది, నాచేయి ఊరకే ఇట్లా దూసుకపోతుంది. అప్పు డన్నాను కదా !' "తిక్కన్నగారూ మీరు నాతో పనిఉండి వచ్చారు. ఆసంగతి మీకు జ్ఞాపకం ఉన్నదా ? నన్ను బుద్ధిలేనివాడా అన్నారు. అంటే నన్నొక్కణ్ణే అన్నా నని అనుకుంటున్నా రేమో. ఇప్పటి ఈకాలంలో బ్రతికి ఉన్న విద్యావేత్తలను, విద్యాబోధకులను విద్యా ప్రచారకులను అందరినీ అన్నట్లే. నన్ను ఒక్కణ్ణే అన్నమాట కాదు. కనుక మీరు వెంటనే క్షమాపణ చెప్పవలె. లేకపోతే వెంటనే వెళ్ళిపోవలె." అన్నాను. ఆయన "ఓయీ ! నీ మీదిది తీసుకొని వెళ్ళి నా చేత క్షమాపణ చెప్పించాలని దేశమందరిమీఁదా కడుతున్నావా !" అన్నాడు. నేను "కాదయ్యా ! మామహా పండితులందరూ దీనిని విశ్వసించియే కదా విద్యావద్ధతిని ఇల్లా నిర్మించారు. నీ తిట్టు తగిలితే వాళ్ళకి తగలాలి నా కేమి నష్టం" అన్నాను. అప్పు డాయన "నీకు నేను క్షమాపణ చెప్పనక్కర లేదుకదా ! వాళ్ళు వచ్చి అడిగితే చెపుతాలే" అన్నాడు. నేనేం చేయను ? చేతిలో చిక్కాడురా అనుకుంటే ఇల్లా జారిపోయినాడే. గడుసువాళ్ళు. లేకపోతే భారతం వ్రాస్తాడా ?

మనుమసిద్ధికి రాజ్యం ఇప్పిస్తాడా! ఎందుకూ పనికిరానీ స్కూళ్ళో తెలుగుపంతులని ఈయనకు నాకున్న మాత్రం తెలివితేటలు ఉండవూ? మరి ఇంకేమి చేయాలి? ఆయనని క్షమాపణ చెప్పుమని అడగటానికా నాకు దమ్ములు లేవు. నిన్ను కాదంటాడు. అందుచేత నేను ఆయన మీద కొంత కోపం వచ్చినట్లు మొగం ఇటు తిప్పుకుని విష్ణుశర్మతో "అయితే నాకు పరవా లేదన్నమాట. ఆ మూడు రోజులూ మీరు ఉడకేసి పెట్టే అందుకు ఉన్నా రన్నమాట" అన్నాను. ఆయన "ఆ మూడురోజు లేమిటయ్యా? పన్నెండుమూళ్లు ముప్ఫై ఆరురోజులు సంవత్సరానికి నేనిక్కడ కనీసం ఐదేళ్లయినా ఉంటేకాని బి. ఏ. పరీక్ష కానాయె. మొత్తము మీద నూటఎనభైరోజులు. అంటె ఆరునెలలు నీకునేను అన్నం వండిపెట్టాలని అర్థము" అన్నాడు. అంటే నే నన్నాను. "అంత అక్కర లేదండీ మా ఆవిడ రెండేళ్ల కోసారి గర్భవతి అవుతూ ఉంటుంది. ఇందులో కొన్నాళ్లు కలిసి వస్తవి" అన్నాను. ఆయన అన్నాడు "సంతోషించానులే. నాకు ముదరా రావు. నీకే ముదరా వస్తవి. ఆవిడకి ఏడోనెల వచ్చే టప్పటికి ఆవిడ కూర్చోలేదు. లేవలేదాయె. తరువాత పిల్లవాడికి మూడు నెలలైనా వచ్చే వరకు వంట చేయలేదాయె. కనుక ఇదొక సంవత్సరం కొత్తగా కలిపి పెట్టావా బాబూ, నయం. మీ ఆవిడ మంచిది కనుక రెండేళ్లకొకసారైనా గర్భవతి అవుతుంది. నేను బ్రతికున్నరోజుల్లో మా ఆవిడ ఉండేదీ ఎడపిల్లడూ, మడపిల్లడూ. పిల్లవాడింకా పాలుతాగటమే వదలి పెట్టేవాడు కాదు. ఆవిడ మళ్లీ గర్భవతిగా ఉండేది. త్రొక్కుడు సంతానమై పోయింది. కొంప సాగేది కాదు. అందుకనే ఆ రాజుగారి పిల్లలకు నీతి శాస్త్రం చదువు చెపుదామని వెళ్లాను." అనగా ఆయన ఏమైనా ఇచ్చాడా అన్నాను. విష్ణుశర్మ "ఇవ్వకేం నాయనా! ఇచ్చాడు. ఐదారు ఊళ్లు అగ్రహారంగా ఇచ్చాడు. పుత్రపౌత్రపారంపర్యంగా, ఆచంద్రతారార్కంగా అనుభవించమని యిచ్చాడు. మా వాళ్లందరూ అనుభవిస్తూనే ఉండి ఉంటారు. ఎప్పుడో వెళ్లి మా అగ్రహారాలు చూచి వస్తాను. నాకు నువ్వు అన్నం పెట్టవలసి నంత అవసర మేమీ లేదు. మా వాళ్ల నడిగి కొంత డబ్బు తీసుకొచ్చి నీ కిస్తానులే" అన్నాడు. నాకు వాళ్లిద్దరినీ చూస్తే జాలి వేసింది. అయ్యో పాపం వీళ్లిద్దరూ ఇంత పండితులు. ఇంత చదువుకున్న వాళ్లు. ఇంత తెలివికలవాళ్లు. వీళ్లకి కాలం మారి పోతుందన్న జ్ఞానం ఎందుకు లేదా అనిపించింది. వాళ్ల కేమిటి? ఆ అగ్రహారా లిచ్చిన రాజు ఆచంద్రతారార్కంగా ఇచ్చాడుట ఏమిటి? తరువాత వచ్చే రాజ్యాలు వాళ్లిచ్చిన అగ్రహారాలను నిలబెట్ట వలసిన అవసరం ఏమున్నది? అసలు ఆ అగ్రహారాలు పుచ్చుకున్న పండితుల సంతానమే ఆ అగ్రహారాలు మిగుల నివ్వరు. ఏమైనా మిగిలితే రాజ్యాలు చేసేవాళ్లెందు కూరుకుంటారు. ఈ పూర్వపు రాజులకంటె

తెలివి తక్కువ వాళ్ళు లేరు. ఏమిటో రాగిరేకు ఉన్నవికదా అని అచంద్ర తారార్కంగా, పుత్రపౌత్ర పారంపర్యంగా ఇచ్చినట్లు దానశాసనాలు వ్రాశారు. అని నేను మనస్సులో అనుకుంటూ ఉండగా వాళ్ళిద్దరూ నాఊహలను ఆకట్టి వేశారు. అయినా ఇంకా వాళ్ళకి మానుషశరీరాలు రాలేదుకదూ? వాళ్లకి ఎదటి వాళ్ల ఊహలు తెలుస్తవి. తిక్కన్నగారన్నారు కదా "నీఊహ లన్నీ నాకు తెలుసును. పూర్వపురాజులు తెలివి తక్కువవాళ్ళు కాదు. వాళ్ళు కాలం యొక్క స్వరూపం తెలియనివాళ్లుకారు. వాళ్లకు తెలిసినదీ ధర్మము యొక్క స్వరూపం. అది ధర్మము గనక ఎవ్వరూ దాని జోలికి పోకూడదని వాళ్ళ తాత్పర్యం కాని, ఇతర రాజులు రారనీ వాళ్ళ యిష్టం వచ్చినట్లు వారు చేయరనీ పూర్వపు రాజు అనుకో లేదయ్యా" అన్నాడు. సరే నాకేమి? నే నూరకొన్నాను. అసలు విషయం అట్లాగే ఉన్నది. మా ఆవిడ బుధవారం ప్రొద్దున వస్తుంది. వీళ్ళు గురువారం ప్రొద్దున కాని మనుష్యులు కారు. ఇది ఎట్లా పొసగించటం? నేను వాళ్లతో అన్నాను. "అయ్యా! నాకొక ఊహ తోస్తున్నది. మీరిద్దరూ ఏంచేస్తారంటే గురువారం నాటి పొద్దున ఆ కాలువగట్టుకు వెళ్ళండి. అక్కడ మనుష్యులు కండి. అక్కడనుంచి మాయింటికి రండి, మావాళ్ళెవరూ మిమ్ములను దయ్యా లనుకోవటానికి వీలు లేదు. విష్ణుశర్మ అన్నాడు "బలే మాట చెప్పావే, ఈ నాల్గు గోడలమధ్యా ఏది జరిగితే అది జరుగుతుంది. మీఆవిడతో కావలిస్తే నేను చెపుతానులే. నీవు భయపడ కమ్మా. మేము ఎవళ్ళమో వచ్చాము. మేము హఠాత్తుగా నీకు కనపడతాము. నీవు గాభరా పడకు. మేము దయ్యాల మనుకోకు. అన్నాము. నేను 'బాబు బాబూ! ఆపనిమాత్రం చేయకు. మాఆవిడకు ఫిట్సు ఉన్నవి. అంటే మూర్ఛరోగ మన్నమాట నీవు కనపడకుండా ఆవిడ చెవిలో ఇల్లా చెప్పావనుకో, ఆవిడ నిలుచున్నది నిలుచున్నట్లు ఎగిరి ఒక్కగంతు వేస్తుంది. వాకిట్లోకి పరుగెత్తుతుంది. చచ్చినా ఈయింట్లోకి రా నంటుంది. ఆ యింట్లో దయ్యా లున్న వంటుంది. నేనేం చేయాలి? ఈఊళ్ళో అద్దెలకి ఇళ్ళు దొరకవు. ఈయింటాయన నెలకి రెండుసార్లైనా నాతో పేచీపెట్టుకుంటాడు. అద్దె ఎక్కువ చేయమంటాడు. ఆయనతో నేను బాధపడలేకుండా ఉన్నాను. పాపం ఈ రెండు గదులూ పాతికరూపాయల కిచ్చాడు. ఈఊరు మండి పోతున్నది. ప్రతిఊరూ ఇట్లాగే మండిపోతున్న దనుకోండి. సుద్ధమైన కొంపదొరకడం కష్ట మనుకోండి. నేనిక్కడ నుంచి వెళ్ళిపోయినానా? ఏ చెట్టుకిందో ఉండవలసిందే తప్ప ఇంకో గతి లేదు. ఆపనిమాత్రం చేయ వద్దు బాబూ" అన్నాను. విష్ణుశర్మ "మరి ఎల్లాగయ్యా, మమ్మల్ని పోయి కాలువ ఒడ్డున మనుష్యులై రమ్మంటావు. ఆ కాలువఒడ్డున చాకలివాళ్ళు గుడ్డ లుతుక్కుంటూ

ఉంటా రేమో? ఎవరైనా నీళ్ళు పట్టుకొనే అందుకు వస్తారేమో మే మదివర కక్కడ లేమాయె. హఠాత్తుగా కనిపిస్తామాయె. వాళ్లందరూ దయ్యాలు దయ్యాలని ఎక్కడి వాళ్ళక్కడ పారిపోతారు. మేము మీ యింటికి వస్తాము. అప్పుడు చెప్పావు మేము ఊరి వెంట తిరిగి వన్నాళ్లు మేము దయ్యాలమనీ నువ్వు దయ్యాల నింట్లో పెట్టుకుని కాపురం చేస్తున్నావనీ నీతో, ఇంక ఊళ్లో ఎవళ్ళూ మాట్లాడరు, నిన్ను వెలివేస్తారు. నువ్వట్లా పోతుంటే వాళ్ళిట్లా పోతారు. నీ స్నేహితు లందరూ నిన్ను రహస్యంగా పిలిచి 'ఏమిటిరా' ఇంట్లోదయ్యాలను పెట్టు కొన్నావట అని అడుగుతారు నీ వేమంటా వంటే కాదురా వాళ్ళిద్దరూ గొప్పవాళ్లు. ఒకాయన పెద్ద పండితుడు. రెండవ ఆయన కవి బ్రహ్మ అంటావు. ఈ స్నేహితులు నీకు పిచ్చెక్కిం దనుకొంటారు నీవు భూత వైద్యాలు చేస్తున్నా వనుకుంటారు. నీ బ్రతుకు ఏకాకి బ్రతుకై పోతుంది. అంతదాకా వస్తే నువ్వుకూడా దయ్యా నివే అంటారు. మనముగ్గురినీ గడ్డలు పెట్టి కొడతారు. మా యిద్దరికీ ఏమి? ఆ గడ్డల బాధ పడలేక పోతే మేము మళ్ళీ స్వర్గానికి లేచిపోతాము. ఉన్న వాళ్ళము ఉన్నట్లుగా వాళ్లకి కనపడము. నీ తరహా అట్లా కాదుగా! మామీది కసికూడా నీ మీదే తీరుస్తారు. చచ్చావనుకో"—నిజమే. ఇపుడేమి చేయాలి? నా కేమీ తోచలేదు, ఈ సమస్య పరిష్కార మయ్యే టట్లు కనిపించలేదు. అన్నాను కదా "నన్నెందుకు చంపుతారు. మీదారిని మీరు పొండి. ఓ విష్ణు శర్మగారూ. ఈ యింగ్లీషు చదువు రాకపోతే నీకే మయ్యా! ఆ ఇంద్రుడు కూడా మోహంలో పడ్డా డేమిటి నీ దగ్గర ఇంగ్లీషు చదువు కోవాలని అన్నా డన్నావుకదా? ఆహా! ఈ యింగ్లీషు దేవతలకి కూడా మోహం కలిగిస్తుం దయ్యా. ఆ విష్ణుమూర్తికీ సదాశివుడికి కూడా ఈమోహం ఉన్నదా? ఉన్న దేమో తెలియదు అన్నాను. విష్ణుశర్మ "సరే లేవయ్యా. ఇప్పుడు మమ్మల్ని ఏమి చేయ మంటావు" అన్నాడు తిక్కన్న అన్నాడు కదా "ఇల్లా కాదయ్యా మీ అత్తవారి ఊరు ఇక్కడి కెంతదూరం ఉన్నది. ఉత్తరం వ్రాస్తే ఎన్నాళ్లల్లో వెళ్లుతుంది". నేను "ఇవ్వాళ్ళ రాస్తే రేపటికి చేరుతుంది" అన్నాను. ఆయన సరే రేపు ఉత్తరం రాయి. నీవు బుధవారం ప్రొద్దుటికి రావద్దు. గురువారం సాయంకాలానికి రావలసింది అంటే సరిపోతుంది. మేము గురువారం ప్రొద్దుటికల్లా మనుష్యులమై ఉంటాము. ఆ అమ్మాయి సాయంత్రానికి వస్తుంది. కావలిస్తే ఆ ఉత్తరంలో వ్రాయి మన ఇంటికి ఎవరో ఇద్దరు బ్రాహ్మణులు వచ్చారు. పండితులు. మన ఇంట్లో కొన్నాళ్లు ఉండవచ్చు." అన్నాడు. నేను" బాబూ అల్లా వ్రాయకూడదు. అల్లా వ్రాస్తే అసలు రాదేమో! వీళ్లకి వంటచేసి పెడుతూ ఎవళ్లు కూర్చుంటారు. వాళ్లు వెళ్ళిన తరువాతే వస్తాం లే అనుకుంటుంది" అన్నాను. విష్ణుశర్మ అన్నాడు "అభయ మెందు

కయ్యా! నీవు సుఖంగా రావచ్చు. ఇక నీకు వంట బాధలేదు. ఈ ఇద్దరు బ్రాహ్మణుల్లో ఒకాయన ఉన్నాడు. ఆయన నలభీమ పాకం చేస్తాడు. ఇంక నీవూ నీ పిల్లలూ వాళ్లకి తలలు దువ్వుకోవటమూ, నీళ్లు పోసుకోవటమూ, ఈబాధే తప్ప ఆ బ్రాహ్మణులు మన యింట్లో ఉన్నన్నినాళ్ళు నీ కేబాధ లేదని వ్రాయి" అన్నాడు. నా మనస్సులో ఒక డక్కు ఉన్నది. మా ఆవిడకి అనుమాన మెక్కువ. ఆవిడ ఎప్పుడైనా బయట ఉంటే ఈ ఊళ్ళో మాచుట్టా లున్నారు కొందరు. వాళ్ళ నెవళ్ళ నన్నా తీసుక వస్తా నంటాను. ఆవిడ చచ్చినా ఒప్పుకోదు. ఎందుకంటే వెనుక ఒకావిడ వచ్చి ఇంతనేయి ఎత్తుక పోయింది. రహస్యంగా బియ్యం తీసుక పోయింది. రేపు మా ఆవిడ నీళ్ళనగా ఆనాడు గారెలు చేసింది. మా ఆవిడమీద ప్రేమల్లే చేసి సరిగ్గా ఒకపాతిక గారెలు మూటగట్టుక ఇంటికి వెళ్ళిపోయింది. అసలే మాది ఒకపూటకి ఉంటే ఇంకొక పూటకి లేని సంసారం. మా ఆవిడ నీళ్ళు పోసుకొని ఇంట్లోకి వచ్చే టప్పటికి కొంప కొంపంతా అయ్యవార్లంగారి నట్టిల్లల్లే చేసిపోయింది. అందు చేత మా ఆవిడ ఇం కొకళ్లు వంటచేయడమంటే ససేమిరా ఏమీ ఒప్పుకోదు. అంత దాకా ఎందుకు? తాను పుట్టింటికి వెళ్ళి నాలుగు రోజులు ఉంటే నన్ను హోటలులో తిన మంటుంది తప్ప ఇంట్లో వంట చేసుకో వద్దంటుంది. నేను వంట చేసికొంటూ ఉంటా ననుకోండి. ఏ పొరుగమ్మోవచ్చి "అయ్యో పాపం మగవాళ్ళు మీకా శ్రమ ఎందుకండీ, నేను చేసి పెడతాను లెండి" అంటా రేమో - అట్లా ఎవరైనా వస్తే ఆవిడకి రెండురకాలైన భయం. అందుచేత నేనన్నాను కదా! "విష్ణుశర్మగారూ! ఆ ఉపాయం కూడా బాగాలేదు. ఇంకొకటి ఏదైనా ఆలోచించండి అన్నాను. వాళ్ళిద్దరూ ఏమి ఆలో చిస్తారు? కర్ణుడిమీద పది బాణములు వేసెను. దుశ్శాసనుని మీద ఇరువది బాణములు వేసెను. శల్యునిమీద నైదుబాణములు వేసెను. ఇదంతా ఒక్క సారి సుమండీ - ఇల్లా వ్రాయడమా. లేకపోతే సంధి విగ్రహము చేయటమా? నెలకి వేయిరూపాయల జీతం వస్తుం దనుకోండి; సంసారం ఎంత బాగా చేయవచ్చు అనుకుంటున్నారు. ఇంట్లో ఏమీలేదనకుండా చేయవచ్చు. నాకుమల్లే నెలకి వందరూపాయలు తెమ్మనండి. పెళ్ళాం, నలుగురు పిల్లలూ, వచ్చేవాళ్లు, పోయేవాళ్లు. పూర్వం నయం. ఒక్క భూలోకంలో వాళ్ళే వచ్చే వాళ్లు. ఇప్పుడు స్వర్గలోకంలో వాళ్ళురావటం మొదలుపెట్టారు. చేయ మనండి సంసారం తెలుస్తుంది. శాస్త్రాలు చదువుకొని పెద్ద పెద్ద గ్రంథాలు వ్రాయ గానే సరా! నిజమైన సంసారపు సమస్య అంటే ఇది. మా ఆవిడ బుధవారం నాడు వచ్చి తీరుతుంది. వీళ్ళు గురువారం నాడు కాని మనుష్యులు కారు. ఇంట్లో కావటానికి వీల్లేదు. కాలవగట్టున కావటానికి వీల్లేదు. ఇల్లాంటి సమస్య భారతంలో ఉందా? పంచతంత్రంలో ఉందా?

# ఐదవ అధ్యాయము

ఒక్కొక్క సమస్య వస్తే ఈ దెబ్బతో మనం ఫైసలే ననిపిస్తుంది. కాని భగవంతుడు మనని ఇంకా మిగల్చాలి అనుకుంటే ఏదో పరమసులభమైన పరిష్కారం చేసి పెడతాడు. మా పూర్వపు చర్చంతా ఆదివారం తెల్లవారి నాలుగు గంటలైంది. వాళ్ళు మాట్లాడుతూనే ఉన్నారు కాబోలు. నాకు నిదుర పట్టింది. వాళ్ళేం చేస్తారు? నిద్రాదరిద్రులాయె. నాకు అదేమిదేమని తెల్లవారిన తరువాత మెలకువ వచ్చే టప్పటికి ఇంచుమించుగా తొమ్మిదైంది. వాళ్ళు అట్లాగే కూర్చున్నారు. నాకు వాళ్ళని చూస్తే చాలా జాలి వేసింది. బ్రతికి ఉన్నప్పుడు ఎంతవాళ్లైతే ఏమి? చచ్చిన తరువాత వట్టి గాలి బ్రతుకులే కదా అనిపించింది. వీళ్ళిద్దరూ చాలా నయం. కొన్ని నెలలైనా మళ్ళీ మనకు మల్లే కాబోతున్నారు; ఏం చేస్తారు ? నేను లేచాను. నా అలవాటు' కొద్దీ అప్పుడు వేపచెట్టెక్కి సవరైన పుల్లను వెదకి, అదంతా చెప్పుట మొందుకు లెండి, ఆ యజ్ఞమంతా అయ్యేటప్పటికి పదైంది. ఇవ్వాళ స్కూలుంది. ఇక వెంటనే వెళ్ళవలసిందే. కాఫీ ఏమాయెనో, తిండి యేమాయెనో. ఏమిరా బాబూ అనుకుంటూ ఉండగా - మంచిరోజు కావాలి కాని ఏది కలసిరాదు. మా ఇంటి కెదురుగుండా ఉన్న అబ్బాయి గబగబా నా దగ్గరకు పరుగెత్తుక వచ్చాడు. ఏం కొంప మునిగిందో అనుకున్నాను. వాడు 'మేస్టారోయి, మేస్టారూ, ఇవ్వాళ మనస్కూలికి సెలవు' అన్నాడు. ఎందుకురా నాయనా అన్నాను. ఎవడో నండి కుఱ్ఱవాడు, మన స్కూల్లో చదువుకొనే వాడు, లారీక్రింద పడి చచ్చిపోయినాడుట అన్నాడు. నేనయ్యో పాపం! అన్నాను. వాడు ఉడాయించాడు. ఈ మాటలు తిక్కన్నా విష్ణుశర్మా వింటున్నారు కాబోలు. లారీ అంటే ఏమిటయ్యా అన్నారు. నేను "అది కూడా ఇంగ్లీషు నేర్చుకోవటంలో భాగమే, లారీ అంటే అది ఒక మోటారుకారు అన్నమాట. దానిలో మనుష్యుల నెక్కించుకోరు. అందులో మనుష్యులు ఉండరు'' అని దాని సంగతంతా చెప్పాను. చెప్పి నేనివ్వాళ స్కూలికి వెళ్ళక్కరలేదు. మీ అదృష్టం అన్నాను. విష్ణుశర్మ మా అదృష్ట మేమిటి వాడెవడో చచ్చాడు గనుక కాని లేకపోతే నీ విక్కడ చచ్చేవాడవు. నీ కిక్కడ తిండా తిప్పలా అన్నాడు. నేను ఎన్నింటి కని ఆలోచించను ? తిక్కన్నకు సరే, నేనంటే

విష్ణుశర్మకు కూడా లెక్కలేదు. అసలు వీళ్ళకి నేను చదు వెందుకు చెప్పాలి ? వీళ్ళకు సాహాయ్య మెందుకు చేయాలి ? అదట్లా ఉంచి ఈ విష్ణుశర్మ వంటలో తాను పెద్దమొనగాణ్ని అన్నాడు కదా ! నేను కాలకృత్యాలు తీర్చుకొంటూ ఉంటే నాగటిదుంపల్లే కూర్చున్నాడు తప్ప, ఏమైనా కాఫీ ప్రయత్నం చేశాడా? ఆ యిల్లాంటివాళ్ళు రోజుకు సేరుకాఫీ తాగుతారు. నా కప్పుడు ఒక ఊహ తోచింది. వీళ్ళకి మాత్రం కాఫీ అలవాటు చేయకూడదు రోయి అని. నే నేదో రహస్యంగా ఇంట్లోకి వెళ్ళటం, ఆ రెండుగుటకలూ నోట్లో పోసు కోవటం, వాళ్ళకు తెలియకుండా గప్‌చిప్‌గా తాగి రావటమే గాని వీళ్ళకి తెలిస్తే ఏమిటి తాగావు అంటారు. ఈ వెధవదానికోసం అబద్ధం చెప్పాలి. కాఫీ అన్నాలి. ఆమాటకు స్పెల్లింగు చెప్పటం తేలికగాని, రెండుపూటలా కాఫీ ఇవ్వటం మాత్రం సాధ్య మయ్యే పని కాదు. పౌనుచెల్లగా పౌను కాఫీపొడి, ఏదో రెండవరకం కొనుక్కొద్దామంటే వీల్లేదు. మా ఆవిడకి ఇండియన్ కాఫీ పొడరు గాని పనికిరాదు. మనకు స్వరాజ్యం రాకముందు ఇండియన్ కాఫీ బాగుండేదే. ఇప్పుడదీ అట్లాగే ఏడుస్తోంది అని అంటే అది వినదు. ఇంతకు ఈ ఇండియన్ కాఫీ ఎందుకు అలవా టైందంటే దాని చిన్నప్పుడు నా పెళ్ళ యింది గాని అది కాపరానికి రాలేదు. వాళ్ళన్నయ్య బొంబాయిలో ఒక ఎనభైరూపాయల ఉద్యోగం చేస్తుండేవాడు. అది మా ప్రాణానికి గొప్ప ఉద్యోగం. వాడు రైల్వేయిలాకా. అందుచేత దమ్మిడీ ఖర్చు లేకుండా, ఈవిడని ఒకసారి బొంబాయి తీసుక వెళ్ళాడు. అవీ ఇవీ చూపిస్తూ ఇండియన్ కాఫీహౌసులోకి తీసుకవెళ్ళి దీనికొక కప్పుకాఫీ ఇప్పించాడు. మరి నిజానికి ఆరోజుల్లో అక్కడ ఒక కప్పుకాఫీ తాగితే తరువాత ఆ పేరుమీద వేడి నీళ్ళిచ్చినా తాగుతారు. కాఫీపొడి కాక పాలు. పాలసంగతి చెప్పానుగదా. ఇక పంచదార. అది వేరే. మనదేశంలో ఉత్పత్తి సరఫరా అయ్యే వస్తువులలో ఒక్కొక్క దాన్ని గురించి ఒక్కొక్క పుస్తకం వ్రాయాలి. అది ఎట్లా ఉత్పత్తి అవుతుంది. అంగడిలోకి ఎల్లా వస్తుంది, ఎంత ఉత్పత్తి అవుతుంది, మనకెలా దొరుకుతుంది, ఇది పెద్దశాస్త్ర మాయెను. గవర్నమెంటు బడ్జెటు లెక్కలలో లాభాలు కనిపించి, జనోపయోగంలో చాలా కష్టంమీద సిఫా రసుల మీద దొరికే వస్తువులలో ఒకటైంది పంచదార. కాఫీపొడి, పాలు, పంచదార ఈ మూడుద్రవ్యములతో కావలసి నటువంటి కాఫీ, నా జీతం సగా నికి సగం నెలనెలకి తింటూ ఉన్న ఈ కాఫీ, వీరికి మరిగించటం బుద్ధిలేని వాడెవడైనా చేయాలి. మా ఆవిడ వచ్చిన తరువాత ఈ కాఫీ వ్యవహార మంతా రహస్యంగా ఉంచవలసిందే. ఇవ్వాళ ఎట్లాగూ ప్రొద్దెక్కిందికదా కాఫీ తాగనే తాగను. నాలుగుమెతుకులు ఉడకబెట్టుకు తింటాను. అంతే చేశాను. ఇంతకూ జరిగిం దేమిటంటే నేను భోంచేసి లేచేటప్పటికే పోస్టు

హాడోక ఉత్తరం తెచ్చి యిచ్చాడు. అది మా ఆవిడ వ్రాసింది. దానీ నలుగురు పిల్లలూ వేయియేండ్లు బ్రతకాలి. ఏమి వ్రాసిందంటే 'ఆవిడ మేనత్త మనమ రాలు నే నెరుగను, దానిమేనత్తలనే ఎరుగను. ఒకమ్మాయి పెద్దమనిషయిం దని. బుధవారం నాడు బంతి అట. కనుక బుధవారంనాడు రావటానికి వీలు లేదు. గురువారం బయలుదేరి శుక్రవారానికి వస్తానని వ్రాసింది. ఉత్తరం చేత్తో పుచ్చుకొని వారిద్దరికీ పోయి వినిపించాను. వాళ్ళు స్వర్గంలో ఎన్నడూ అంత సంతోషపడరు. ఉభయులకూ గండం తప్పింది. ఉభయులరూ అనటం కంటే త్రిభయులకూ అంటేబాగుండును. అర్థం లేదంటారా! నాకు తెలుసును లెండి. మీకు మళ్లీ అర్థాలులేవనే వాళ్ళను గురించి అర్థాలు కాకపోవటాలను గురించి మేము రేడియోటాకులు ఇస్తూనే ఉన్నాం. అదట్లా వుంచి ఇక ఇప్పుడు సమస్యా పరిష్కారమై పోయింది గనుక ఏమిచేయాలి. చదువు మొదలు పెట్టనా ఈ యనని తీసుకో వెళ్ళనా, అనుకుంటూ వుంటే వాళ్ళిద్దరూ అన్నారు కదా "మాకు మానుషాకృతులు వచ్చే వరకూ మే మేమీ చేయలేం. మనష్యులవలె అయిన తరువాత కాని మాకు తెలిసేవన్నీ తెలియటం మానీ వేయవు. అప్పుడు కాని మా బుద్ధి మందగించదు. అప్పుడు నీవు చెప్పే చదువు ఎక్కుతుంది. అంతవరకూ మనం మాట్లాడకుండా ఊరకుండ వలసిందే" అన్నారు. నేనను కొన్నాను "ఓహో అల్లాగా బాబూ చెప్పారు కాదు. రేపటినుండి మీ పోటు నాకు లేదన్నమాట. ఎల్లుండినుంచీ వీళ్ళ తెలివితేటలుకూడా మనలాంటివేగా" అనుకొంటూ వుండగా విష్ణుశర్మ "నీకంత ధైర్యం అక్కరలేదులే, మేం ఎంత మానవాకృతుల్లో ఉన్నా మీకన్నా బుద్ధివిశేషంలో అధికంగానే ఉంటాం" అన్నాడు ఇదేమిటిరా బాబూ! తద్దినం ఇంటికి వచ్చింది. మన మనస్సుల్లో మనం ఏమీ అనుకోవటానికికూడా వీల్లేదాయే. అనువుకాని వేళ నధికుల మన రాదు. కానీలే అన్నాను. అన్నాను కాని సోమ, మంగళ, బుధ, గురు నాలుగు రోజులు గడవాలి. వీళ్ళతో నేనెక్కడ వేగను. ఈయన అప్పటినుంచి కాని చదువు చెప్పించుకోడట! ఆయనను తీసుకెళ్ళి ఇదుగో తిక్కన్న అంటే గాలివిచూచి అందరూ నవ్వుతారు. వీళ్ళతో నేనెట్లా వేగటం? ఇల్లా అన్నాను "అయ్యా! మీరీ నాలుగురోజులు వృథా ఎందుకిక్కడ ఉండటం. ఆ విష్ణుశర్మ గారు వాళ్ళ అగ్రహారాలకు వెళ్ళి రావచ్చు, తిక్కన్నగారూ మీరైనా శాస్త్రి ఆ నెల్లూరివైపుకి వెళ్ళి వస్తే ఆ ప్రాంతాలన్నీ మళ్ళీ చూచుకొన్న ట్లవుతుంది ఏమంటా"రన్నాను. పాపం విష్ణుశర్మ బయలుదేర బోతున్నాడు. తిక్కన్న వున్నాడుగా వెటకం. ఆయన అన్నాడుకదా ఏమయ్యా విష్ణుశర్మా నేను ఎనిమిది వందల ఏండ్ల క్రిందటివాణ్ణి. నీవు నాకంటే రెండువేలో మూడు వేలో ఏండ్ల పూర్వపు వాడవు. నెల్లూరే నానాటి నెల్లూరుకాదు. నే నట్లా వచ్చాను. ఆ వెన్ననే గుర్తు పట్టలేక పోయినాను. దాని కేదో వడ్డా

పెట్టారు. అదేమిటో నయ్యో ఇంకోనగ చేయించారు. అదేమిటో నీళ్ళ నానుకో కుండా పైన ఉన్నది. దానిమీదనుంచి ఏవో పెట్టెలు పరుగెత్తుతున్నవి. సరేలే మన కెందుకని వచ్చాను. ఇంక నువ్వు నీ అగ్రహారాలకి వెళ్ళితే చెప్పుతున్నా విను. నీ వక్కడ ఏమీ గుర్తు పట్టలేవు. నీ కేమీ తెలియదు. 'నివేశ శ్శైలానాం త దిద మితి బుద్ధిం ద్రఢయతి' అని రామచంద్రు డనుకొన్నాడని భవభూతి వ్రాశాడు. నీకూ నాకూ ఆ గుర్తుకూడా ఉండదు. ఒకవేళ మీ ఊరు ప్రక్కన ఏదైనా ఒక చిన్నకొండ ఉండి, ఆ కొండని గుర్తు పెట్టుకుందా మనుకుంటావా, ఆ కొండను త్రవ్వి ఈ పాటికే రోడ్లు వేసుకొని ఉంటారు. రోడ్లమీద పోసిన రాళ్లను చూచి మీ ఊరి కొండరాళ్లని నీవు గుర్తు పట్టగలిగితే వెళ్లు. నిల్చుని గుర్తుపట్టగలిగితే పట్టుతప్పు, ఔనా కాదా అని నేలమీద పడి జాగ్రతగా పరీక్ష చేస్తూ కూర్చున్నావా నీవు మళ్లీ ఇక్కడికి రావు. ఇంగ్లీషు చదువు లేదు, బూడిద లేదు. అయితే నేను వెళ్ల నన్నాడు విష్ణుశర్మ. ఇద్దరూ బైఠాయించుక కూర్చొన్నారు. ఇంక నేనేం చేయాలి, నిన్న అల్లా వీళ్లు నాకు నిద్ర పోతున్నప్పుడే కలలో కనిపించారు. ఇవ్వాళ వట్టప్పుడూ కనిపిస్తున్నారు. అక్కడ ఉన్నారో లేదో అనుకోవటానికి వీల్లేదు. ఎదురుగుండా పిడిరాళ్లల్లే కనిపిస్తూంటే లే రనుకోవటం ఎట్లా ? వాళ్లతో అన్నాను. "అయ్యా ! మీరు పెద్దలు, ఇంకా నాలుగురోజులు గడిచే వరకూ మీకు నా బాధలు లేవు. నేను నా పనులు చేసుకుంటూ ఉండనలె. తమ రనుమతి ఇస్తే నా వ్యవహారాల మీద నేను తిరుగుకుంటూ ఉంటా" నన్నాను. విష్ణుశర్మ "నాలుగురోజు లెందుకయ్యా మూడురోజులే కదా మీ ఆవిడ శుక్రవారం నాడు వస్తుంది తప్ప, మేము గురువారానికే సిద్ధం. ఈ మూడురోజులూ మాకు తిండి అక్కరలేదు, తిప్పలూ అక్కరలేదు. నీవు మాపంక చూడలేదని మే మనుకోనుకూడా అనుకోము. అన్నాడు. ఆయనైతే అన్నాడు కాని నాప్రాణం ఎట్లా ఒప్పుతుంది. వాళ్ల నక్కడ పెట్టుకొని చూస్తూ చూస్తూ వాళ్లక్కడ లేనట్లుగా ప్రవర్తించటం ఎంతకష్టం. కాని తప్పే దేమీ కనిపించలేదు. సరే వాళ్లక్కడ ఉంటే ఉంటారు. నేను కూడా మూడురోజులు సెలవుపెట్టి మా అత్తవారింటికి పోయిరానా అనిపించింది. సెలవు అనటంతోటే అది ప్రాణాంతకం. సరే కాదులే అనుకొని ఇంట్లోనే ఉన్నాను. నా కొక్కటే భయం. నేనా ఎం. ఏ. ప్యాసైనాను. ఈ దేశంలో పెద్దవస్తని. పెద్దపండితుడికింద లెక్క. వీళ్లు నన్ను హఠాత్తుగా ఏదైనా ప్రశ్న వేస్తే నేను చెప్పలేను. నన్ను వెక్కిరిస్తారేమో! నేను మా స్కూల్లోనే ఏదైనా పూర్వకవుల గ్రంథం పాఠం చెప్పవలసి వస్తే మా స్కూల్లో ఒక శాస్త్రిలుగా రున్నాడు. పండితుడు. ముందర ఆయన దగ్గరకి వెళ్లి అర్థాలూ, తాత్పర్యాలూ చెప్పించుకొని అప్పుడు క్లాసులోకి వెళ్లి పాఠం

చెపుతాను. "నీవు పండితుడవు కదా నన్ను గురించి కూడా ఉపన్యాసాలిచ్చి ఉంటావు. నా ఈ పద్యాని కర్థం చెప్పు" అని తిక్కన్నగారు 'పగ యడగించు టెంతయు శుభం బది లెస్సయడంగునే పగంబగ" అన్న పద్యమో 'తుది రాజ్యమ్ము సగమ్ము' అన్న పద్యమో, ఆ తిక్కన్నగారిలో పేచీపద్యాలు చాలా ఉన్నవట, ఒకపద్యానికి నన్నర్థం చెప్పమంటే నేను గుడ్లు కుడుచుకోనా? విష్ణుశర్మ తన పంచతంత్రంలోనుంచి ఒకశ్లోకం చదువుతాడు, అర్థం చెప్పమంటాడు. నే నెక్కడ చావను? నాకైతే ఒక ఆయుధం ఉందనుకోండి. నా చేతిలో రెం డాయుధా లున్నవి. ఒక టేమిటి. హిస్టరి ఆఫ్ లిటరేచర్ ఒకటి, ఫైలాలజీ ఒకటి. అందులో ఒకటి పాశుపతాస్త్రం; ఒకటి బ్రహ్మ శిరోనామకాస్త్రం. అవి ప్రయోగిస్తే ఈ పండితులు 'కోపం ప్రభో సంహార సంహార' అన వలసిందే. అయినా అవి రెండూ చాలా పెద్ద అస్త్రాలు. ప్రతిసారీ వేయ కూడదు. ఇక లాభంలేదురా అంటే వేయాలి. ఆటంబాంబుల వంటివి ఎప్పుడు వేయాలి? ఆదెబ్బతో జపాను వంగి రావాలి. ఒక్క వంగటం కాదు. వంగి అట్లాగే నిలుచోవటం. అల్లాంటి దెబ్బప్పుడు వేస్తాను తొందరపం? అనుకుంటూ కూర్చున్నాను. తిక్కన్నగారికంటె విష్ణుశర్మ పాతదయ్యం. నామనస్సులో ఏ మనుకుంటున్నానో ఆయన చప్పున ఆకట్టి వేస్తాడు. ఆయన అన్నాడు కదా "ఓయిబాబూ! ఆరెండు మహాస్త్రాల సంగతి నాకు తెలియదుకాని నువ్వు ఆ అస్త్రాలు మామీద ప్రయోగించ వలసిన స్థితిమాత్రం నీకు నేను తీసుకరాను, ఏమండోయి. తిక్కన్నగారూ! మనవాణ్ణి మీపద్యాల కర్థం చెప్పమని అడగవద్దు. అడిగి ఏం లాభం చెప్పండి. చెప్పలేడనుకోండి. అతడు ఎం.ఏ ప్యాసుకాలేదని అనటానికి మీకూ నాకూ శక్తిలేదాయె. మనమేమీ చేయలే మాయె, పైగా మనం అతణ్ణి ఆశ్రయించి ఏవోపనులు చేసుకుందామని వచ్చాముాయె, అతణ్ణి బెదర గొడితే బాగుండదు. అంటే తిక్కన్నగారు, ఆయన మంత్రి దర్జా ఆయన కుందిగా? శిరఃకంపం చేశాడు. కాని నేను కూర్చున్నవాణ్ని కూర్చున్నట్లు దివాలా మోహం వేశాను. చూశాడు విష్ణుశర్మ, నే నేదుస్తున్నా నను కొన్నాడో ఏమనుకొన్నాడో ఇల్లా అన్నాడు. "అబ్బాయి? భయపడకు. నేను ఊరకే నవ్వుతూ అన్నాను. నువ్వు సామాన్యుడవైతే ఏం. ఏ. ఎట్లా ప్యాసవుతావు. ఒక్క పద్యాల కర్థం చెప్పటం తోటే అయిపోతుందా పాండిత్యమంతా. ఏవో నువ్వు మనస్సులో అనుకుంటున్నావు, దాని పేరేమిటి ఫైలాలజీయా? అంటే ఏమిటి అన్నాడు. నేను పుటిక్కిన వీళ్ళతో చెప్పివేస్తే నేను ప్రయోగించబోయే అస్త్రిముయొక్క రహస్యం వీళ్ళకి చెప్పటమే కదా! ఈవిష్ణుశర్మ ఎంత యెత్తువేశాడు? పాతకవలె బుద్ధవిగ్రహంలాగా కూర్చున్నాడు. ఓరి నీనీతి కాల! ఆవలిస్తే పేవులు లెక్క పెట్టేవాడు. ఇప్పుడు ఫైలాలజీ అంటే చెప్పివేయనా వద్దా? చెపితేమాత్రం ఏమి, అస్త్రాన్ని గురించి ఊరికే పఠిస్తే

నష్టమేమి? ప్రయోగించే టప్పుడు దాని నైపుణ్యం చూపించాలికాని, అనుకొని ఫైలాలజీ అంటే చెప్పాను. జర్మనీలో ఇంగ్లండులో పెద్దపెద్ద సంస్కృత పండితులు సంస్కృతం, అరబిక్, పర్షియన్, గ్రీకు, లాటిన్ మొదలైన భాషల నన్నింటినీ, దగ్గరపెట్టుకు చదివి శబ్దముల సామ్యాలు చూచి అవి ఎక్కడ పుట్టినవి, వాటి కి మూలమిషు ఏమిటి మొదలైనవంతా విచారించి పెద్దపెద్ద గ్రంథాలు వ్రాశారు. లెండి. అసలు వేదం ఎప్పుడు పుట్టింది. వేదంలో ఒక్కొక్క శబ్దం ఎన్నిమార్లు వాడారు. ఓహో! చాలా చేశా రన్నాను. విష్ణుశర్మ గాథరా పడడానికి బదులు నవ్వుతూ వేదం ఎప్పుడు పుట్టిందేమిటి అన్నాడు. అంటే నేను కల విధాల క్రీ.పూ. రెండువేల యేండ్లకు పుట్టి వుండవచ్చు అన్నాను. అంటే ఇప్పటికి ఎన్నివేల ఏండ్లు అన్నాడు. నాలుగు వేల ఏండ్లు అన్నాను. ఆయన తిక్కన్నవంక చూచాడు. తిక్కన్న ఆకాశం వంక చూచాడు. వాళ్ళ యిద్దరి లక్షణం చూస్తే 'ఛీ! వీడి దగ్గరకు రావడం ఏమిటిరా?' అన్న ట్లనిపించింది. వాళ్ళిక్కడి నుంచి వెళ్ళిపోవటం నాకు చాలా అభిమతమని వాళ్ళకు తెలుసు. అవి రెండూ పెంకిఘటాలు. నన్ను వదలిపెట్టి పోతారా! నుళ్ళిసద్దురుని కూచున్నారు. నేను కొంచెం వాళ్ళని పుడికించాలని 'ఏం, మాట్లాడరేం' అన్నాను. వేదాలు పుట్టింది నాలుగువేల ఏండ్ల కింద కాదా అన్నాను తిక్కన్న "నిస్సంశయముగా నాలుగువేల ఏండ్లకు పూర్వమే" అన్నాడు. విష్ణుశర్మ 'నాలుగువేల ఏండ్లకు పూర్వమే అన్నా నిజమే, నాలుగు వేల ఏండ్లకు పూర్వమే అన్నా నిజమే" అన్నాడు. భూత కాలంలో ఎంతెంత దూరమో మన కెందుకు? రాముడు రావణుని చంపాడు నిన్న ప్రొద్దున చంపాడా, కొన్నిలక్షల సంవత్సరాల క్రింద చంపాడో మన కెందుకు 'చంపెను' అన్నది భూతకాలక్రియ. మన బ్రతుక్కి చాలదా అన్నాడు. నేనేం చేయాలి. వాళ్ళు నాతో వాదనకి దిగితే ఇంటర్నల్ ఎవిడెన్సు (Internal evidence) చూపింతును. అది బ్రహ్మాండమైన పరిశోధనాభాగ్య మూలము, ఒక గ్రంథం ఎప్పుడు వ్రాశారు అంటే ఎంత తతంగంఉన్నది. అసలుండి యొక్క కాలనిర్ణయం చేసి పూర్వ పూర్వంగా విచారించుకొంటూ వీటియు అంతానుపూర్వ్యం అని నిర్ణయించవలసిన విషయం. కాదా శబ్దరూపాలుంటూ ఉంటే ప్రాచీనమైవి, గ్రామ్యమైవి, మరిపాత వేవి? వాటితో నిర్ణయించవలసిన కాలమూలము. ఇల్లా చేయుటుందా అనుకుంటూఉంటే తిక్కన్న గారన్నారు. "బాబూ! ఏమిటివాలన్నీ నాకు తెలుసు. విష్ణుశర్మ నావంక చూస్తే నేనాకాశంవంక ఎందుకని చూసుకున్నాను. ఆ శబ్దాలన్నీ ఖగోళాన్ని పట్టి నిర్ణయించాలోయి. నీవు మనస్సులో అనుకుంటున్న మార్గాలన్నీ తప్పుడుమార్గాలు. అది మీకాలని కే సరిపోయుంట" అన్నారు. నాకు కొంచెం కోపం వచ్చింది. "ఆ ఖగోళాన్ని గురించి మాకు తెలుసు బాబూ! మా బాలగంగాధర తిలక్, మా

వసువు మొదలైన వాళ్ళు ఆకాశంలో ఉండే వట్టి నక్షత్రాలనే కాదు. ఉత్తర ధ్రువం దగ్గర ఉండే శీతోష్ణస్థితుల దగ్గరనుండీ విచారించి వేదకాలాన్ని నిర్ణయించారు. మహా అయితే వేదకాలం క్రీ. పూ. పదివేల ఏండ్లు కావచ్చు. అంతకుమిమించి పోద''న్నాను. ఇంక తిక్కన్న ఏంచేస్తాడు. విష్ణుశర్మ అన్నాడు. "ఆకాశం అంటే ఏదో కనిపిస్తున్నట్టు ఉంటుంది. ఓరి నాయనా! కాలంమాట ఏం చెప్పావు? నీకు వక్కవర్తమానమే తెలుసు తప్ప అనంతమైన భూతకాలం తెలియదుకదా" అన్నాడు. ఇంకె మొండికి వేస్తే కాని లాభంలేదని 'అది మీకుమాత్రం తెలుసునా ఏమిటి' అన్నాను. ఆ దెబ్బతో మక్కెలు విరగ కొట్టినట్లే. ఇంక లేవట మెక్కడిది? విష్ణుశర్మ ముఖం చూచాను. నల్లపడి ఉండాలని. ఏమీ నల్లపడలేదు. గాలికదా నల్లపడ దనుకున్నాను. మొత్తానికి మోటువా డనిపించాడు. ఈ పండితు లందరూ చాలా మోటువాళ్ళు. బండతర్కం చేస్తారు. ఆయన అన్నాడుకదా! "మీ తాతతాత ఉండాలికదా! ఆయన చిన్నప్పుడే చచ్చిపోయినాడు. మీతాతతండ్రిని కనక ముందే చచ్చిపోయినాడు. తరువాత మీతాత పుట్టాడు. ఏమంటావు" అన్నాడు. నేను "మీ తాతతాత అంతే'' నన్నాను. నాకు ఉక్రోషం పట్టకుండా వచ్చింది. ఆయన నవ్వి 'నిజమే మా తాతతాత అట్లాగే, మీ తాతతాత అట్లాగే. ఎట్లాగో మనకు తెలియదు. ఒకట్లా అని మనం అనుకుంటాము. నీ కనవసరంగా కోపం వచ్చింది. భూతకాలం నీకెంత తెలుసో మాకూ అంతే తెలుసు. అందుకని చెప్పాను. కాని నీకు మీతాతతాతని గురించి దురభిమానం ఉంది. అందుచేత నీకు కోపం వచ్చింది. మాకు వేదాలనిగురించి అట్లాగే దురభిమానం ఉందనుకో. మాకు మాత్రం కోపం రాదా! ఇంకోమాట చెపుతున్నా విను నాయనా. వేదాలు మాకు ఎట్లాంటివో నీకూ అట్లాంటివే. నీకు కూడా నిజంగా కోపం రావాలి. ఎందుకు రాలేదో తెలియదు" అన్నాడు. తిక్కన్న "నీ కెంత జీతమయ్యా!" అన్నాడు. నేను ఎంత? బూడిద అంతా కలిపి నూటయాభై వస్తుందన్నాను. తిక్కన్న అన్నాడు. మరి నూట ఏభైరూపాయల జీతానికే నీవు వేదాలు నాలుగువేలయేండ్లక్రింద వ్రాశావంటే ఒప్పుకొన్నావే. నాలుగైదువేల జీతాలు వచ్చేవాళ్ళు ఎందుకొప్పుకోరు. ధనమూల మిదం జగత్. అవన్నీ నిజమంటే మీకు జీతాలు వస్తవి. లేకపోతే పండితులంటారు. ముప్ఫయ్యో నలభయ్యో ఇస్తారు. ఏమంటావు? అన్నాడు. ఇంక నేనేమనను? ఇదేమిటో వీళ్ళిద్దరూ నాకేదో శుద్ధిచేయాలని వచ్చినట్లున్నారు తప్ప, నావద్ద చదువుకోవటానికి గాని, నావలన గొప్పవాళ్ళవటానికి గాని రాలేదు. నేను మనస్సులో ఒకటి దృఢం చేసుక కూచున్నాను. వీళ్ళెంత మార్చినా సరే, ఎంతమార్చటానికి ప్రయత్నించినా సరే, నేను మారేది లేదు. మారదలుచుకోలేదు. మారను. వీళ్ళకి-మల్లే వేదాలు అపౌరు

చేయాలు అని నేనంటే ఈదేశంలో ఎవడైనా రేపు నాముఖం చూస్తాడా? నన్నుపన్యాసాలకి పిలుస్తాడా? అన్ని పత్రికల్లోనూ నన్ను లేవిడి పడుతారు. ఆపని చేయదలుచుకో లేదు. అందుచేత ఎప్పటి కేయది ప్రస్తుత మప్పటి కా 'టాకు' 'టూక' మన్నాడు. వీళ్ళతో ఇప్పటి పద్ధతంతా బాగుండలేదని తిడుతూ ఉంటాను. బయట యథాప్రకారం ఇంగ్లీషువాడు ఎంత వ్రాస్తే అంతే ప్రమాణం. కలలో కనిపించిన డబ్బు మేల్కొంటే దొరకలేదని ఏడ్చాడట! వీళ్ళ కోసం ఉద్యోగం పోగొట్టుకుంటానా? రేపు డాక్టరేటికి ప్రయత్నం చేయవలెననుకుంటున్నాను. ఆకాశంవంక చూస్తూ కూర్చుంటే తెలిసిన్లే. పైకి అనబోయినాను, "ఎవ్వే కాదండి నేను మీవైపువాణ్నే. పైకిమాత్రం ఇల్లా ప్రవర్తించాలి" అని. అంతలో జ్ఞాపకం వచ్చింది. నామనస్సులో ఉన్న భావాలన్నీ వీళ్ళ కిదివరకే తెలుసునాయె. ఈఎంగిలి మాటకూడా ఎందుకని ఊరకున్నాను. ఇదంతా ఎట్లా ఉందంటే ఇంగ్లీషులో ఒక్కనవల ఉన్నది. దానిపేరుCranford అఊరొక అడవుళ్యాళం. వాళ్ళందరూ పేదవాళ్ళే. ఒకావిడ ఒక రోజున తక్కిన వాళ్ళందరినీ భోజనానికి పిలిచింది. వాళ్ళందరూ వచ్చారు. వాళ్ళింట్లో భోజనం చేసే పెద్దబల్ల ఒక్కటే ఉంది. ఈవిడ వంటలన్నీ చేసి పళ్ళాలల్లో పెట్టి ఆబల్లక్రింద పెట్టింది. వాళ్ళు ఆబల్లమీద కూర్చుంటే ఎల్లాగా? వాళ్ళు లేవాలి? ఆపళ్ళాలు తీయాలి? వాళ్ళను లెమ్మంటే మర్యాదా నష్టం. మరి వడ్డించదేమి అంటే వంట కత్తె రాలేదు అంటుంది. సమస్య ఎల్లా తేలుతుంది. అన్నపుపళ్ళాలు దానిక్రింద ఉన్నవనీ, వాళ్లు లేస్తేకాని అవి బయటకురావనీ, వంటకత్తె అసలు లేదనీ, వాళ్లకు తెలుసు. వాళ్లకి తెలుసునని తనకు తెలుసు. తనకు తెలుసునని వాళ్లకు తెలుసు. వాళ్లకి తెలుసునని తనకు తెలుసునని వాళ్లకు తెలుసునని తనకు తెలుసు. ఇల్లా ఎంతదూరమైనా పోతుంది. కాని వారక్యం ఎక్కడనో ఒకచోట ఆపాలి గనక ఆపాము. ఇల్లా ఉంది మా స్థితి. ఈ స్థితిలో ఏంచేయాలి భగవంతుడు నన్ను ఎంత అన్యాయము చేశావు. ఇల్లాంటి వాళ్లని నా దగ్గరకు పంపించే ముందు నా మనస్సునకు కదలకుండా ఉండట మనే విద్య నేర్పి వీళ్లని తీసుకవస్తే వీళ్ల ఈ ఆటలు సాగేవి కావు. అదేమిటోయి, మనస్సు కదలకుండా ఉండటమే. అదేదో యోగుల కౌతుంటి. అంటు లేమో. నన్ను యోగిని చేయ మనటం లేదు. నా కక్కరనూ లేదు. యోగైతే ఏముంది బూడిద ? ఉద్యోగం చేయాలి. డాక్టరేటు పుచ్చుకోవాలి. మా విశ్వవిద్యాలయంలో మా శాఖకు ప్రధానాచార్యుడిని కావాలి. అప్పుడుంటి మజా. తెలుగుదేశం మొత్తంమీద ఎవడురా గొప్పవాడని అమెరికావా డడుగుతా డనుకో? నేనని చెప్పేస్తాను. అది అమెరికాలో ప్రకటిస్తారు. ఇక్కడ ఎంతమంది గింజుకున్నా సరే. అదయ్యవార్లంగారి ముద్రే. నేను యోగిని కానే అక్కరలేదు. అసలు యోగికావట మెందు

కంటా. యోగులచరిత్ర అని ఒక పుస్తకం రాస్తాను. ఆ పుస్తకంలో నే నెంతమంది యోగులని గురించి రాస్తానో అంతమంది కంటె నేను గొప్పవాణ్ణి కదా! కా దనటానికి ఎట్లా వీలు ? అసలట్లే మాట్లాడితే యోగులని గురించి ఏదైనా వాకబు వస్తే ఎవరిని కనుక్కోవాలి ? నన్ను కనుక్కోవాలి. అల్లాంటి గొప్పదశ వదలి పెట్టి నేను యోగి నౌతానా ? యోగు లెవళ్లౌతారు. వాడెవడో మాలవా డైనాడట, లేకపోతే ఒక పూజారి కావాలి. మరీ కాక పోతే రమణమహర్షివలె చిన్నప్పుడే కొంపలోనుంచి లేచిపోయి కావాలె. ఎం. ఏ. ప్యాసైంది యోగి అయేందుకా ? బలేగా చెప్పావే. ఊరికే మూజు వాణీగా వీళ్ల ఇద్దరిబాధా నాకు తొలగే అందుకు. అదైనా ఎన్నాళ్లు గురు వారం ప్రొద్దుటి దాకాను, నా మనస్సాడకుండా ఉంటే సరిపోతుంది. ఇందు లోనూ కొంతలాభం ఉందనుకోండి, రేపు వీళ్లు నాకు మల్లేనే మనుష్యు లయ్యే టప్పటికి ఇవన్నీ వీళ్లకి జ్ఞాపకముండి చస్తేగా. అనుకుంటూ ఉండగా విష్ణుశర్మ అన్నాడు. "అబ్బాయి! నీవు తెలివితక్కువవాడవి కావు. నీఊహ నిజమే సుమా. మాకు గురువారం ప్రొద్దుటినుంచీ ఇల్లా నీ మనస్సులో ఉన్న ఊహాలు తెలుసుకొనే జ్ఞానం పోతుంది. దానికి కారణం పాంచభౌతికమైన శరీరం. పాంచభౌతికమైన శరీరం ఉండటం తోటే అజ్ఞానం చాలా సహ జంగా ఉంటుందోయి అన్నాడు. నేను వెంటనే లేచి నేనామాట ఒప్పుకోను. మానవులలో ఎంతమంది తెలివిగలవా ళ్ళున్నారు. మాక్సుముల్లరు ఉన్నాడు బెరిడీల్ కీత్ ఉన్నాడు. హక్స్లీ ఉన్నాడు. ఇంకెంతమంది ఉన్నారు. పాంచ భౌతిక శరీరంతో అవివేకం సహజంగా ఉంటుంది అన్న సిద్ధాంతం మీ వేదాలూ, శాస్త్రాలు చదివిన వాళ్ళనవలసినమాట తప్ప ఇది ఇరవయ్యో శతాబ్దం బాబో! జ్ఞానం ఊరికే వృద్ధిపొంది పోతుంది. ఎంత వృద్ధి పొందిపోతుందో స్వర్గంలోనే చూచారుగదా! ఈ విష్ణుశర్మ నీతిచంద్రిక వ్రాసిన వాడు కాడు. అని వందమంది అర్జీలు పెట్టారాయె. ఇన్ని యుగాలు జరిగినవి. స్వర్గంలో ఇల్లాంటికథ జరిగిందా ? మీరే చెప్పండి. స్వర్గంలో అంటే క్రొత్తగా వచ్చారా ? ఇక్కడివాళ్లే అక్కడికి వెళుతున్నా రాయెను. ఇల్లాంటివాళ్ళు పూర్వం స్వర్గంలో లేరంటే అర్థమేమిటి ? భూలోకంలో జ్ఞానం వృద్ధి పొందుతోం దన్నమాట ఏమంటారు ?" అన్నాను. ఇదివరకు ప్రశ్నదానికీ విష్ణు శర్మ ఏదో ఒక సమాధానం చెపుతూ వచ్చాడు. కాని దీనికేమీ నోరు మెదల్ప టానికి వీల్లేక పోయింది. ఒప్పుకు తీరవలసిందే. ఇద్దరూ ఒప్పుకున్నారు, నే నా పాటున లేచి ఎగిరి గంతులేసి "ఇరువదవ శతాబ్దము జయించుగాక" అని అరిచాను. "ఇరువదవ శతాబ్దము చిరకాలము జీవించుగాక, జిందాబాద్" అని అరిచేశాను. వాళ్ళిద్దరూ తెల్లబోయినారు. వాళ్లు హైదరాబాద్ పేరు విని ఉన్నట్లున్నారు. జిందాబాద్ అంటే హైదరాబాద్ వంటి దనుకున్నారు.

అబ్బాయి మేము హైదరాబాద్ వెళ్ళటం ఇష్టం లేకనే ఇక్కడకు వచ్చాము మమ్ములను జిందాబాద్ మాత్రం పంపించకు అన్నాడు. నేను నవ్వాను. "అబ్బా! ఎంతసేపటికి పిల్లు నా చేతిలో చిక్కారు. రెండురోజులు నాప్రాణాలు లాగివేశారు. నేను ఏమనుకోవటానికి వీలులేదాయె. మా ఆవిడ పుట్టినింట ఉందికదా అని ఏదో శరీరధర్మంగా ఏ శృంగారరసపుటూహాయో తెచ్చుకుందా మంటే పిళ్ళు కుంపట్లవలె ఎదుట కూచున్నారు. ఒరేయి! నీవు నీపెళ్ళాన్నిగురించి ఇట్లా అనుకుంటున్నావే అన్నా రనుకో. చచ్చానే ఇంకే ముంది. వాళ్ళు అట్లా అన్నారన్న సంగతి రేపు మా ఆవిడ వస్తే పొరపాటున సరదాకి చెప్పా ననుకోండి. ఇంకేముంది వాళ్ళని ఇంట్లో ఉండనిచ్చేదా, నాకన్నం పెట్టేదా.

---

# ఆరవ అధ్యాయము

మా ఆవిడ వచ్చింది. వాళ్ళిద్దరూ మా ఇంట్లో ఉండటమనేది తీర్మానమై పోయింది. విష్ణుశర్మ మూలంగా అంతా సజావుగా నడుస్తోంది. మా ఆవిడకి విష్ణుశర్మ బాబుగ్గా రైనారు. ఆవిడ కింట్లో పని సగానికి సగం తగ్గింది. మా పిల్లలు పూర్వం వాళ్ళమ్మని ప్రాణాలు కొరికే వాళ్ళు. ఆ విష్ణుశర్మ నేర్పేమిటో వాళ్ళని దగ్గర కూర్చో పెట్టుకొంటాడు. వాళ్ళ కేవో కథలు చెపుతుంటాడు. వాళ్ళు తాతయ్యా తాతయ్యా అంటూ ఆయన చుట్టూ మూగుతారు. ఆవిడ వచ్చిన మరునాడే వాన పడ్డది. కట్టెలు తడిసినవి. పొయి మండలేదు. ఆవిడకి పరమచాదస్తం. హోరుమని వాన కురుస్తుంటే తడి గుడ్డతో ఊరేగటం మొదలు పెట్టింది. తడిగుడ్డని చూస్తూ ఉంటే పొడికట్టే మండదే. ఇంక తడికట్టె మాట చెప్పాలా. అలకపీటలమీద పెండ్లికొడుకల్లే కూర్చున్నది. సైకిలు కొనిపెడతా నన్నా లాభం లేదు. గడియారం కొని పెడతా నన్నా లాభం లేదు. అడపడుచుకి మాటపడహోల్లిస్తే గాని తేలేటట్టు లేదు. విష్ణుశర్మ లోపలకు వెళ్లాడు. ఒక్క అదమాయింపు అదమాయించాడు. నీ మొహానే ప్రొద్దు పొడిచిం దనుకున్నావా ? నీవు లేకపోతే పెళ్ళికొడుకులు దేశంలో లేరన్న మాట. ఈ ఆరువేలు ఇస్తే కొండమీది కోతి దిగి వస్తుంది. చాలు చాలు లేవోయి. ఈపాటికే మామగారు చితికిపోయినాడు. అలకపీటల మీద నుంచి ఇంక లే అన్నాడు. ఏడుస్తూ ఆ కట్టెపుల్ల మండటం మొదలు పెట్టింది. ఆయన అన్నమూ పప్పూ కూరా పులుసూ ఇల్లా గిఱ్ఱున తిప్పి వేశాడు. ఇవతలకు వచ్చాడు. మా ఆవిడకి ఈ సులువు తెలిసింది. పొయ్యి ఏమాత్రం మండకపోయినా సరే. బాబుగారూ ! చూశారా ఈ పొయ్యి మళ్ళా మారాం చేస్తుంది అంటుంది. అంటే అయిదునిముషాల్లో వంట అయిందన్నమాట. కొంపమాత్రం లోపల బాగా సాగుతోంది. పది పదిహేను రోజులు గడచినవి. ఈ తిక్కన్న మీటింగూ పెట్టలేదు. ఆ విష్ణుశర్మకి ఇంగ్లీషు చదువూ మొదలు పెట్టలేదు. ఇంతలో మా ఆవిడ బయట ఉన్నది. ఇంక ఇంట్లో పనేమున్నది. విష్ణుశర్మ నాలుగు మెతుకులూ అల్లా ఉడకేసి పారేశాడు. మా ఆవిడ ఇంట్లో ఉంటే మధ్యాహ్నం ఒంటిగంటయినా తెములని పని విష్ణుశర్మ అంతా గంటలో తేల్చి పారేశాడు. ఆ రోజున పైగా ఆదివారం అదివరకు కూర్చుని చదువుకోండి రా నాయనా అంటే, వాళ్ళ కెడ్డైనా

వినని మా పిల్లలు ఆ విష్ణుశర్మ వాళ్ళచేతికి పుస్తకా లిచ్చి చదువుకోండిరా అంటే బుద్ధిమంతులవలె కూర్చుని చదువుకొంటున్నారు. మావా డిట్లా చదివితే వాడు స్కూలుఫైనలుకి కూర్చునే టప్పటికి నేను చిన్నవయస్సుకి పర్మిషన్ తెప్పించ వలసిందే. భోజనమైన తరువాత విష్ణుశర్మ నా దగ్గరకు వచ్చి ఏమయ్యా నీ యింట్లో చాకిరీ చేయించు కొంటున్నావు కాని నాకు ఏ బి సి డీ లు మొదలుపెట్టలే దన్నాడు. ఈ పదిహేను రోజులు తిక్కన్న దర్జాగా సువారపుదొరల్లె వేళకు వస్తాడు. భోంచేస్తాడు. ఆయనకు ఇష్టం వచ్చినచోట పడుకొని నిదురపోతాడు. మాతో మాట్లాడడు. సరే. మన కెందుకు? విష్ణుశర్మకు చదువు చెప్పక తప్పని సరైంది. కూర్చో బెట్టాను. మావాడి ఇంగ్లీషు పుస్తక మున్నది. మా అమ్మాయి పలక ఉన్నది. ఇంగ్లీషు పుస్తకంలో అచ్చు పెద్దక్షరాలు చూపించాను. ఆయన గుర్తుపట్టటం మొదలు పెట్టాడు. ఇవి చూసి వ్రాస్తా నన్నాడు. అవి వ్రాసేవి కాదు బాబూ! ఊరకే గుర్తు పెట్టుకో వలసినవే నన్నాను. "ఆ భాష చూచి చదివేది మాత్ర మేనా? వ్రాసేది కాదా?" అన్నాడు. వ్రాసేదే. దానికి వేరే అక్షరాలు ఉన్నవి అన్నాను. ఇల్లా వ్రాయకూడదు. ఆ అక్షరాలు వేరే వ్రాయాలి. ఇవి అచ్చు అక్షరా లంటారు. వ్రాత అక్షరాలు వేరు అన్నాను" అన్నాను. "అచ్చుకు పేరు, వ్రాతకు వే రెందుకయ్యా?" అన్నాడు. వ్రాతవి అచ్చు వేయటం కష్టం. అచ్చు అక్షరాలన్నీ గీతలు గీతలుగా ఉంటవి. వ్రాత అక్షరాలు గుండ్రగుండ్రంగా ఉంటవి.. అసలు కొందరు వ్రాస్తే ఏ అక్షరాలూ కనిపించవు. ఆ బాధ లేకుండా తేలికగా చదవటం కోసం ఈ అక్షరాలు ఏర్పరచారు" అన్నాను. ఆయన ఈ అక్షరాలే వ్రాస్తూ ఉంటే వాటి మెలిక లవి తిరుగుతూ ఉంటవికదా. ఇంకో అక్షరా లెందుకు? వేరే మెలిక లెందుకు? అన్నాడు. నేను "బాబూ అడుగులోనే హంసపాదా? మొదటి నుంచీ ఇల్లా అయితే ఈ చదువు తేలదు బాబూ!" అన్నాను. అని ముందర ఈ అక్షరాలన్నీ వచ్చేవరకూ మళ్ళీ మాటాడను అంటే చదువు చెపుతా నన్నాను. ఆయన సరే నన్నాడు. నేను గుర్తుపెట్టుకుంటూ ఉండమని ఎక్కడకో వెళ్ళి పోయినాను. సాయంత్రం వచ్చాను. ఆయన నన్ను చూచి, ఏమయ్యా! ఎక్కడకో వెళ్ళి పోయినావు. ఆ పెద్దఅక్షరాలు గుర్తు పట్టడానికి ఇంత సేపా నాకు? వెంటనే ఏదన్నా పుస్తకం తీసుకురా మొదలు పెడదాం అన్నాడు. నేను ఓయి బాబూ! అప్పుడే కాదు. అవి ఇరవై ఆరక్షరాలు. ఇంకా ఇరవై ఆరక్షరా లున్నవి. అవి కూడా గుర్తుపడితే కాని పుస్తకం సాగ దన్నాను ఆయన ఇరవైఆరూ ఇరవైఆరూ ఏభైరెండు అక్షరా లున్నవా? పెద్ద వర్ణ సమామ్నాయం కల భాషే అన్నాడు.

నేను ఆ ఇరవైయారక్షరాలు వేరే కాదు. ఇదివరకు నీవు గుర్తుపట్టింది, పెద్దక్షరా లంటారు. ఇంగ్లీషులో వాటికి Capital letters అంటారు. ఇప్పుడు గుర్తు పట్టబోయేవి చిన్న అక్షరాలు. అవీ ఇవీ ఒకటే. అంటే ఆయన అవీ ఇవీ ఒకటే అయితే రెండు బళ్ళెందుకయ్యా. వాటిని విడిగా గుర్తు పెట్టుకోవట మెందుకు. వీటిని విడిగా గుర్తుపెట్టుకోవట మెందుకు. ఇడుగో వీడు చొక్కా తొడుక్కున్న మామయ్య. ఇడుగో వీడు చొక్కా తొడుక్కోని మామయ్య అన్నట్లుగా. ఇద్దరు మామయ్యలూ ఒకటే నాయె. అంటే, నే నన్నాను, కాదయ్యా! బాబూ! ఈ పెద్దక్షరాలకి ఒక ప్రయోజన ముంది. ప్రతి వాక్యం మొదటా వాటిని రాయాలి, అన్నాను. ఆయన "సామెత ఉందిలే వెలమవారి పంక్తి' అని. మొట్టమొదట భట్రాజును కూర్చో పెట్టాలిట. వాడు ప్రతిదీ వడ్డించుకొంటూ ఉంటాడు. వెలమదొర లందరూ వడ్డించుకొంటారు. లేకపోతే వాళ్ళ కేమో కావాలి, అడిగితే మర్యాదా నష్టం. అదీ వెలమపంక్తి అంటే. అట్లాగే ప్రతివాక్యానికి మొదట ఒక పెద్దక్షరం వ్రాయా లన్నమాట. దాని పేరు కాపిటల్ లెటరా ? నేను నేర్చుకొన్న వన్నీ కాపిటల్ లెటర్లు అన్న మాట. అంటే నేను నిముషంలో వచ్చేశావే మాట అన్నాను. సరే, అట్లా ఉంచు. ఆ చిన్నక్షరాలు కూడా ఏమిటో నేర్పు మన్నాడు. నేర్పే దేముంది ? ఆ అచ్చుపుస్తకంలో ఈ సి ఇవీ చిన్న అక్షరాలని చూపించాను. ఏ బి సి డి అని చెప్పాను. వరుసగా అవే అక్షరాలు వ్రాయటం మాత్రం ఇంకో విధంగా వ్రాస్తున్నాము కాని అన్నాను. అంటే ఆయన "ఇవి కూడా అచ్చక్షరాలే నంటివి కదా. వ్రాసే తద్దినం వేరే ఉందంటివి. వ్రాయటంలో కూడా ఇల్లా రెండు భేదా లున్నయా. ఒక పద్ధతిగా వ్రాస్తే సరిపోతుందా- అన్నాడు. నేను 'అందులోనూ రెండు భేదా లున్నవి బాబూ! ముందర ఈ అచ్చు చిన్నక్షరాలు గుర్తుపెట్టుకోండి' అన్నాను. ఎంత పండితుడైనా ఒక్కొక్క దానిలో మెలిక పడతాడు. ఆయ నకి పెద్దక్షరాలు గుర్తుపెట్టుకొన్న తరువాత మళ్ళీ అవే అక్షరాలు ఇంకో విధంగా చిన్నక్షరాలుగా ఉంటే గుర్తు కుదరలే, G ఉన్నదనుకోండి. పెద్ద అక్షరం తేలికగా గుర్తు పట్టాడు. చిన్నక్షరం దగ్గరకు వచ్చేటప్పటికి, దానికీ దీనికీ ఏమి సంబంధం లేకపోయేటప్పటికి కొంచెం గాభరా పడ్డాడు. అదీ ఎఫ్ ఇదీ ఎఫ్ ఎల్లాగయ్యా అంటాడు. నే నన్నాను బాబూ! చదువులో ఉన్నది ఉన్నట్లుగా గ్రహించాలి తప్ప ఎల్లాగయ్యా అంటే, ఎట్లా కుదురు తుంది అన్నాను. ఆయన "అదేమిటయ్యా అవి పెద్దక్షరా లన్నావు, ఇవి చిన్నక్షరా లన్నావు. ఒప్పుకొన్నాను. గుర్తుపెట్టుకోటంలో వాటికీ వీటికీ ఏమీ సంబంధం లేకుండా ఉంటే ఎట్లా. బాబూ! నేను విష్ణుశర్మననీ స్వర్గా న్నుంచి వచ్చాననీ నేను పెద్దపండితుణ్ణనీ, నా కిన్నే ళ్ళున్నవనీ, ఇవన్నీ

మరచిపో. నీ కొడుక్కి చెపుతున్నా ననుకో. వాడికి చెప్పినట్లు చెప్పమన్నాను. నేను నీకు వాడికి చెప్పినట్లే చెపుతున్నా నయ్యా. నీవు వాడు నేర్చుకొన్నట్లు నేర్చుకోవా అన్నాను. అంటే ఆయన "ఈ అక్షరాలన్నీ రెండు రెండు రకాలుగా ఉంటవి. ప్రతి అక్షరమూ రెండు రకాలు. వాటి నట్లా గుర్తు పెట్టుకోవాలి, అని చెప్పవా" అన్నాడు. నేను అలాగే చెప్పాను. వాడు నోరుమూసుకు నేర్చుకొన్నాడు. ఈ పెద్దవాళ్ళకి చదువు చెప్పటంలో ఉన్న పేచీ ఇదే. మాటలు నేర్చిన గుర్రాని పాటకు తీసుక వెళితే — ఉట్లో అంటే ఉట్లో, అంటుంది. రెండు రకాలు గుర్తు పెట్టుకోనే అందుకు ఇంత పేచీ పెట్టావే. ఇక ముందు నీకు చదువు చెప్పగలం తెలుసుకుంటావా? అన్నాను. ఆయన అన్నాడు "అటు కానియ్యి, నా కేమున్నది? కాదంటే గుడిసె మీద బజాయించి చెప్తాను, మన తెలుగుదేశంలో ఉన్న పిల్ల లందరికీ ఈ బాధ ఎందుకు? ఒక్కొక్క అక్షరాలు రెండు విధాలుగా గుర్తు పెట్టట మెందుకయ్యా" అన్నాడు. నేను నీ కా గోల ఎందుకు, నువ్వేదో ఇక్కడ ఇంగ్లీషు నేర్చుకో. పోయి ఇంద్రుడికి చెప్పు. మా వాళ్ళు ఎట్లాగూ స్వర్గలోకానికి రా కొట్టు పంపిస్తారు. ఎప్పుడయినా నువ్వక్కడుంటే నే నింగ్లీషులో ఉత్తరం రాస్తాన నన్నాను. ఆయన ఆ చిన్నక్షరాలు కూడా గుర్తుపెట్టుకుంటూ కూర్చున్నాడు.

మరునాటి ప్రొద్దున లేవటం కాలకృత్యాలూ, స్కూలూ, నాగోలంతా నా కున్నదికదా? నేను సాయంత్రం ఏడున్నరకుగాని ఇంటికి రాను. ఆయన పిల్ల లందరికీ అన్నం పెట్టాడు. తిక్కన్నగారు కూడా తిన్నాడు. వెలుతు రుండగానే మా ఆవిడకి కూడా అన్నం పెట్టేశాడు. నేనూ భోంచేశాను. పిల్లలు నిద్దుర పోతున్నారు. నేను పగలల్లా ఆ దిక్కుమాలిన స్కూలులో నానా యాతనా పడి వచ్చి నాలుగు మెతుకులు నోట్లో వేసుకునే టప్పటికి ప్రాణం సొమ్మసిలిపోయి నిద్దుర వచ్చేదాకా ముసుకులుటూ ఉంటే ఈయన వచ్చి చదువు చెప్పమంటూ కూర్చున్నాడు. నే నేం చేయను. పాపం! నిన్నా ఇవ్వాళా కూడు ఉడకేసి పెట్టాడు. తర్వాత చెప్పాడు. మీరు నమ్మితే నమ్మండి, నమ్మక పోతే నమ్మకపోండి. సత్తి తోటకూర పప్పు చేసి వండాడు. దాని దుంపతెగ, అది స్వర్గానికి బెత్తె దూరంగా ఉంది. ప్రశస్తంగా రుచిగా ఉంది. పూర్వం బందరులో సత్రాపోలు చేసేవాళ్లు అప్పుడు ప్రతిరోజూ తోటకూరపప్పే ఆ తోటకూర పప్పుకోసం ఎక్కడి నల్లపూడి పట్టిస్తుళ్ళ నుంచి జనం వచ్చేవాళ్ళు. ఆ పాకంలో వద్దనుకోండి. ఆయన పూర్వజన్మ శతవిధాల వంటబ్రాహ్మణుడై యుంటాడు. ఆయన పెడితే తిని, ఇంత తృప్తిపొంది, తీరా చదువుచెప్పమని వస్తే కాదనటం బాగుంటుందా? సరే! లేచి కూర్చున్నాను. ఆ రెండూ బళ్ళా అచ్చువి, ప్రాసేబళ్లు రెండు ఉన్నవి. అవి వ్రాసి యిస్తాను. ఇవి గుర్తు పెట్టుకోనేవి.

కావు. గుర్తు పెట్టుకోవా లనుకోండి. అయినా వ్రాయటం అభ్యాసం చేసుకోవాలి. అని ఒక తెల్లకాగితం తీసుకొని ఆ పెద్ద అక్షరాలూ ఆ చిన్న అక్షరాలూ రెండుబళ్ళూ వ్రాసి వాటిని గుర్తుపెట్టుకో. ఈ పెన్సిలుతో పది పదకొండు సార్లు దిద్దితే వ్రాయటం చేత నవుతుంది. తరువాత చదువు మొదలు పెడతాను, అన్నాను. ఆయన " వ్రాయటం తరువాత చూద్దాములే. అక్షరాలు వచ్చినవి కదా. పుస్తకం చదువటం మొదలు . పెడతాను. అన్నాడు. నేను బాబూ. అదంత తేలికగాదు, మొట్టమొదట చాలా నేర్చుకోవాలి. అనేక మాటలు నేర్చుకోవాలి. ఆ మాటలు నేర్చుకొన్న తరువాత కాని చదవటానికి వీల్లేదు''. అన్నాను. ఆయన అదేమిటయ్యా చదువుతూ ఉండగానే మాటలు వాటంతట అవి వస్తవి కదా!'' అన్నాడు. నాకర్థం కాలేదు. ''ఎట్లా గేమిటి?'' అన్నాను ఆయన ''ఎట్లా గేమిటి?'' 'శ్రీయన గౌరినా బరగు చెల్వకు చిత్తము పల్లవింప' అని ఉన్నదనుకో. శ్రీ అనగా లక్ష్మి, అనన్—అనగా. గౌరి—పార్వతీదేవి. నాన్—అనగా పరగు చెల్వ—అనబడే స్త్రీ. ఇల్లా ఎక్కడి కక్కడికి రెండక్షరాలో మూడక్షరాలో నాలుగక్షరాలో అయిదక్షరాలో కలిసి ఒకమాట అవుతుంది గదా. అక్కడి కాపేది. ఆ మాట కర్థం చెప్పుకోనేది." అన్నాడు. నే నాలోచించాను. అక్షరాలు రావటం తోటే ఇల్లా చదవటానికి వీలవుతుందా' అని. ఎల్లా అవుతుంది. కాదే. ఏమాట కామాట నేర్చుకొంటే గాని టీఠికే చదువు కోవటాని కెట్లా వీలు. అక్కడ శ్రీ అని వ్రాసి ఉంటే పీడు శ్రీ అని చదువ వచ్చు, గౌరి అని వ్రాసి ఉంటే గౌరి అని చదువ వచ్చు. ఈ ఇంగ్లీషులో రెంపు పేచీలు ఉన్నవికదా. సరే అదంతా ఎందుకని అల్లా కాదు బాబూ, ఈ భాష లక్షణం వేరు. ముందర కొన్నిమాటలు నేర్చుకోవాలి. తరువాత కాని చదువటానికి వీలులేదు అన్నాను. ఆయన నిజమే, భాషలో ఉన్నటువంటి శబ్దాలు మొదట తెలిసిఉంటే చదవటం సులభ మౌతుంది. అందుకనే మనవాళ్లు అమరం, ఆంధ్రనామసంగ్రహం ముందర చెపుతారు అన్నాడు. నేను సరే నన్నాను. అని ఆయనకు మొదలు పెట్టాలి. నాపిల్లవాడి పుస్తకం తీసుకున్నాను. మొదట ఏ అన్న అక్షరం చూపించాను. ఇది ఒకమాటనుకో. దీని కర్థం ఒక — అని చెప్పాను. ఆయన చాలా సంతోషించాడు. చాలా గొప్ప భాషయ్యా ఈ ఇంగ్లీషు ఏ కాక్షర నిఘంటువుతో మొదలు పెట్టుతుంది. చాలా గొప్ప భాష అన్నమాట. అనేకశ్లేషలు చేయవచ్చు అన్నమాట అన్నాడు. నేను "బాబూ! అనవసరంగా తొందర పడకండి. ఏ కాక్షరాలు ఈ భాషలో రెండే ఉన్నవి. ఈ అక్షరం ఒకటి. ఐ అనే అక్షరం ఒకటి. ఐ అంటే నేను అని అర్థం. అని చెప్పాను. ఆయన సరే గుర్తు పెట్టుకుంటాను అన్నాడు నేను బాబూ! 'ఐ' ఉంది కదా, నేను అనే

అర్థంలో అది ఎప్పుడూ పెద్దక్షరమే వ్రాయాలి. వ్రాస్తేనే నేను అనే అర్థం వస్తుంది లేకపోతే నేను అని అర్థం రావాలంటే 'ఐ' పెద్దక్షరం వ్రాయాలి".. అన్నాను. ఆయన ఈ భాష నేను వ్రాయట మెందుకయ్యా. నాకేమైనా ఉద్యోగాలు కావాలా, సద్యోగాలు కావాలా? కావలిస్తే ఆ తిక్కన్నను వ్రాయమను. ఆయన తనశిష్యు ణ్ణైవణ్ణో వై తొలగమని ఆ ఉద్యోగంలో ఉందా మనుకొంటున్నాడు. కాస్త ఇంగ్లీషు నేర్చుకోకపోతే ఆ ఉద్యోగం చేయటం కష్టమేమో! ఆయన్ను పిలిచిరా వాకిట్లో పడుకొని నిద్ర పోతున్నట్టున్నాడు" అన్నాడు. నేను అదేమిటండీ యిప్పుడు చెపుతున్నారు. నిన్ననే ఆయనకి కూడా మొదలుపెడితే సరిపోయేది. ఇప్పుడు మళ్ళీ ఆయనకుకొక పాఠమూ, నీకొక పాఠమూనా? అన్నాను. అంటే విష్ణుశర్మ 'అదిగో నయ్యోయి, పిచ్చివాడా! నా పంచతంత్రం నువ్వు చదువుతే చదువు తావు లేకపోతే లేదు మహా చదివితే మీ చిన్నయసూరి నీతిచంద్రిక చదువుతావు కాని నా సంస్కృతపు పుస్తక మెందుకు చదువుతావు, కాని తిక్కన్న భారతం నీవు చదువక తప్పదు. ఆయన నీకు నాకంటె దగ్గరి వాడు, పైగా తృణమో పణమో వస్తే రేపు పొద్దున ఆయనవల్ల నీకు రావాలి కాని నావల్ల నీకేం వస్తుంది, మహావస్తే నేను స్వర్గంలోకి వెళ్ళిన తరువాత నిన్నుగురించి ఇంద్రుడికి సిఫారసు చేయమంటే చేస్తాను. పాపం ఆయన ఏదో ఉపన్యాసాలూ గిపన్యాసాలూ ఇస్తాడు. దాని మింజుమళై కొంతకీర్తి ఉంటుంది గదా, దాని బాపతు పుణ్యం ఉంటుంది నాలుగు రోజులు స్వర్గానికి తీసుకురా అని చెపుతాను' అన్నాడు, నే నన్నాను. బాబూ! అదంతా అక్కరలేదులే. నువ్వు ఉన్నన్ని నాళ్ళూ తోటకూర పప్పు ఇల్లా చేసి పెట్టు నాకది చాలు అన్నాను. ఆయన నవ్వాడు. నేను ఆయన బలవంతంవల్ల వాకిట్లో పడుకున్న తిక్కన్నగారి వద్దకు వెళ్ళాను. ఆయన ఇన్నాళ్ళూ మా ఇంట్లో ఉన్న ఒక నులకమంచం మీద పడుకునే వాడు. మా ఆవిడ బయట ఉండటం తోటే పసిపిల్లని పెట్టుకుని కింద పడుకుంటే ఏమైనా పాకుత పేమో నని ఆ మంచం ఆవిడ వేసుకు పడుకుంది. ఈయ నేంచేస్తాడు? అదృష్టం కొద్దీ ఆ రోజున వాన లేదు. వాన ఉంటే ఆ మెల్లాలో పడుకోవ టానికే వీలుండేది. కాని అల్లాగే క్రింద పడుకున్నాడు. నా సంసారం మొత్తం మీద ఒక్క చిరిచాప ఉంది. అది ఐదారేండ్ల క్రిందటిది. దాని పుడకలు మా వాడు లాగి చేయటానికి వీలైనన్ని లాగి వేశాడు. అది కుచేలుని వస్త్రం వలె ఉంది. ఈ గట్టు ప్రభువు అన్నట్లుగా 'శత సహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణోత్తరీయం' వంటిది. రోజూ తిక్కనగారే ముందర పడుకుంటాడు కనుక ఆయన ఈ చిరిచాపను కొట్టేస్తున్నాడు. విష్ణుశర్మ తనపై తుండుగుడ్డ వేసికొని తన చేయే తలగడగా పండుకుంటున్నాడు. ఇద్దరికీ చలివేస్తున్నదో

వేయటంలేదో నాకు తెలియదు. వాళ్లు మానవాకారాలు తాల్చి వచ్చినపుడు గాలి ఆకారాలుగా ఉన్నపుడు ఏ గుడ్డలు కట్టుకొన్నట్లు నాకు కనిపించిందో ఆ గుడ్డలే ఇప్పుడు కూడా కట్టుకున్నట్లు కనిపిస్తున్నది. ఇన్నాళ్లు గడిచింది. వీళ్లు స్నానాలు ఎట్లా చేస్తున్నారు. ఏం పెట్టి తుడుచుకుంటున్నారు. గుడ్డలు ఎట్లా ఎండవేసుకొంటున్నారు, కట్టుకున్న గుడ్డలు తడిపితే విడిగా ఏ బట్టలు కట్టుకొన్నారు, నాకీ ఆలోచనే పోలేదు. ఇట్లా ఆపెల్లాలో అచాపమీద పడుకొని నిదురపోతున్న ఆమహానుభావుడు, ఆ కవిబ్రహ్మ, ఆ మనుమసిద్ధి మంత్రిని చూస్తే నాకు జాలి వేసింది. వీళ్ళు రాక రాక దరిద్రుడికొంపకి నాకొంపకి ఎందుకు వచ్చారురా అనుకొన్నాను అని ఆయనని లేపాను. ఏమని పిలవాలో తెలియలేదు. తిక్కనగారూ, తిక్కనగారూ అనిపిలవనా? మాఆవిడ, ఈ తిక్కన్నను మామగారూ అంటున్నది. ఆ లెక్కన నేను బాబు గారూ అని పిలవవచ్చు. అయినా బాబూ బాబూ అని పిలిచాను. ఆయన ఎంత సేపటికీ లేవలేదు. నేను ముట్టుకోవచ్చునో ముట్టుకో కూడదో. తట్టి లేపితే ఆయన ఏమనుకుంటాడో. అంతవాణ్ణి తట్టి లేపవచ్చునా. మేము అస్పృశ్యతని ఎంత వదలి పెట్టుకున్నా గొప్పవాళ్ళు, కొద్దివాళ్ళు వీళ్ళమధ్య అస్పృశ్యతమాత్రం పోయేటట్టు లేదు. నేను వెళ్ళి ఆ మంత్రిని ముట్టుకుంటా ననుకోండి. ఆయన ఊరకుంటాడా. ఆయనని ముట్టుకోటానికి వీలెట్లాగు లేండి. ఆయన చుట్టూ ఎప్పుడూ పెద్దపెద్ద ఉద్యోగస్థులే ఉంటారు. రక్షకభటులు ఉంటూ ఉంటారు. ఆయనను తాకట మెట్లా? ఆయనతో మనము కలిసి నడవటానికి వీలైతే కదా! మన మాయనని తాకటానికి వీలు. ఒకవేళ ఆయనతో బరాబరిగా నడచా మనుకోండి. ఆయనతో బుజాలు బుజాలు రాచుకుంటూ తిరుగుతున్నా డంటారు. అది ఎవళ్ళో వాళ్ళ వాళ్ళ పాయా వాళ్ళతో వాళ్ళు వాళ్ళు చేయాలి తప్ప మనం చేయటానికి వీల్లేదు. ఈ అస్పృశ్యత మాత్రం ఎప్పుడూ తొలగదు. హరిజనుల విషయమైన అస్పృశ్యతమాత్రం తొలగవచ్చు. తొలగాలని మా ఉద్యమం. ఎవరైనా కాదంటే వాగ్బంధనం చేస్తాము. ఇప్పుడు నేను తిక్కన్నగారిని ముట్టుకోవచ్చునా ముట్టుకోకూడదా? తట్టి లేపవచ్చునా లేపకూడదా? ఆయన అస్పృశ్యుడా? నేను అస్పృశ్యుడనా? పేరుపెట్టి పిలిస్తే పుణ్యాసి కాదేమో! మనదేశంలో మనఇళ్ళల్లో చనవుగా తిరిగే పెద్దవాళ్ళని పేరుపెట్టి పిలవటం తప్పు, బొడ్డుకోసి పేరుపెట్టావా అంటారు. పరుస పిలుపే పిలవాలి. బాబుగారూ, బాబుగారూ అని ఎంతపిలిచినా పలకటం లేదు. బాబూ బాబూ అని కొన్నిసార్లు పిలిచాను. చివరకి ఈ గోలంతా ఎందుకని ఓ కవిబ్రహ్మ, ఓ ఉభయకవిమిత్రా, మేల్కొని ఉన్నారా? అన్నాను. ఆయన లేచి కూర్చొని మేల్కొనే ఉన్నాను అన్నాడు. ఇన్ని పిలుపులు పిలిస్తే పలుకలేమి

అన్నాను. ఆయన నీవు బాబూ, బాబుగారూ అంటూంటే నీ కొడుకుని ముద్దుగా పిలుచుకొంటున్నావేమో అనుకొన్నాను. అన్నాడు. నేను కాదు స్వామీ! తమరినే పిలుస్తున్నాను. విష్ణుశర్మగారు మీరుకూడా ఇంగ్లీషు చదువుకుంటే బాగుంటుందన్నాడు. ఆయనకు రెండు బళ్ళు వచ్చినవి. మీరు కూడా వచ్చి కలుసుకుంటే కలిసి చెపుతాను. తమరు రండి అన్నాను. ఆయన మాట్లాడలేదు. నేను మళ్ళీ చెప్పాను. "విష్ణుశర్మగారిట్లా అంటున్నాడు. రేపు ప్రొద్దున మీరు ఉద్యోగం చేయవలసిన అవసరం పడితే పట్టవచ్చు. కొంత కాకపోతే కొంతయినా ఇంగ్లీషు రావటం మంచిదంటున్నారు. తనకంటె మీకే అవసరం అంటున్నాడు. అన్నాను. తిక్కన్నకు విష్ణుశర్మమాట అంటే చాలా గురి. ఆయన పెద్ద నీతివేత్త. ముందు వెనుక లాలోచించి చెపుతాడని తిక్కన్న అభిప్రాయం. "సరే! విష్ణుశర్మ అంటుంటే వస్తాను" అన్నాను. వచ్చాడు. కూర్చొన్నాడు. నేనన్నాను. సరే! ఆయన్ని కూడా ఆ రెండు బళ్ళు గుర్తుపట్టనునండి. తరువాతకదా పాఠం అన్నాను. ఇద్దరికీ కలిసి చెప్పవచ్చు ననుకున్నాను. విష్ణుశర్మే తిక్కన్నకు చెప్పాడు. ఇవి అచ్చుఅక్షరాలండీ. ఇరవైయారు అక్షరాలు. అవి పెద్దక్షరాలు. ఇవిచిన్నక్షరాలూను. పెద్దా చిన్నా అంటే ఆకారంలో కాదు, పరిమాణంలో కాదు. ఊరికే అల్లా వ్రాస్తే పెద్దక్షరా లనుకోవాలి. ఇల్లా వ్రాస్తే చిన్నక్షరా లనుకోవాలి. అంతే నన్నాడు. ఏం చేస్తాడు పాపం! సవిబ్రహ్మ అయితే మాత్రం. అల్లా అనుకోవాలి కాబోలు. సరే నని అయిదారుసార్లు వాటివంక పరకాయించి చూశాడు. పర్యాలోచించాడు. క్రమంగా గుర్తుపడతాలే. ఇప్పుడేదో గొడ్డుగా కొంత ఉన్నది. పాఠం మొదలుపెట్టు, పాఠంమీదనే అక్షరాలు అలవాటవుతూ ఉంటవికదా! అన్నాడు. నాకు నిష్ఠుర వస్తున్నది. ఏమి చేయను? కాదనటానికి వీలులేదు. వాళ్ళిద్దరు అంటే నాకు చచ్చేటంత గౌరవ మున్నది. వాళ్ళకి నేనంటే ఏమీ లెక్క లేనట్టుగా ఉన్నది. వచ్చిన ఇబ్బంది ఇక్కడ ఉన్నది, ఇప్పుడు వీళ్ళిద్దరినీ వదిలిపెట్టటం నాకేమీ ఇష్టం లేదు. విష్ణుశర్మని పంపించటానికే వీలులేదు. ఇంక తిక్కన్న ఎట్లా పంపించటం. ఆయనవలన రావలసిన ఆదాయమంతా ముందరే ఉంటె. అందుచేత ఏ, బి, అన్న రెండక్షరాలను గురించి తిక్కన్నకు చెప్పాను. ఆయన సరే నన్నాడు. అని అన్నాడు కదా! 'బి' అంటే నేనుకదా! నీవు అంటే ఏమిటి అన్నాడు. నేను 'యూ' అన్నాను. వెంటనే విష్ణుశర్మ "అక్షరాలలో 'యూ' ఉన్నదే దానిని తీసి ఏకాక్షరాలని చెప్పి అంటున్నాం. ఇదొకటి ఉన్నదికదా! బి అంటే నేను. ఆ ఒక్క అక్షరం రాస్తే సరిపోతుంది. 'యూ' అంటే నీవు. ఈ 'యు' రాస్తే సరిపోతుంది కదా" అన్నాడు. నేను "అల్లా కాదు బాబూ, నీవు అనే అర్థం ఇచ్చేమాట వేరే ఉన్నది. దానిని ఇల్లా వ్రాయాల"ని వ్రాసి చూపించాను. ఆయన ఇది

"యూ" ఎల్లా అవుతుంది. ఇది వై, ఓ, యూ కదా అంటాడు. కాదయ్యా ఇదే యూ అంటాను. దీన్ని 'యూ' అనాలంటాను దీనికి నువ్వు అని అర్థం తప్ప వట్టి Uకి ఆఅర్థం లేదంటాను. ఆయన 'అబ్బాయి' అల్లా అగు, నీవు మూడక్షరాలు వ్రాసేవు, 'వై' ఒకటి. 'ఓ' ఒకటి. 'యు' ఒకటి. ఈచివరి అక్షరాన్ని ఎల్లా ఉచ్చరిస్తున్నామో మూడక్షరాలని కలిపి కూడా అలాగే ఉచ్చరిస్తున్నాము కదా! అప్పుడు మొదటి రెండక్షరాలూ వ్యర్థం కదా! నీవేదో మాకు సరిగ్గా చెప్పటం లేదు. ఏభాషైనా ఇంత అధ్వాన్నంగా ఉంటుందా దాని దుంపతెగ. ఆభాష గొప్పందటున్నావు. ఇల్లా ఉండదు మాకు మర్మం విడిచి చెప్పు నాయనా' అన్నాడు. ఈమడత పేచీ ఎట్లా? నేను వాళ్ళ నేదో అన్యాయం చేస్తున్నానని వాళ్ళనుకొం టున్నారు. బాబోయి! ఏమీ తెలియని పిల్లలమీద ఈభాష రుద్దవచ్చు. గాని ఇది తెలిసిన వాళ్ళకి చెప్పే భాష కాదురా అని తెలిసింది నాకు. నిజానికి చెపితే You యూ అని చదువుకు పోవటమే తప్ప మొదటి రెండక్షరాలు చచ్చినట్లుగా, చివరి ఒక్కక్షరాన్నే ఉచ్చరిస్తున్నామని నేనింతమట్టు కనుకోలేదు. ఇదిజ్ఞానమనుకోనా, అజ్ఞానమనుకోనా; సరే కానిమ్మని నేను వాళ్ళ ముందర 'బి. ఎ. డి' అని అక్షరాలు వ్రాసి పెట్టి చదవండి అన్నాను. ఇద్దరూ బి. ఎ. డి అని చదువుతారు తప్ప, చచ్చినా bad అనరు, నేను బాడ్ అవుతుందని చెప్పాను వాళ్ళు ఎల్లా అవుతుందంటారు? ఈమాటకు చెడ్డ అని అర్థ మన్నాను. ఒప్పుకున్నారు. దానికేమి? ఏదో ఒకభాషలో ఏవో కొన్ని అక్షరాలు కలసి ఒకమాట అవుతవి, దానికొక అర్థముంటుంది. కాని దీన్ని బ్యాడ్ అనమంటా వేమిటి" అన్నాడు మరి ఏమంటారు అంటే బిఎడి అంటా మన్నారు. నేనన్నాను. "బాబూ! అది వర్ణక్రమము. దాని పేరు ఇంగ్లీషులో స్పెలింగు అంటారు. ఈస్పెలింగులో చాలా తగాదాలు ఉన్నవి. తరువాత చెపుతాను. ముందర ఈసమూహక్షరాలను కలిపి 'బ్యాడ్' అనవలె. అది మీరు నేర్చుకోవలె' అన్నాను తిక్కన అన్నాడు "ఏమయ్యా! నాకు తెలుస్తున్నది. ఈ బి అన్నది బకారానికి గుర్తు అన్నమాట. డి అన్నది డకారానికి గుర్తు అన్నమాట. అంతేనా" అన్నాడు. నాప్రాణానికి తెరపిన పడ్డట్టయింది. అంతే. అంతే అన్నాను. విష్ణుశర్మ అంటే ఏవన్నీ హల్లులా? అన్నాడు. తిక్కన్న. A హల్లు కాదయ్యా. ఏ అంటే యకారంతో సంబంధం లేదు. వట్టి ఎకార మనుకుంటా నన్నాను. కాదు అది అకార మన్నాను. "అయితే బి. ఎ. డి 'బ్యాడ్' అంటావేం. బడ్ అనాలి" అన్నాడు. అది అకారమయితే దీర్ఘ అకార మేది? అన్నాడు. నేను అదే ప్రాణ్యాకారం. అదే దీర్ఘాకారం. అన్నాను. తిక్కన్న నోరుతెరచి చూస్తున్నాడు. విష్ణుశర్మ "కాదయ్యా! నీకు సరిగ్గా తెలిసి ఉండదు, వేరే దీర్ఘాకారమన్నా ఉండి ఉంటుంది. మొన్న ఏదో దేవు డన్నావుకదా, ఆమాట ఏమిటి 'గాడ్'

అన్నావు కదూ. దాని వర్ణక్రమం చెప్పు మన్నాడు. జీ, ఒ, డి, అని చెప్పాను విష్ణుశర్మ తిక్కన్న వైపు తిరిగి 'అదయ్యా! రహస్యం. అకారము హ్రస్వమైతే 'ఒ' దీర్ఘమైతే 'ం' వ్రాయాలి' అన్నాడు. నాకు ఒళ్ళంతా కంపర మెత్తి పోతోంది. వీళ్ళకి ఇంగ్లీషు చెప్పేది ఎట్లాగురా? ఇప్పుడు నాజాతకంలో ఏగ్రహం తిరుగుతున్నదో తెలియదు, ఇంత దుష్టగ్రహం నాజన్మలో ఇదివర కెప్పుడూ తిరగలేదు. అనుకొని 'బాబూ మీరు ఈఇంగ్లీషు చదువుకోవాలె నంటే మీకు వచ్చిన చదువు మరచిపోవాలె' అన్నాను. వాళ్ళు ఇద్దరూ లేచిపోయి పడుకున్నారు.



# ఏడవ అధ్యాయము

మళ్ళీ ఆదివారం వచ్చేవరకూ వాళ్ళబ్బపుణ్యమా అని నాజోలికి రాలేదు. కాని వాళ్ళిద్దరూ కూర్చుని ఏమిటో అప్పుడప్పుడు మాట్లాడుకోవటం జరుగుతూనే ఉంది. అది ఇంగ్లీషు అక్షరాలనుగురించే నని నాకు లీలగా అనిపిస్తున్నది. వాళ్లు అక్షరాలు గుర్తుపెట్టుకొంటున్నారు కాబోలు. ఒకరి నొకరు సంప్రదించుకొంటున్నారు. ఇద్దరు కలిసి చదువుకోవటంలో ఉండే లాభం ఇదేకదా అని అనుకొంటున్నాను. ఆదివారంనాడు భోజనమైన తరువాత ఇద్దరూ వచ్చి నాదగ్గర కూర్చున్నారు. "ఏమయ్యా! రాతక్షరాలు పెద్దవీ చిన్నవీకూడ నేర్పుతావా " అన్నారు. మొన్న రాత్రే వ్రాసి ఇచ్చాను కదా అన్నాను. "సరే అయితే అది అట్లా ఉంచు. మొన్న మాచేత బి.ఏ.డి. అని మూడు అక్షరాలు వ్రాయించి బ్యాడ్ అన మన్నావు. సరే బి. డి. ఈ రెండక్షరాలూ బకార డకారా లని మే మప్పుడే గ్రహించాము. ఇక మీ అక్షరాలన్నీ ఈ నాలుగు రోజులబట్టీ విచారించాము. నిన్ను కొన్ని అడగాలి చెపుతావా ?" అన్నారు. నాకే మభ్యంతరముంది అన్నాను. అంటే విష్ణుశర్మ అన్నాడు: " ఈ రెండక్షరాలనే. తీసుకుందాం. బి. డి. ఈ రెండక్షరాల మీద ఉన్న ఇకారము ఉచ్చారణా సౌలభ్యంకోసం ఏర్పరచారు అందాము. అట్లాగే హల్లులన్నీ చూచాము చూస్తే ఇల్లా ఇకారంతో ఉన్నవి ఏడక్షరాలే ఉన్నవి. జీ. బి సి. డి. పి. టి. వి. ఈ అక్షరాలు ఉచ్చారణా సౌలభ్యంకోసం ఇకారంతో చేర్చబడి ఉన్నవి. ఇంకా ఏడు హల్లు లున్నవి. వాటికి ఇకార మెందుకు చేర్చరాదు? అందులో రెంటినీ మరీ కేటాయించి ఎఫ్. ఎల్. ఎం. ఎన్. ఎస్. ఈ అయిదక్షరాలన్నీ ఎకారంతో మొదలు పెట్టాడు. హకారానికి ఎకారం బెట్టి చకారం తగిలించాడు. రకారం ఉన్నది. దానికి మొదట ఆ పెట్టాడు. దేనికి ఎందుకు పెడుతున్నాడో మాకు తెలియదు. అసలు ఈ అక్షరాలన్నీ ఈ వరసలో ఎందు కుండాలో మా కసలు తెలియలేదు. అచ్చులు తగినన్ని లేవు. కొన్ని అక్షరాలున్నవి. ఎందుకో తెలియదు. U ఉన్నది. అది యకారానికిగుర్తు. ఉకారసహితమైనయకారము. Y ఉన్నది. ఇది అనవసరము. ఎందుచేతనంటే 'వి' ఉన్నదికదా. వకారమునకు అది గుర్తు. వకారముమీద ఇకారము చేరిస్తే అది వి అయింది. మళ్ళీ వకారంమీద ఐకారం చేర్చిన ఇంకొక అక్షరమెందుకు? అనవసరము.

స్పృశించి కొన్ని కొన్ని అక్షరాలుగా బయటకు వస్తుంది. అనేటువంటి మహాతపస్సుచేసిన ఋషులు కనిపెట్టి నిర్మాణంచేసిన భాష సంస్కృతభాష. అందుచేత నాయనా అందులో ఇందాక మేము చెప్పిన అన్ని విషయాలూ ఉంటవి. ఇందులో ఏమీలేవు. ఇవి ఒక అక్షరాలగుంపు. ఇది వర్ణసమామ్నాయ మనటానికి వీలులేదు. మా కర్మం ఇట్లా కాలింది. అదంతా అట్లా ఉంచి ఇపుడు Q లో పడ్డాము. ఈ Q ఎందుకో చెప్పు. ఈ Q ఏమిటో చెప్పు" అన్నాడు. నేను "మీరు అసలు క్యూ పట్టుకున్నారే" అన్నాను. నేను ఈ Q యొక్క ప్రయోజనం దానియొక్క ప్రత్యేకత చెపుదామని ప్రయత్నించాను. నాకేమీ పాలుపోలేదు. Q దేనికిరా ? ఇది యేధ్వనిని చెపుతుంది. oblique అన్నమాట ఉన్నది, cheque అన్నమాట ఉన్నది. ఈ చివర మూడక్షరాలూ కలిసి పట్టి కకారం కింద మిగిలిపోతున్నవి. మరి Q ఎందుకు? అది చాలనట్లు ఆ చివరి రెండక్షరాలు అసలెందుకు ? Quarter, Quadruped, ఇల్లాంటి మాటల్లో మాత్రం Q ఏంచేస్తున్నది ? C సరిపోదుగుందే. K సరిపోతుందే. ఎందుకీ అక్షరం. ఆ నాకు తెలిసింది. ఇది వ్రాయటానికి అందంగా ఉంటుంది. సరిగ్గా క్రికెట్టుబ్యాటు ఒక తోలుసంచిలో పెట్టి నట్లుంటుంది. అదీ దాని గొప్పదనం. అమ్మయ్యో దాన్ని పటిపెట్టటం చేసి అని నేననుకొంటూ ఉండగా విష్ణుశర్మ "బాబూ బి. ఏ. డి. బ్యాడ్ సరే, ఇట్లాగే కొద్దిలో చిన్న మాట ఇంకొకటి చెప్పమన్నాడు. నేను సి. ఏ. టి. క్యాట్ అని చెప్పాను. ఆయన వెంటనే సి. ఏ. టి. క్యాట్ ఏమిటి నీ సెత్తికాయను అన్నాడు. నేను అదేమిటయ్యా అట్లా అంటావు అన్నాను. ఆయన "ఇటుసరిగా చూచానయ్యా నేనీ అక్షరాన్ని. ఎస్ ఉండగా ఇది అనవసరం. ఒకవేళ ఎస్. కుంటి 'స' అయితే ఈ సి. మెలిక 'శ' అవుతుంది. పోనీలే అనుకున్నాను. ఇప్పుడు నీవు దీన్ని 'క' గా ఉచ్చరిస్తున్నావు. చకారంగా అన్నా అయితే ఊరకుందును. ఎందుకంటే ఈ అక్షరాల్లో చకారానికి వేరే గతిలేదు. అందుచేత ఈ 'సి' పనికి వస్తుం దనుకొన్నాను. దీనిచేత ఒకవేళ ఎస్. మీదికి దండెత్తిస్తావేమో అనుకుంటే అదే మిదేమని 'క' మీదికే దండెత్తించావు అన్నాడు. నే నేం చేయను. ఇదేమిటిరా బాబూ ! నా గురుత్వం ఇల్లా తగలడుతున్నది. అని బాబూ మీ రిద్దరూ గొప్పవాళ్ళు. మీ రెంచేశారంటే ఈ ఇంగ్లీషు అక్షరాలని హూనం హూనం చేశారు. రోట్లో పడేసి పచ్చడిగా తొక్కారు. ఇంతపని ఎవ్వడూ చేసి ఉండడు అన్నాను. విష్ణుశర్మ అన్నాడు "పచ్చడి రోజూ మీ ఇంట్లో చేస్తున్నాను కదటయ్యా ! నేను చేసిన పచ్చళ్ళేమో కమ్మగా ఒట్టిగా ఉన్నాయని తింటున్నావు. ఈ ఇంగ్లీషు అక్షరాలను పచ్చడి చేస్తే నీకేమి బాగా లేదు" అన్నాడు. అని నరేకాని బాబూ ! ఎస్ ఉన్నదనుకో దాన్ని శ, ష స మూడుగా ఉచ్చరించాలికదా ! సందర్భాలని బట్టైనా ఇంకేమన్నా

గ్రుడ్డి అంటే ఇంగ్లీషు మాటేమిటి చెప్పు మన్నాడు. నేను బ్లైండ్ న్నాను. స్పెల్లింగు చెప్పమన్నాను. దక్కిస్తూ చెప్పాను, అంతటితో ఆయన ఇక్కడ 'ఐ' అనే అక్షరం పూర్తిగా ఐ అయి ఊరుకుంది. ఐత్వానికి కావలసినంత ప్రాణం ఆ అక్షరంలో లేదయ్యా చిన్న అక్షరమాయె. దాన్ని 'ఐ' అనట మెట్లాగా. ఊరకే అక్షరాలతో చదివేటప్పుడు అంటామనుకో. నేనింకా ఈ అక్షరం ఇకారానికి గుర్తు అనుకుంటున్నాను. అది ఐ అయితే ఇకార మేమిటి? అన్నాడు నేను 'అదేను' అన్నాను. ఆయన "ఆదేనా, అదేనా" అని నివ్వెర పోయినాడు. పోయి ఏదీ అది ఇకారంగా ఉండే మాట ఒకటి చెప్పు అన్నాడు. నేను 'విండ్' అని చెప్పాను. ఆయన ఇక్కడ ఇకార మేకదా'' నమ్మక మేకదా. మళ్ళీ మారుతుం దంటే నేనొప్పుకోను సుమా!" అని నాతో చమత్కారం చేశాడు. సరిగ్గా ఆయన చమత్కారం అస్థానపతిత మైంది. నేను వెంటనే చెప్పాను, మీకాశ్చర్య మక్కర లేదు. మహాప్రభూ!అది నామవాచక మై 'గాలి అనే అర్థ మైతేనే విండ్ గాని, అదిక్రియ అయి 'త్రిప్పుట' అనే అర్థమైతే అది. 'వైండ్' అవుతుంది. అన్నాను. ఈ దెబ్బకి మాత్రం వాళ్ళిద్దరూ తట్టుకో లేక పోయినారు. లేచి పోయినారు. రక్షించారురా బాబూ అనుకున్నాను. అప్ప టికే ప్రొద్దు క్రుంకవచ్చింది. ఇదేం మజా. ఊరికే వాగ్రిస్తుంటే చదివేవాళ్ళకి సులభంగా ఉందేమో తప్ప అందులో ఉన్న కష్టం వాళ్ళ కెదురుగుండా కూర్చుండి ఈబాధ పడేవాళ్ళకి తెలుస్తుంది. ఈ పూటకి ఈబాధ వదిలిందిరా అని నేను ఎక్కడికైనా షికారు పోయి కొంచెం పొద్దుపోయి వద్దాము. రాత్రికి మళ్ళీ చదువు చెప్పమంటే బాబూ ! పగలల్లా శ్రమపడి ఉన్నాను!. పొద్దుపోయింది. ఇవ్వాళటికి క్షమించండి అందాము అనుకొని వెళ్ళాను వీళ్ళరోగం ఇట్లాకాదు కుదిర్చేది అని ఒకసినిమాకి వెళ్ళాను. ఇటువంటి ఆప త్సమయాలల్లో వెళ్ళాలంటే చెపుతున్నాను. ఇదొక హితోపదేశం. తెలుగుసిని మాలకి వెళ్ళండి. ఎందుకంటే ఇంగ్లీషుసినిమాకి వెళ్ళావా వాడు తొమ్మిదింటి కల్లా వదలి పెట్టేస్తాడు. ఆ ఇంగ్లీషుసినిమా బొమ్మలు మాఅబ్బాయి వేలంత ఉంటవి. ఇంటర్వెల్ వరకూ బొమ్మే ఉండదు. హిందీ సినిమాలకు వెళ్లావా వాడు పదీ పదిన్నరకు వదలి పెట్టేస్తాడు. కనుక ఇట్లాంటి ఆపత్సమయాలలో తెలుగుసినిమాకి వెళ్ళాలి. వాడు పదకొండునన్నరకు గాని వదలి పెట్టడు. అక్కడి నుంచి నువ్వు నడచి ఇంటికి వచ్చేటప్పటికి పన్నెండు దాటుతుంది. నీవు వస్తావుకదా అని మీవాళ్ళు తలుపులు వేయరు. ఈ లోపుగా ఏ దొంగ దూరినా దూరవచ్చు ననుకోండి. ప్రస్తుతం మాయింటికా భయంలేదు. వాళ్ళి ద్దరూ మాయింటికి వచ్చినప్పటినుంచీ చెపితే నమ్మండి మాఇంటి చుట్టుపట్ల కాకి ఆడటం లేదు. ఒకడురోహిలా వలె కూర్చుంటాడు. ఇంకొకడు సిద్దీబిలాల్

కలు ఏరారే అన్నాను. ఆవిడ ఏసినిమాకి వెళ్ళారంది. నాగుండెలో రాయిపడ్డది. చచ్చాంరా బాబూ! వాడెవడో సూదికోసం నోదెకు పోయినాడట! అల్లా ఉంది. తనను తీసుక వెళ్ళకుండా నేను వెళ్ళా నంటుంది. ఈవిడని తీసుక వెళితే పిల్లలని తీసుక వెళ్ళాలి. రాత్రి పదిఅణాలు పెట్టటమే తప్పని సరికి పెట్టాను. వీళ్ళను తీసుక వెళ్ళితే వట్టి టిక్కట్టు కాదాయె. రానూ పోనూ గుఱ్ఱపు బళ్ళా లేకపోతే రిజాలూ. ఈ రిజాల వాళ్ళతో, గుఱ్ఱపు బళ్ళవాళ్ళతో చచ్చి పోతున్నాను. రైలుమీద ఏవూరో వెళ్ళాలనుకోండి. ఆ వూరికి వెళ్ళే అందుకు రైలు టిక్కట్టు పదిఅణాలు. రైలుకు వెళ్ళేందుకు రిజావాడికి పదిఅణాలు. ఇది యేమి న్యాయమో నాకు తెలియలేదు. ఆ గోల ఎందుకు? నేను మా ఆవిడతో పోనీవే నిన్ను బతిమాలుతున్నాను. ఏదో సినిమాకి వెళ్ళాను. బుద్ధి గడ్డి తిని వెళ్ళాను. వాళ్ళబాధ తప్పించుకొనే అందుకు వెళ్ళాను. నిన్ను తీసుక వెళ్ళటం ఇష్టంలేక కాదు. పైగా ఇప్పుడు నిన్నూ పిల్లలనీ తీసుక వెళతా ననుకో. వాళ్ళిద్దరూ దంపనాగళ్ళల్లే ఉన్నా నిజానికి వాళ్ళూ పిల్లలే. అందులో మీ బాబుగారున్నాడే ఆయన్ని సినిమాకి తీసుక వెళ్ళితే అయనకి ఒక్క టికట్ ఒప్పుకొంటారో ఒప్పుకోరో. ఇంతడబ్బు ఇప్పుడు నా దగ్గరలేదు. ఒకటో తారీకున జీతం వస్తుంది. అప్పుడు తప్పకుండా తీసుక వెళతాను. అని ఒట్లూ సత్యాలూ పెట్టుకొని ఆవిడని ఒప్పింప జేసేటప్పటికి నా తలప్రాణం తోకకు వచ్చింది. కాని ఆవిడ వెంటనే ఇంట్లో బియ్యం మైపోయిన వన్నది. నేయి లేదన్నది. నిజమే రాత్రి చూచాను. నేయిలేదు. పప్పులు లేవంది. ఏమి చేయాలి! ఇదివరకు నెల మొత్తంమీద ఒక్కసారే తెచ్చేవాణ్ణి. నెలాఖరుదాకా వచ్చేవి. ఈ నెలలో ఈవిడ ఆరురోజులో ఏడు రోజులో లేదు. నిజంపడితే మిగలాలి. కాని వీళ్ళిద్దరూ వచ్చి ఇంట్లో కూర్చున్నారు కదూ. ఇవ్వాళ ఇరవైమూడో తారీకు. ఐపోయింది. ఏంచెయ్యాలి? వాళ్ళు తొమ్మిదింటికో తొమ్మిదిన్నరకో వచ్చేస్తారు. పిల్లలికైతే చద్దిఅన్నాలు పెట్టింది. సరే ఈపూట ఎక్కడో అక్కడ అప్పు తీసుకో అన్నాను. సాయంత్రం తెస్తానన్నాను. ఆ ఇంగ్లీషుభాష యెంత మంచిదంటే ఇంత మంచిదనటానికి వీలులేనంత మంచిది. ఎందుచేత నంటే ఆ భాషలో ఉన్న ఒకసూక్తి నాకు జ్ఞాపకం వచ్చింది. 'Necessity is the mother of invention" మనం ఒక మహావిషయాన్ని కనిపెట్టటానికి కనిపెట్టక తప్పక పోవడం తల్లివంటిది అని అనుకొంటాను దీనిఅర్థం. ఇంకా సులభంగా ఎవరన్నా ఆంధ్రీకరిస్తారేమో నాకు తెలియదు. అదట్లాఉంచి ఇవ్వాళ సాయంకాలం డబ్బుకావాలి. ఎల్లాగ? మా స్కూల్లో మొట్టమొదట శిక్కన్నగారి ఉపన్యాసం పెట్టిద్దా మనుకొన్నాను. స్కూలుకి వెళ్ళాను. మధ్యాహ్నపు పూట విశ్రాంతి కాలంలో మా ఉపాధ్యాయుల్లో తెలుగు ఉపాధ్యాయులని, తెలుగు అంటే అభిమానం కలవాళ్ళని పోగుచేసి ఇల్లా ఉపన్యసించాను. "మీ అందరికీ

మా ఇంట్లో ఇద్దరు బ్రాహ్మణులు పదిహేను ఇరవై రోజులబట్టి ఉంటున్నారని తెలుసు ననుకొంటాను. ఇది దేవరహస్యం. ఈ కాలంలో ఎవ్వళ్ళూ నమ్మరు. కాని యథార్థం చెపుతున్నాను. మీరచ్చంగా ఇంగ్లీషు నాగరిక బుద్ధులైతే నేను చెప్పేవాణ్ణి కాదు. కొంత తెలుగు మేష్టర్లు కదా! తెలుగుభాష అంటే అభిమానం కలవాళ్ళు కదా! అని చెపుతున్నాను. అందులో కొంచెం ఎఱ్ఱగా పొడుగ్గా ఉన్నాడే ముఖం చూస్తే కొట్ట వచ్చినట్టుంది. కళ్ళు ఎంతో దీప్తిగా ఉంటవి. ఆయనే తిక్కన్న" అన్నాను. అందులో ఒకాయన వాళ్ళింటి పేర న్నాడు నేనుఇంటిపేరు కాదయ్యా. భారతం వ్రాసినది ఆయనే. ఆయన మా ఇంటికి వచ్చాడు. నేను ఎలా ఆయన్ని గురించి మీతో చెప్పాలో తెలియక ఊర కున్నాను. దైవాద్యా శాపగ్రస్తులైన వాళ్ళిద్దరూ భూలోకానికి వచ్చారు. ఆ రెండవ ఆయన సంస్కృతంలోని పంచతంత్రం వ్రాశాడే ఆ విష్ణుశర్మ. మీరు నమ్మితే నమ్మండి. నమ్మలేకపోతే మానుకోండి. వాళ్ళిద్దరూ పండితులు కదా! ఎవరైనా పండితులు వస్తే మనస్కూళ్ళో సభ చేయించి వారి ఉపన్యాసాలు మనం విన వచ్చుకదా! స్కూలు పిల్లల [illegible] ఉంటుంది. అందులో కొంత వాళ్ళకి ఇప్పిస్తే వాళ్ళు బతుకుతూ ఉంటారు" అన్నాను. కొందరు ఉత్సాహం చూపిం చారు. కొందరు [illegible]. ఇల్లాకాదని నేను చందాలు వేయించాను. ముప్ఫై రూపాయలు చందాపడ్డది. ప్రిన్సిపాలు దగ్గరకు వెళ్ళి చెప్పాను. నా అదృష్టం కొద్దీ ఆయన థియాసఫీ మనిషి. తిక్కన వచ్చాడంటే ఎందుకు రాకూడదన్నాడు. [illegible] కావలసిన దేమున్నది? కాలేజీ ఫండులోంచి ముప్పై రూపాయలు ఇస్తా నన్నాడు. [illegible] బాబూ! ఈ నెల ఖర్చంతా ఒక్క మీటింగుతో ఇప్పిస్తున్నావే తిక్కన్న. అదిరా తిక్కన్నంటే. ఏదీ! ఇప్పుడు [illegible] ఉన్నారు. ఒక్కడి పేరుచెప్పి [illegible], పదిహేను రూపాయలు సంపాదించను. నాకు తెలిసిపోయింది. మనరొట్టె నేతిలో పడ్డదిరా అని. ఇంత తిక్కన్న పేరుతో సంపాదించానే. తరువాత సంపాదన అట్లా ఉంచు. సాయంత్రం పేలు, బియ్యం తప్పకుండా తీసుకరావచ్చు. సరే కానిమ్మన్నాను. ఇంటికి వచ్చాను. తిక్కన్నగారితో చెప్పాను. అయ్యా! తమరి మీటింగు స్కూల్లో ఏర్పాటు చేశాను. సాయంత్రం నాలుగు న్నరకల్లా మా తెలుగు భాషాసమితి కార్యదర్శి మీకోసం వస్తాడు. అతనితో స్కూలుకు రండి. అన్నాను. విష్ణుశర్మ నేను రావద్దా అన్నాడు. "మీరూ రండి బాబూ! మీరూ మాట్లాడుదురుగాని అన్నాను. విష్ణుశర్మ నన్ను దేనినిగురించి మాట్లాడ మంటావు. మీ ఇంగ్లీషు అక్షరాలనుగురించి మాట్లాడతాను. "ఇంతకంటె అపభ్రంశపు వర్ణమాల సృష్టిలో ఉండదని చెపుతాను. నీ కిష్టమేనా" అన్నాడు. "ఓయి బాబోయి! ఆపనిమాత్రం చేయకు. మా ప్రిన్సిపాలు థియాసఫిస్టు. అందుకని మీరు స్వర్గలోకంలోనుంచి వచ్చారంటే ఒప్పు

కొన్నాడు. వాళ్ళ కింగ్లీషు మాతృభాషకంటె గొప్పది. నీవుగనుక ఇంగ్లీషుని తిట్టటం మొదలుపెట్టావా మన కివ్వాళ వచ్చే డబ్బు పోగా వీళ్ళ నెక్కడినుంచి తెచ్చావని నామీద విరుచుకపడతాడు. నా ఉద్యోగానికి కూడా దెబ్బ తగుల వచ్చు. కనుక బాబూ! బాబూ!. ఆ పనిమాత్రం చేయకు. కావలిస్తే పిల్లలకి ఏమైనా కథలు చెప్పు" అన్నాను. సరే నన్నాడు. సాయంత్రం నాలుగున్నరైంది. మా కార్యదర్శి, వెళ్ళాడు. వాళ్ళిద్దరినీ చెరో రిక్షాలో ఎక్కించి తీసుకవచ్చాడు. ఇద్దరివీ పండుచెంగావి బట్టలు. కోట్లులేవు సరే, చొక్కాలైనా లేవు. బుజాలని తుండు గుడ్డలు వేసుకొని పొడుము అమ్మే బ్రాహ్మలకి మల్లే చక్కా వచ్చారు. ఆ శివాలయం దగ్గర నిలుచుంటారు కొందరు. వాళ్ళకి మల్లే వచ్చారు. నా తెలివి ఏమిటంటే వాళ్ళు కాలేజీలో అడుగుపెట్టేవరకూ వాళ్ళ రూపధేయ విశేషాలు తోచలేదు. తోస్తే నా వేవైనా పాతచొక్కాలు ఉన్నయ్యేమో తొడిగించి రమ్మనేవాణ్ణి. ఇప్పుడు తోచింది. ఈ వచ్చే ఎన్నభై రూపాయల్లో బియ్యమూ, నేయిమాటా అట్లా ఉంచి ముందర వీళ్ళిద్దరికీ రెండు రెండు ధోవతులూ రెండు రెండు చొక్కాలూ, రెండు రెండు ఉత్తరీయాలూ కొని పెట్టక తప్పదు" అని. వీళ్ళకి అవి కొనిపెడితే ఇంక నేను బియ్యం ఏడబ్బుతో తీసుకరాను. ఇదేమిరా ప్రభూ అనుకున్నాను. కానీ. వాళ్ళిద్దరూ వచ్చి మాస్కూల్లో హాల్లో కుర్చీలమీద కూర్చున్నారు. విద్యార్థులు క్రిక్కిరిసి వచ్చారు. మా స్కూల్లో మీటింగు జరిగితే ఎవ్వడూ రాడు. ఎవరో మంత్రులు వస్తే వస్తారు తప్ప. ఈ సారస్వతోపన్యాసాలకి పార్టు వి తెలుగు విద్యార్థులు నలుగురు వస్తారు. ఆ తెలుగు మాష్టర్లము నలుగురమూ ఉంటాము. అట్లాంటిది ఇవ్వాళ సభకు రానివాడు లేడు ఏమిరా బాబూ! వీళ్ళిద్దరూ స్వర్గాన్నించి వచ్చారని తెలిసింది కాబోలు అనుకున్నాను. ఇదీ బాగానే ఉన్నదనుకున్నాను, కాని వాళ్ళిద్దరూ వచ్చి కూర్చునేటప్పటికి ఈ వెధవమూక ఓహో అరవటం మొదలు పెట్టారు. ఇందులో కొందరాడపిల్లలు. ఘోరంగా ఉంది. ఎవ్వరు మాట్లాడినా వారూరుకోరు. ఇంక మీటిం గేమున్నది. మా ప్రిన్సిపాలే అధ్యక్షుగా కూర్చున్నాడు. ఆయన లేచి తన థియాసఫీ ఉపన్యాసం మొదలు పెట్టాడు. ఆయన దొక ఇంగ్లీషుభాష. పాత ఉసిరికాయపచ్చడి ఇంగ్లీషుభాష అని ఒకటున్నది. ఆయ నాభాషలో మాట్లాడుతూ ఉంటాడు. ఆయన ఆ ఇంగ్లీషులో మాట్లాడు తున్నంతసేపు ఆయన మొఖంలో నాకేదో లోపం కనిపిస్తూ ఉంటుంది. ఏమిటిరా ఆ లోపం అని విచారించాను. ఇదివర కెప్పుడూ తోచలేదు. ఇవ్వాళ తోచింది. ఆయన నెత్తిమీద అదొక మోస్తరు తలగుడ్డ పెడితే ఆ లోపం తీరుతుం దనిపించింది. ఆ తలగుడ్డ పెట్టడానికి వీలులేదు.. ఈయన థియాసఫీ వాడుగా పాపం. ఆయన ఏదో ఏదో త్రవ్వాడు. ఏమిటో

చెప్పాడు. Astral bodies అన్నాడు. Esoteric అన్నాడు. ప్రక్కన ఉన్న మాకే తెలుస్తోంది తప్ప ఎవ్వరికీ కనీసం ఒక్కమాట వినిపిస్తే ఒట్టు. ఇప్పుడు తిక్కన్నగారు మాట్లాడతాడు అన్నారు. తిక్కన్నగారు లేచి నిలుచున్నాడు. జనమందరూ నిశ్శబ్దంగా చూస్తున్నారు. ఆయన "సింగం బాకటితో గుహాంతరమునడా' అన్న పద్యం చదివాడు. నెల్లూరివాళ్ళు పద్యాలు ఒళ్ళూరివాళ్ళంత సాగదీయక పోయినా రాగయుక్తంగా మాత్రం చేస్తారు, ఆయన కంఠంలో ఆ సాగదీయటం లేకపోయినా ఏదో ఒక మాధుర్యం ఉన్నది. నిజమే. ఆ కాలం ఇంత నాగరికం కాదుగా. ఒక ఠీవి ఉన్నది.

పద్యంమాత్రం శ్రావ్యంగానే ఉన్నది. వినటానికి సొంపుగానే ఉన్నది. ఒక విలక్షణంగా ఉన్నది. ఆయన గొంతు సుస్పష్ట గంభీర స్వరంగా ఉన్నది. కాని వచ్చిన ఇబ్బంది ఏమిటంటే మా పిల్లలకు సినిమా వాళ్ళ సంగీతం తప్ప ఇంకొకటి గిట్టనే గిట్టదు. వాళ్ళ కెవ్వరో ఉంటారు. వాడు నారదుడుగా మొదలైన వేషాలు వేస్తూ ఉంటాడు. పద్యాలు పాడటమన్నా సరే వాళ్ళు మెచ్చుకుంటారు తప్ప తిక్కన్న కాదు సరికదా తిక్కన్న అమ్మా మొగుడు వచ్చి చదివినాసరే వాళ్ళు చేసేది చేయటమే. ఏమిటా చేసేది అంటారు. మాట్లాడేవాడిని మాట్లాడనివ్వరు. తిక్కన్నగారి చివరకి అల్లా వచ్చింది. నేను లేచి వాళ్ళని కోప్పడదామనుకున్నాను. "[illegible]" అన్నాడు. ప్రిన్సిపాలుగారు దిక్కులేదు. మా ప్రాచ్యభాషాశాఖాధిపతికి దిక్కులేదు. అసలు ఆయన పేరెత్తటమే తప్పనుకోండి. నాకు తెలిసినంతమట్టుకు ఆయన క్లాసు ఎప్పుడూ క్లాసు కాదు. ఆయన క్లాసు ఎట్లా ఉంటుందో మీకు తెలియాలంటే దాన్ని మీరు ఊహించుకోవాలి అందుకు నేనొక విషయం చెపుతాను వినండి. అమావాస్య రాత్రి. ఇంట్లో ఎవ్వరూ లేరు. నీవొక్కడవే మంచం వేసుకు పడుకున్నావు. అటుగా మీద రెండు పిల్లులు చేరినవి. ఒకటి మగపిల్లి, ఒకటి ఆడపిల్లి. తెలుసుగా మీకు. అల్లా ఉంటుంది ఆయన క్లాసు. కాని ఆయన మా శాఖాధ్యక్షుడు. ఆ పిల్లలు ఆయనని ఏమన్నా ఊరుకుంటాడు తప్ప మేమేమైనా అంటే మామీద చిటామటా వ్రాసేస్తాడు. ఇంక ఆయనకే దిక్కులేకపోతే నేను లేచి అల్లరి చేయకండిరా అంటే వాళ్ళు నన్ను మాట్లాడనిస్తారా ? వాళ్ళ అరుపులతో నన్ను ఆకాశానికి లేవనెత్తేస్తారు. పాపం తిక్కన్నగారు రెండు మూడుసార్లు ఏదో చెప్పటానికి ప్రయత్నించారు కాని వాళ్ళు వినలేదు. ఆయన కూర్చున్నాడు. అప్పుడు విష్ణుశర్మ లేచాడు. ఆయనయొక్క ఆ శల్యాకారాన్ని చూచి వాళ్ళు దుంపలుతెగ వాళ్ళు రకరకాలుగా అరవటాలు మొదలుపెట్టారు. ఈ స్కూళ్ళలో చదువుకొనే వాళ్ళున్నారే వాళ్ళకి చదువును మినహాయిస్తే బ్రహ్మాండమైన తెలివితేటలుంటవి. అందులో ఒకడు సరిగ్గా అడవిలో ఎలుగుగొడ్డు దగ్గుతుంది అల్లా

దగ్గటం మొదలుపెట్టాడు. నిజానికి ఎలుగుగొడ్డు అల్లా దగ్గుతుందని ఎంత మందికి తెలుసు? అడవి నెక్కలం ఆ ప్రాంతాల ఉండే పిల్లలిద్దరు ముగ్గురికి మాత్రమే తెలుసు. కాని అదేమి జ్ఞానమోకాని అయిదు నిముషాలల్లో ఎలుగు గొడ్డు అల్లా దగ్గుతుందని అందరికీ తెలిసిపోయిం దండీ. తెలిసిపోవటమే కాదు. వాడేకాదు ఇంకా అయిదారుగు రట్లా దగ్గటం మొదలు పెట్టారు. ఎట్లా దగ్గారు? వాళ్ల తెలివితేట లేమిటి అసలు? పిల్లదుంపలు తెగ! వీళ్ళు అడవిలోనుంచి ఎకాయెకి ఈ స్కూళ్ళలోనికి వచ్చారా ఏమిటి? ఇంతలో ఒక ఆశ్చర్యం జరిగింది, విష్ణుశర్మకూడా సరిగా ఎలుగుగొడ్డల్లేదగ్గాడు. వాళ్ళందరూ నివ్వెరపోయి చూస్తున్నారు. ఆయన ఒక్క రెండులిప్తలాగి ఇలా అన్నాడు: "ఎలుగు గొడ్డువలె దగ్గటమే కాదోయి, పెద్దపులి వలె గర్జిస్తా" నన్నాడు. అని పెద్దపులివలె గర్జించాడు. స్కూలుపిల్లల మొగాలు ఎక్కడి వక్కడ మాడి పోయినవి. ఆయన ఇంకా ఇలా అన్నాడు. నేను నీతి చంద్రిక వ్రాశాను. నా నీతిచంద్రికలో అన్ని జంతువులూ మాట్లాడుతవి. నాకు వాటి అన్నింటి భాషలూ వచ్చు అనగా వాటికీ మల్లే కూస్తా నన్నమాట. ఆకూతలలోని అర్థాలు నాకు తెలుసు నన్నమాట. ఆ అడవిలో ఆ మృగాలన్నీ కూస్తూ ఉంటే వాళ్ళ కూతలలో ఉన్న భావాలన్నీ గ్రహించి నేను నీతిచంద్రిక వ్రాశాను. అందుచేత వాటి కూతలన్నీ నాకు తెలుసు. వాటికి మల్లే నేను కూయ గలుగుదును'' అని ఇంకా పదిజంతువుల కూతలు కూశాడు. నా కాశ్చర్యం వేసింది. సభంతా నిశ్శబ్దంగా ఉంది, నేను వెంటనే ఏమి చేశాను, కాగితం పుచ్చుకొని చందాలకి బయలుదేరాను. నమ్మండి మహాప్రభూ! మా కాలేజిలో పదహారువందల మంది విద్యార్థు లున్నారు. కొందరు బాగా డబ్బుగలవాళ్ళ పిల్ల లున్నారు. ఎంత వసూలైం దనుకుం టున్నారు అదేమిటి లెండి. పురాణమైన తరువాత మంగళహారతి పళ్ళెమల్లే పట్టాగా. తొమ్మిదివందల యాభైతొమ్మిదిరూపాయల పదణాల నాలుగు పైసలు వసూలయింది. మా ప్రిన్సిపాలు యాభైరూపాయ లిచ్చాడు. మా మాస్టర్లు నెలాఖరుకి గానీ ఏడవరు. ఇంటికి తిరిగి వచ్చాను. స్కూపిల్లల కెట్లా తెలిసిందో. ఇంటికి వచ్చేటప్పటికి వాళ్ళు విష్ణుశర్మకీ జై, అని అరుస్తూ ఎదురు గుండా వచ్చారు.

కూడదు అని చెప్పాను. వాళ్లు సరే నన్నారు. మరిన్ని ఇంకొక్క విషయం చెప్ప వలసి వచ్చింది. అయ్యా! మనం ఏదైనా సభలకు పోయేటప్పుడు మీరు ముఖక్షౌరం చేసుకోవాలి. లేకపోతే బాగుండదు. ఈ కాలంలో ముఖక్షౌరం చేసుకోనివాడు మనుషుడే కాడు. వాడు పట్టి పల్లెటూరి రైతు. వాణ్ణి హిందీలో గఁవార్ అంటారు. ఇంగ్లీషులో 'బూర్' అంటారు. దీనికి మాత్రం మీరు తప్పకుండా అంగీకరించాలి అన్నాను. విష్ణుశర్మ అటూఇటూ చూచాడు. తిక్కన్నగారు మాట్లాడలేదు. ఆయన ఎట్లాగైనా రాజుల ఆస్థానాలలో మంత్రిగా ఉన్నవాడాయెను. ముఖక్షౌరం అలవాటయ్యే ఉంటుంది. విష్ణుశర్మ అన్నాడు కదా 'ఇదేమిటయ్యా నాకి పెటకం పెట్టావు. నేను మంగలివాణ్ణి ముట్టుకోను' అన్నాడు. నేను ముట్టుకో అక్కరలేదు: నా దగ్గర Safety razor ఉన్నది అన్నాను. దాని వాకబు చెప్పమన్నాడు. ఆ రెండు శబ్దాలకీ స్పెలింగులూ, అర్థాలూ, చెప్పాను. నా razor తీసుకవచ్చి చూపించాను. ఇది తెగదు అన్నాను. safety అంటే అదేను అన్నాను. అన్నానేగాని ఆయనకు చూపించాలని ఆరోజున ప్రొద్దున గడ్డం చేసుకొంటూఉంటే నా గడ్డం రెండుచోట్ల తెగింది. ఆయన నవ్వాడు. నేనేమి చేయను. దానికి safety razor అని నేను పేరు పెట్టలేదుగదా. ఎవడో పెట్టాడు. నన్నేం చేయమంటారు అన్నాను. సరే ఆయన మాత్రం మంగలివాణ్ణి ముట్టుకోడు. తనకది చేతకాదన్నాడు. ఇక చేస్తే నేను చేయవలె. చేద్దామని కూర్చున్నాను. అప్పుడు నాకు తెలిసింది. ఓరి దీని దుంపతెగ మంగలివాడి దగ్గరున్న కత్తితో వాడూ మనకు చెయ్యవచ్చు. మనకూ మనం చేసికోవచ్చు. ఈ safety razor తో మనకు మనం చేసికోవలసిందే తప్ప ఇంకొకడికి చేయటం సాధ్యమయ్యేటట్లు లేదు. ఆ వ్యవహారం అల్లాంటిది. దానికేమి ఇదిట్లా ఉండగా మా స్కూల్లో పిల్లలందరూ నన్ను వేరే అడగటం మొదలుపెట్టారు. "అయ్యా ఆరోజున మాకు తెలియక అల్లరిచేశాం. ఆయన నిజంగా తిక్కన్నగారే అటకదా, మళ్లీ మన కాలేజీలో ఆయన ఉపన్యాసం పెట్టించండి. ఈసారి అల్లరిచేయం" అని మొదలు పెట్టారు. నేనాలోచించాను. కాలేజీలో మళ్ళీ పెట్టించి నాకేమి లాభం. అక్కడ రావలసిందేమో ఇదివరకే వచ్చింది. అంతకన్న ఎక్కువ అక్కడ దమ్మిడీ కూడా రాదు. కనుక ఊళ్లోనే ఏదైనా సుంచి ఎత్తువేయాలి. పట్టి మా స్కూల్లోనే వేయి రూపాయలు వస్తే ఊళ్ళో కనీసం ఒక సభచేస్తే నాలుగైదు వేలన్నా రాకపోతే ఎల్లాగా ఆలోచించాను. టిక్కెట్లు పెడితే ఎవళ్ళు కొంటారు. కాలేజీ పిల్లలంటే వేలంవెఱ్ఱిమూక గనుక డబడబా డబ్బిచ్చారు. ఊళ్ళో ఇస్తారా? ఊళ్ళో పెద్ద డబ్బుగలవాళ్ళయితే ఉన్నారు. ఇద్దరు బ్రాహ్మల్లో లక్షాధికారు లున్నారు. వాళ్లు ఏదో మహార్నవమికి వైదికులకు సంభావన లిస్తారుకాని తిక్కన్నగారు వచ్చాడు

అంతే డబ్బిచ్చే రకం కాదు. ఏదైనా స్తోత్రం వ్రాసి వాళ్ళకి ప్రతి ఇస్తానంటే అచ్చు వేయుటానికి డబ్బిస్తే ఇవ్వవచ్చు. ఆ డబ్బైనా ఎట్లాగా ఏ ప్రెస్ వాడికో మీరు పెట్టుబడి పెట్టాడు. అది వసూలు రావటం లేదు. ఈ పుస్తకాల ద్వారా వసూలు చేద్దామని వాడు ప్రయత్నం చేస్తాడు. ఆ పుస్తకాల వస్తేనా రావుగాదని అర్థం. ఇతర వర్ణాల్లో కొందరు డబ్బుగలవాళ్ళు వాళ్ళ దగ్గరకు వెళ్ళితే మా వర్ణాల వాళ్ళయితేనే ఇస్తామంటారు. కొందరు డబ్బు గలవాళ్ళు ఈ సంవత్సరం నేను దానాల కోసం కేటాయించిన డబ్బు అయిపోయింది. మళ్ళీ ముందునాటి బడ్జెటులోనే అంటాడు. ఏం చేయాలో ఒకటి ఆలోచించాను. ఊళ్ళో మూడు హైస్కూళ్ళున్నవి. రెండు మిడిల్ స్కూళ్ళున్నవి. నాలుగు ట్యుటోరియల్ కాలేజీలున్నవి. వీటన్నింటి మీదా పిల్లవాడికి పావలా చొప్పునా, మాస్టర్లు వంద రూపాయలకి లోపు వాళ్ళయితే రూపాయి, పైనైతే రెండు ఇల్లా డబ్బు వసూలు చేయాలి. ఒక సభ చేయాలి. తరువాత ఊళ్ళో పెద్దమనుషు లందరికీ ఒక సభ పెట్టాలి. ఆ సభకి టికెట్టు ఐదు రూపాయలు, ఇంటింటికి పోయి అమ్మాలి. గవర్నమెంటు ఆఫీసర్ని గనక వెంట పెట్టుకు వెళ్ళితే వర్తకులల్లో చాలా వసూలవుతుంది. ఈ బస్సులవాళ్ళున్నారు, వాళ్ళకి ఉహ్! డబ్బు వస్తుంది. వాళ్ళచేత వేరే సభ పెట్టించాలి. అన్నీ ప్లాను వేశాను. కాగితాలు అచ్చు కొట్టించాను. టిక్కెట్లు వేయించాను. ఎక్కడికక్కడ వంద రూపాయలకి పది రూపాయల కమీషను ఇస్తానని ఏర్పాటు చేశాను. ఈ మూడు సభ లయ్యేటప్పటికి వచ్చు సంభావనగా పదివేలయినా వసూలు కావాలి. లేకపోతే ఎవడిసొమ్ము దాచుకొన్నట్లా మిక్కడ. వీళ్ళిద్దరూ నాయింటి కెందుకొచ్చారు. వీళ్ళ రోగం ఇట్లా కుదురుస్తాను– ఆలోచించాను. ఇందులో వీళ్ళరోగం కుదర్చట మేమున్నది?– అదేం మాట. ఎవళ్ళ రోగం కుదర్చాలన్నా సరే జనంమీద వసూలు చేయుటమే. డబ్బు జనానిదయినా వాళ్ళ పేరుమీద చేస్తున్నాము గదా! అందుచేత కుదిరిన రోగం వాళ్ళదే నన్నమాట. ఎక్కడికక్కడి వాళ్ళా జను పట్టుకోవాలి. లేకపోతే రాజ్యాలు చేయగలుగుదుమా?

నేను ఇన్నింటిని గురించి ఆలోచిస్తుంటే మళ్ళీ ఆదివారం చక్కానే వచ్చింది. నేను భోంచేయుటంతోటే ఇద్దరూ వచ్చారు. కూర్చున్నారు. చదువు చెప్పమంటూ. నేను ఒక్క నియామకం చేశాను. "అయ్యా! స్ప్రింగు దగ్గర మీరు పట్టుకోకూడదు. అక్షరాలను గురించి విచారణ చేయకూడదు. నేను కొన్నిమాటలు చెప్తాను. ఆ మాటలు మీరు నేర్చుకో వలసిందే. కొన్ని మాటలయినా వస్తేకాని చదువు సాగదు. కనుక మీరు కొన్నిమాటలు నేర్చుకొన్న తరువాత మనం చదువుతూ ఉండగా మళ్ళీ ఏమయినా అభ్యంతరాలు చెపితే

నేనూరకొంటాను గాని 'జార్జి' అనటంలో జి కి జకారోచ్చారణ ఎందు కున్నది. Jarj రాయాలి. వ్రాస్తేకాని జార్జికాదు. ఇల్లాంటి పేచీలు మానివేస్తే చెపు తాను. ఒక్కటేమాట చెపుతున్నా వినండి. ఇది గట్టిగా మనస్సులో పెట్టు కోండి. ఏ ఇంగ్లీషు అక్షరమైనాసరే దాని ఇష్టం వచ్చినచోట దాని ఇష్టం వచ్చి నట్లు పలుకుతుంది తప్ప మీఇష్టం వచ్చినట్లు పలుకనే పలుకదు. దీనికి మీరు ఒప్పు కొంటే తరువాత చదువు సాగుతుం దన్నాను. ఎట్లాగైనామంత్రి చేసినవాడాయె తిక్కన్న. ప్రపంచకమూ, రాజ్యాలు నడపటమూ, వాటిల్లో ఉన్న కష్టనిష్ఠూ రా లాయనకు తెలుసు. ఈ విష్ణుశర్మ కేం తెలుసు. ఈయన అన్నాడు కదా! "సరే నయ్యా! ఇందులోఉన్న పేచీ ఏమిటంటే ఎప్పటికప్పుడు ఏదోఒక క్రొత్త శబ్దం వస్తూనే ఉంటుందాయె. దాని ఉచ్చారణ క్రొత్తగానే ఉంటుందాయె, కనుక బ్రతికినన్నాళ్ళూ చదువు కోవటమేనా" అన్నాడు. నేనన్నాను "అందు కనే కదండీ బాబూ నేను చెప్పాను. మాలోఉన్న పెద్ద ఇంగ్లీషు పండితులు అం దరూ తాము చచ్చేవరకూ విద్యార్థులమే. అంటారు" అని. మీ రన్న మాట నిజమే. కొన్ని శబ్దాల ఉచ్చారణ బాగా చదువుకున్న మాకే తెలియదు ఇంగ్లీషు చదువుకున్న మాలోనే ఒకడు ఒకవిధంగా ఉచ్చరిస్తే ఇంకొకడు ఇం కొక విధంగా ఉచ్చరిస్తాడు. ఎవడైనా ఇంగ్లీషు దేశస్థుడు వచ్చి మాకొక ఉప న్యాసం ఇచ్చి పోతాడనుకోండి. మేము అదివరకు ఒకవిధంగా ఉచ్చరించే శబ్దాన్ని అతడింకొక విధంగా ఉచ్చరించి పోతాడు. అప్పటి నుంచీ మేము వాడికిమల్లే ఉచ్చరించటం మొదలు పెడతాము. ఉదాహరణగా మేము పూర్వం ఒకమాటను 'లాబరేటరి' అనేవాళ్ళం తరువాత అది 'లెబరేటరి' అయింది. కనుక దీనికి నియమంలేదు. మరికొన్ని శబ్దాలు ఉన్నవి. ఆ శబ్దాలు ఫ్రెంచి భాషలోంచి వచ్చినవట. ఆభాష మరీ అధ్వాన్నం. అందుచేత మరీ నాగ రికమైన భాష అట. ఒకమాటకు చివర అయిదా రక్షరా లుంటవి. అవి కలిపి ఏదో ఒక శాకువుని ఊదినట్లు ఊదాలితప్ప నీతీ, జాతీగల ఉచ్చారణ ఉండదు. కనుక మీ కిష్టమైతే ఈ కట్టడికి లోబడి చదువుకుంటే చదువుకోండి" అన్నాను. విష్ణుశర్మ అన్నాడు; గొప్ప గడుసు ముండాకొడుకు, "అబ్బాయీ! మొన్న. వేయి రూపాయలు సంపాదించావు. మాకు కుట్టించిన గుడ్డలూ, నీ యింట్లో. తెచ్చుకున్న సామగ్రీ అంతా కలిపినా మూడు వందలకన్న ఎక్కువకాదు. నీకు ఏడు వందలు మిగిలింది. నీవు లెక్కలు వేస్తున్నావు, చూస్తూనే ఉన్నాను. అదంతా అట్లాఉంచు. ఆ ఏడువందలూ నిన్ను ఊరికే తిననిస్తా ననుకొన్నావా? ఏమైనాసరే నీచేత ఇంగ్లీషు చెప్పించుకొని తీరుతా" నన్నాడు. నేను సరే నన్నాను. వాడొకందుకు పోస్తుంటే మన మొకందుకు తాగుతున్నాము. సరే నని మా పిల్లవాడి పుస్తకం ఉందిగా, ఫస్టుఫారం పుస్తకము. అది తీసుక వచ్చాను. అందులో ప్రతిపాఠం మొదట కొన్ని మాటలు ఉన్నవి. ఆ మాట

లన్నీ ఒక కాగితంమీద వ్రాశాను. ఉచ్చారణలూ, అర్థాలూ అన్నీ వ్రాశాను. నేనొక తెలివికల పనిచేశాను. మీతో చెప్పలేదు. వీళ్ళిద్దరు కదూ. అందుచేత నిన్న సాయంత్రం ఒక కార్బన్ పేపరు కొనుక్కు వచ్చాను. కార్బన్‌తో రెండు కాపీలూ ఒక్కసారి తీసివేశాను. ఇద్దరికి చెరొక కాపీ ఇచ్చాను. చదవండి కూర్చొని అన్నాను. ఈ కాగితాలు వాళ్ళ కప్పజెప్పి నేను ఈసారి భార్యా పిల్లలతో సహా సినిమాకి వెళదామని.రాత్రి పన్నెండింటికి వస్తాము. అప్పుడు ఈ పోటుఉండదుగా. అన్నం పెట్టుకు తినమని చెప్పి పోతాము. వాళ్ళకు మంచాలుకొని పరుపులు కుట్టించి దుప్పట్లువేసి అగ్నిహోత్రపు శాలువలు కొన్నప్పటినుంచీ వాళ్ళిద్దరూ బలేగా నిద్దర్లు పోతున్నారు లెండి. వాళ్ళ గుఱ్ఱులు వింటూఉంటే వేదంలో చెప్పారే వర్షాకాలంలో కప్పలు ఎదురు బళ్ళు పడి పనసలు చెప్పినట్టుంటుందని. అల్లా కాకపోతే దేవుడిగుళ్ళో మంత్ర పుష్పం చెప్పినట్టుంటుంది అని. ఆ రెండు పేర్ల లిస్టులూ వాళ్ళ కిచ్చేశాను. మాఆవిడని రెడీ కమ్మన్నాను. ఆవిడకి అప్పటినుంచీ నామీద గుఱ్ఱు పోనేలేదు. నేనావిడని సినిమాకి బయలుదేరవే అంటే ఇంక చెప్పుబాబూ! ఇంట్లో మొదలు పెట్టింది కథ. ఆ ఉన్న నలుగురు పిల్లలకి తలలుదువ్వి నీళ్ళుపోసి ఉతికిన చొక్కాలు తొడిగే టప్పటికి-ఇంతాపడిస్తే ఇద్దరు వెధవలకి క్రాపింగే-సరిగ్గా రెండుగంటలు పట్టింది. నాకు భయమేమిటంటే ఇద్దరూ రాక్షసి ముండాకొడుకుల్ని ఇంట్లో పెట్టుకున్నాను. వీళ్ళిద్దరూ అరగంటయ్యే అప్పటికి మాకా మాటలన్నీ వచ్చేసినవి. పాఠం చెప్పమంటా రేమోనని. వచ్చినవా లేదా? అని ప్రశ్నలు వేద్దామంటే మర్యాద కాదాయె. పంచతంత్రం వ్రాసిన విష్ణుశర్మ నడగనా? భారతం వ్రాసిన తిక్కన్న నడుగనా? నిజానికి నేను వాళ్ళకి వ్రాసి ఇచ్చినమాటలు అన్నీ కలిపి నలభై లేవు. శాస్త్రిలు కూర్చుని వల్లెవేసిన ముండాకొడుకులకి ఈ నలభై ఇంగ్లీషు మాటలు ఒక బుగ్గకిరావు. నేను ఆవిడనేమో తొందర పెడతాను. మగి మం పసిపిల్ల. దానికి వాళ్ళమ్మ ఉతికిన చొక్కా తొడుగుతానంటుంది. అది పెట్టెలోఉన్న పట్టుచొక్కా తొడుగమంటుంది. అది పండక్కి తొడుక్కోవాలె. రోజుకి తొడుక్కుంటే మాసిపోతుందని ఇదంటుంది. అది ఏడవడం మొదలుపెట్టింది. పడిస్తే పడ్చింది. ఈవిడ దాని కంటికి కాటుక పెట్టింది. ఈ రోజుల్లో కాటుక ఎవళ్ళు పెట్టుకుంటున్నారు? వద్దని నేను. కాటుక పెడితే కళ్ళు పెద్దవి అవుతవి, అని అదీ. పెద్దవో చిన్నవో ప్రస్తుతం నాటంగు పెరుగుతుంది. అది ఏడ్చేటప్పటికి ఆ కన్నీళ్ళతో ఆకాటుక అంతా దాని మొహమంతా అయింది అంటే మళ్ళీ పదినిముషా లాలస్య మన్నమాటే. మొద్దా మొహమంతా చేసుకున్నావని మొట్టమొదట దాన్ని కొట్టాలి. తరువాత అదరా బాదరాగా సబ్బుపెట్టి కడగాలి. సబ్బుపెట్టి కడిగితే పోదుగా, నలుపింకా వ్యాపిస్తుంది. అప్పుడు కడిగిన మొహమే మళ్ళీ సున్ని పిండితోనో,

కుంకుడు కాయల రసంతోనో కడగాలి. అంటే రెండు సార్లన్నమాట. ఇల్లా అయ్యాం తరవాత ఏమైందో తెలుసునా? మీకు విసుగుగా ఉంటుందేమో! మీకు విసుగుగా ఉన్నమాట అట్లా ఉంచండి, ఈ ఆలస్యానికి నాకు ముళ్ళమీద కూర్చున్నట్లుంది. మొదటే సున్నిపిండితో కడిగితే సరిపోతుంది కదా! మొదట సబ్బుతో కడిగింది. ఆ కడగటం ఎట్లా కడిగిందంటే, దానికి ఉతికిన చొక్కా తొడిగిన తరువాత కడిగింది. అది ఆ ఉతికిన చొక్కాతో వెంటనే మొగం తుడుచుకొన్నది. మళ్ళీ రెండు చరిచింది. సరే, ఎట్లా గయితే నేమి? పెట్టెలో ఉన్న కొత్తచొక్కా తొడుగక తప్పలేదు. పిల్లలకయిపోయిన తరువాత తన ముస్తాబు మొదలుపెట్టింది. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే, మీరూ పెళ్ళాంబిడ్డలు కలవాళ్ళే కదా. ఈ బాధల్లో ఉన్న కష్టం మీకు తెలుసుగా అని చెపుతున్నా. ఇదంతా నట్టప్పుడు కష్టంగాదు. సరదాగా ఏదయినా పని పెట్టుకున్నప్పుడు, ఎక్కడికైనా తప్పించుకుపోదాం అనుకున్నప్పుడు అప్పుడున్నది ఇందులో బాధ. చివరకి ఆవిడా పిల్లలూ తయారైనారు. ఆరుగంటలైంది. అప్పుడు బయలుదేరితే సినిమా హాలు దగ్గరికి వెళ్ళేటప్పటికి ఏడుగంటలవుతుంది. కొంత బొమ్మ అయిపోతుంది. అయినా సరే. [illegible] వచ్చిన తరువాత నేను వెనక్కి తీశానా పిల్లతో నా బాధకంటే ఆవిడతో నా బాధ ఎక్కువవుతుంది. సరే నేనూ తూగుతున్నాను. ఇంతలో మిత్రుడొకడు "ఆమాటలు మాకు వచ్చినవయ్యా, నీవేదో పెళ్ళాం బిడ్డలతో సినిమాకి వెళ్ళుతున్నట్లున్నావు క్షేమ పడుకొని నిద్దరపోయిన తరువాత గాని రావు. మళ్ళీ ఆదివారమే నంటావా" అన్నాడు. ఆవలిస్తే ప్రేవులు లెక్కపెట్టేవాళ్ళు. నేను "అల్లాకాదు. రేపు రాత్రికి కూర్చుందాం" అన్నాను. ఆయన సరే నన్నాడు.

మరునాడు రాత్రికి కూర్చోక తప్పక వచ్చింది కూర్చున్నాము. నాకు రాత్రిపూట కూర్చోవటమంటే చెప్పానుగదా ఏమీ గిట్టదు. పైగా మా యింట్లో విద్యుద్దీపాలు లేవు. లాంతర్లు ఉన్నవి ఆ లాంతర్లు వెలిగించటాన్ని గురించి అదొక పెద్దకథ పోనివ్వండి. అవి ఎప్పుడూ గుడ్డిగానే ఉంటవి తప్ప వచ్చినా తెల్లగా ఉండవు. ఎక్కడ చూచినా రాజకీయాలే. కిరసనాయిలు అంటుంది. ఆ గ్లాసుని నువ్వెప్పుడైనా సీమసుద్దపెట్టి తోముతావా అని. గ్లాసంటుంది. అ కిరసనాయిలు అచ్చమైన కిరసనాయిలేనా. అందులో నీళ్ళు ఎన్ని ఉన్నవి. అసలది ఎట్లాగా ఉన్నది. అది అంతకన్న ఎక్కువ ఉన్నట్లుందా అంటుంది. అసలు రాజ్యం చేసేది వత్తి. అది కదలనంటుంది. ఎన్ని పెట్టి తోసినా కదలదు. పైనుంచి లాగుదామంటే అందదు. సీసాబిరడా తీసినట్లుగా చొక్కాలకు పెట్టుకుంటామే పెద్దపిన్నులు వాటిని వేసి కుదిపి పట్టి లాగుదామని. అందులో నుంచి దారపు పోగన్నా తెగివస్తుంది తప్ప అది వచ్చినా పైకి రాదు. గుజ్జం గుడ్డదైనా ధాటికి లోపం లేదని ఆ లోపలిది ఇలకరచుకొని

పోయిన అవస్థ మళ్లీ కొడిగట్టుతుంది. ఆ ఒక్క లాంతరులో ఈ రోజుల్లో ఇన్ని రాజకీయాలు ఉంటవి. ఆ లాంతర్లముందర కూర్చొని చదవటమంటే వాళ్లకేమీ ఇష్టంలేదు. పిళ్ళకి పాఠమిస్తే ఎవ్వడుచెపుతాడు? నిజమే ననుకోండి. వాళ్ళ డబ్బు నేను బ్యాంకులో వేశాను. వాళ్లుమాత్రం తినటంలేదు. ఈ వారం రోజులనుట్టి ఊరకే ఉన్నారేమిటి? మంత్రులను పిలిచి టీపార్టీలిచ్చిన ట్లిస్తున్నా ప్రసంగాలు. సలహై మాటలాడెను వ్రాసియిచ్చింది. స్పెల్లింగు లడిగి అర్థాలడిగి ఓడిపిస్తాననని పుట్టింది. అయ్యా! మీరేమీ అనుకో కూడదు. మీకు మాటలు వచ్చినవో రాలేదో నేను ప్రశ్నలు వేస్తాను. దయ చేసి సమాధానాలు చెప్పాలి అన్నాను. వాళ్లు సరే నన్నారు. మొట్టమొదట The, ది అన్న దాన్ని అడిగాను. స్పెల్లింగుచెప్పారు. చెప్పి విష్ణుశర్మ ఇది ది ఏమిటయ్యా, థి అనాలి. ది అనటానికి de ది అనాలి అన్నాడు. అంటే తిక్కన్న "అల్లా కాదయ్యా de డీ అవుతుంది. దికి The ఏ ఉండాలి" అన్నాడు. నే నూరకో కూడదూ. నా దగ్గర ఎంత గాడుంది. నిజానికి The థే కావాలి. Therapy థరపీ అనేమాట ఉంది. అందులో థెరపే అయింది. విడిగా దానంతట అదయితే మాత్రం ది అవుతుంది అన్నాను. ది అంటే ఒక అని అర్థం వ్రాసి పెట్టాను. ఆయన a అన్నా ఒక. ది అన్నా ఒక. రెంటికీ ఒకటే అర్థమా అన్నాడు. నేను "బాబూ! అంత తొందర పడకూడదు. మొట్టమొదట పిల్లలకు చదువు చెప్పేటప్పుడు వీటిని ఒక అని అర్థము చెపుతాము తప్ప నిజానికి ఈ రెండు మాటలకు అర్థాలు లేవు. a dog అంటే ఒక కుక్క కాదు. పట్టి కుక్క అని అర్థం. అట్లాగే The man అంటే పట్టి మనుష్యుడు అని అర్థం. ఆ మను ష్యుడు అని కాదు. కాని ఒక్కొక్కప్పుడు The man అంటే ఆ మనుష్యుడు అని కూడా చెప్పవలసి వస్తుంది. అది పోగా పోగా కాని తెలియదు అన్నాను. విష్ణుశర్మ ఇదేమిటయ్యా. ఇందాక The అంటే ఒకటంటివి. ఇప్పుడు ఆ అని అర్థమంటా వేమిటి" అన్నాడు. నేను నీళ్లు నమిలి కాదు కాదు. The అన్న మాటకి ఒక అని అర్థం లేదు. తత్ అనే అర్థమే. ఒక అని మీ కెందు కర్థం చెప్పానబ్బా అని ఆలోచిస్తున్నాను. విష్ణుశర్మ "ఆలోచించకు, ప్రమాదో ధీమతా మపి అన్నాడు. అన్ని ప్రమాదాలు గల ఆ భాషలో నీకు ఒక్క ప్రమాదం వస్తే తప్పేమిటి" అన్నాడు. నేను Man చెప్పమన్నాను. విష్ణుశర్మ స్పెల్లింగు చెప్పి అర్థం చెప్పాడు. తిక్కన్నను Woman చెప్ప మన్నాను. ఆయన స్పెలింగు చెప్పి అర్థం చెప్పాడు. విష్ణుశర్మ అన్నాడు, ఏమయ్యా నీకు రెండు మూడు భాషలు వచ్చునల్లే ఉందే. నేను ఆయన ఎందు కడుగు తున్నాడో తెలియక వచ్చునండీ అన్నాను. ఆయన సంస్కృతంలో Man కేమిటి అన్నా డు. పురుషుడు అన్నాను. Woman కో అన్నాడు. స్త్రీ అన్నాను. తెలుగు లోనో అన్నాడు. మగవాడు, ఆడది అన్నాను. నీ కింకే భాషలు వచ్చు

అన్నాడు. హిందీ వచ్చు అన్నాను. మరందులోనో అన్నాడు, మర్ద్, ఔరత్ అన్నాను. ఇక విష్ణుశర్మ చూడు మూడు భాషల్లో చెప్పావు మగవాడికి మాట వేరు. ఆడదానిని చెప్పే శబ్దం వేరు. ఇదేమిటయ్యా ఈ ఇంగ్లీషులో ఆడది అనటానికి మగాడి కేదో తగిలించా రేమిటి ? అన్నాడు నాకర్థం కాలే. మళ్ళీ ఆయన అన్నాడు. తెలియలేదా? తెలియదు నాయనా? అది నీతెలివి తక్కువ కాదు. ఆమాటలన్నీ బుద్ధికి అభ్యాసమై ఉండటం మూలంగా వాటిని ఆలోచించే నిశితత్వం బుద్ధికి పోతుంది. ఇప్పుడప్పుడే నేను చెప్పకూడదుకాని ఒకవిషయం ఇప్పుడే చెప్పుతాను. ఈదేశంలో మీరందరూ ఇంగ్లీషు చదువు తున్నారు. మేము అక్షరాలు నేర్చుకొని పదిమాటలకాడికి వచ్చే టప్పటికే మాకీభాష ఇంత కంగాళీగా ఉన్నదే. ఇది యింత కంగాళీభాష అని మీ కెందుకు తెలియటం లేదో తెలుసునా? మీ కలవాటైపోయింది. వాళ్ళు చదువ మంటున్నారు. మీరు చదువు తున్నారు. చదివితే కాని మీకుద్యోగాలు రావాయె. పైగా శరీర మాద్యం ఖలు ధర్మసాధనం కదా! అన్నాడు. నాకు ఒళ్ళు మండిపోయింది. మర్యాదగా చెపుతే ఏమనే వాడినో కాని ఇంత ఆక్షేపణ చూస్తే ఇంగ్లీషులో అంటారే Turned to bay అని అల్లా అయింది నావని నే నన్నా కదా "అయ్యా! మరీ అంత తీసివేయకండి. Woman అని ఊరకే అనలేదు వాళ్ళు. పురుషునియొక్క శరీరంలో నుంచే వాళ్ళ భగవానుడు స్త్రీని తీశాడు. అందుచేత పురుషునిలో నుంచి పుట్టినది గనుక Woman అన్నారు. అది కాకుండా నాకు తోచిన ఒకమాట చెపుతాను. మన దేశంలోకి మల్లే వాళ్ళ దేశంలో సంబంధాలు తల్లిదండ్రులు కుదుర్చటం ఉండదు. మగవాడు ఆడదాన్ని Woo చేస్తాడు. Woo చేయుట మంటే దానితో స్నేహం చేసి, దానితో నాట్యం చేసి దానికి పూవులు కొనిపెట్టి ఇల్లాగా చివరికి అది వాణ్ని ప్రేమించి పెళ్ళి చేసుకుంటాను అనే టట్లుగా చేయటం. అందుచేత Woman అన్నారు. చూడండి ఎంత బాగాఉందో శబ్దం అన్నాను. అంటే విష్ణుశర్మ చాలా బాగుంది. కాని నిన్న కాబోలు నేను వీధివెంట వస్తూ ఉండగా ఇద్దరు నిలుచుని పోట్లాడు కుంటున్నారు. వాళ్ళు చొక్కాలు గిక్కాలు తొడుక్కున్నారు. ఒక అతడు స్త్రీ స్వాతంత్ర్యం ఉండాలి అని పోట్లాడుతున్నాడు. Man లోనుంచి Woman పుడితే స్త్రీస్వాతంత్ర్య మేమిటి? వాడు మగవాడూ ఇది ఆడది అయితే స్త్రీస్వాతంత్ర్యం ఉండవచ్చు. ఆశబ్దంవేరు. ఈశబ్దం వేరు. అందుచేత అనాదిలో వాళ్ళకూ వాళ్ళకూ సంబంధం ఉండక పోవచ్చు. ఇక్కడ అట్లా కుదురదే అన్నాడు. నాకు ఒళ్ళు మండిపోయి 'అయ్యా! మీరు వేదాంతం సృష్టి ఎట్లా జరిగింది. శబ్దం ఎల్లా పుట్టింది. పుడితే ఇల్లా పుట్టాలి, వీటిని గురించి చదువుతున్నారా ? భాష నేర్చుకోవటానికి చదువుతున్నారా అన్నాను. తిక్కన్న అన్నాడు "అవునయ్యా ! విష్ణుశర్మా ! పాపం అతడు

ఈ దీపం ముందర కూర్చో లేకుండా ఉన్నాడు. ఈ పూటకి వదలిపెట్టరాదా అన్నాడు. విష్ణుశర్మ అన్నాడు కదా ! అవునయ్యా ! ఎందుకు వదలిపెట్టాలి. నేనేమో రెండు పూటలా వంట చేస్తుంటిని. మొన్న కనుక్కు వచ్చాను. రెండు పూటలా అన్నంపెట్టి, నెలకి ఇరవై రూపాయ లిస్తేకాని వంటవాళ్ళు కుదరటం లేదు. పైగా వాళ్ళు అవీ ఇవీ ఎత్తుకు పోతుంటారట. ఏడువందలూ తన పేర బ్యాంకులో వేసుకున్నాడు తప్ప మీరి నాల్గురూపాయలు వాడుకో మని ఏమన్నా ఇచ్చాడా ! దారిలో వస్తూ ఉండగా ఆయన ఎవరో చేతిలో ఏదో పేసుకొని పేలుస్తున్నాడు. నేనేమిటయ్యా అని అడిగాను. నశ్యం అని చెప్పాడు. ఎట్లా ఉంటుందో అని నేనుకూడా ఒక్క చిటికెడు పట్టి పీల్చాను. నిజంగా తిక్కన్నగారూ ! మీరు భారతం వ్రాసే రోజుల్లో ఆ నశ్యమే పీల్చి ఉంటే మీరు వ్రాసిన భారతంకంటే ఆ భారతం పదిరెట్లెక్కువ బాగా ఉండేది. అన్నాడు. అంటే తిక్కన్న "దానికేముంది మళ్ళీ వ్రాస్తాను. అది దేనితో చేస్తారో కనుక్కురాక పోయినావా'' అన్నాడు. విష్ణుశర్మ "కనుక్కు వచ్చాను. భయంలేదులే. అసలు కొనుక్కునే వద్దామనుకున్నాను. ఇతడు నా చేతికి ఏమీ డబ్బివ్వలేదాయె. పైగా ఇంకొకపేచీ వచ్చింది. మనకు ఈ నాణాలూ, వీటి మారకం తెలియదు. ఈ ఇంగ్లీషుతోపాటు ఈయన దగ్గర లెక్కలు కూడా చెప్పించుకోవలసి వచ్చేట్టుంది. రూపాయకి ఎన్ని అణాలో ఎన్నికానులో, ఎన్ని పైసలో ఏ నాణెంయొక్క ఆకారం ఎట్లాంటిదో, తెలియకుండా బజారుకి వెళ్ళితే వాళ్ళు మనని వెఱ్ఱి పుచ్చకాయ కింద కట్టే స్తారు. పూర్వం మనం బ్రతికి ఉండే రోజుల్లో లెక్కలు వేరాయె. దీనారము అనిగాని, మాడ అనిగాని, రోలీ అనిగాని ఇల్లాంటి మాటలు వినబడడమేలేదు" అన్నాడు. నేను చప్పున ఇంట్లోకి వెళ్ళి నాలుగు రూపాయలు తీసుకువచ్చి ఇద్దరికీ చెరి రెండు రూపాయలు ఇచ్చాను. ఇచ్చి ఇంట్లో ఇంత చిల్లర ఉంటే తీసుకవచ్చి ఆ నాణాలన్నీ చూపించి అర్ధరూపాయలూ, బేడలూ, అణాలు కానులూ అన్నీ చూపించాను. చూపించి బాబూ మీ డబ్బు నా కక్కరలేదు. కావలిస్తే ఆ బ్యాంకు అకౌంటు మీ పేరనే పెడతాను అన్నాను. విష్ణుశర్మ పగలబడి నవ్వటం మొదలు పెట్టాడు. "ఓరి పిచ్చివాడా ! నీ డబ్బు మా కెందుకోయి. నేను ఊరకే నిన్ను ఏడిపించే అందుకు అన్నాను. నీ భార్య నాకు కూతురాయె. నీ వల్లుడవుగదా ? ఆ డబ్బు నీ పెళ్ళికి కట్న మిచ్చా ననుకుంటాలే" అన్నాడు. ఎగతీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య. వీళ్ళతో వ్యవహారం కత్తిమీది సాముగా ఉంది. సరేనని నాకు విసుగెత్తి చెపుతా పట్టండి కూర్చోండి అన్నా. విష్ణుశర్మ 'ఇప్పుడెందుకులే' అన్నాడు. తిక్కన్న అదేంమాట ! నీ వాయన మనస్సునంత కష్టపెట్టావు. అతని కిప్పుడప్పుడే నిదురపడుతుందా పెడుతుందా కొంతసేపు నేర్చుకొందామన్నాడు. సరేనని

ఇద్దరూ కూర్చున్నారు. వెళ్లుట అన్న మాటకి ఇంగ్లీషు ఏమిటి అని అడిగాను. విష్ణుశర్మ 'జి.ఓ. గో' అని చెప్పాడు. నేను I go అంటే. ఏమిటి అని అడిగాను. ఆయన నేను వెళ్లుట అన్నాడు. నేను అల్లాకాదు I go అంటే నేను వెళ్లుదును అని అర్థం అన్నాను. ఆయన ఇందులో "దును" ఎక్కడ ఉన్నది అన్నాడు. నేను అల్లా అనుకోవాలి అన్నాను. ఆయన ఇది బాగా లేదు ఇది ఏకాలమో చెప్ప మన్నాడు. నేనేం చెప్పను ? వర్తమానకాలమూ? భూతభవిష్యత్తులు కావు. తద్ధర్మ కాలము అనవలె. ఇంగ్లీషులో దీనిని Present indefinite అంటారు. అంటే నిశ్చయంగా చెప్పటానికి వీలులేని వర్తమానకాలం అని అర్థం. అంటే వెళితే వెళతాను లేకపోతే లేదని కావచ్చు. ప్రతిరోజూ వెళుతూ ఉంటానని కావచ్చు భాషమీద ప్రయోగిస్తూ ఉండగా దాన్ని వాడే సొగసు తెలియాలి తప్ప ఖచ్చితంగా చెప్పటానికి వీలులేదు అన్నాను. విష్ణుశర్మ "అది కాదయ్యా, 'గో' అన్నది, వట్టి ధాతురూపం గదా. అది క్రియ కావలెనంటే దానికొక ప్రత్యయం చేరవలెను కదా. నామవాచకములకూ క్రియలకూ ప్రత్యయాలు చేరుతవికదా, ఇప్పుడు man అని ఉన్నది. Man అనగా మనుష్యుడు. మనుష్యుని చేత అని తెలుగులో తృతీయా విభక్తి చేరుస్తాం. సంస్కృతంలో మనుష్యేణ అంటాం. హిందీలో ఏమంటారు, మనుష్యేసే అంటారని నేనన్నాను. ఆయన 'సరే' చూశావు కదా! మన మూడు భాషల్లోను నామవాచకానికి కరణార్థంలో తృతీయా విభక్తి వాడాం కదా అల్లాగే క్రియల మీద కూడా ప్రత్యయాలు వాడతాం! దాని దగ్గరికి తరవాత వస్తాను. మనుష్యుని చేత అన్నట్లు ఇంగ్లీషులో ఏమంటారు అన్నాను. నేను by the man అన్నాను. అదేమిటి అన్నాడు ఆయన. నేను బి. వై. బై అంటే చేత అని మీరు వ్రాసి యిచ్చారుకదా. ఆ ఆ బై కలిపాను అన్నాను. ఆయన ఎక్కడ కలిపావో తెలుసునా అన్నాడు. ఇందుకనే మీ స్కూల్లో నీకు జీతం పెరగటం లేదు. లేకపోతే మేము మీఇంటికి రావటమేమిటి? మీస్కూల్లో మీ తెలుగు శాఖకి ఇంకొకడు అధ్యక్షుడు కావటమేమిటి? అన్నాడు. నేను "బాబూ ! కాదు. ఈ భాషలో శబ్దము తరువాత ప్రత్యయము చేర్చరు. మరీ నామవాచకాలకి వెనకనే చేరుస్తారు" అన్నాను. ఆయన అయితే విభక్తి ప్రత్యయాలన్నీ చెప్పు" మన్నాడు. అని ద్వితీయా విభక్తి ప్రత్యయ మేమిటి అన్నాడు. నేనేం చెప్పను. ద్వితీయా విభక్తి ప్రత్యయము లేదు అన్నాను. ఆయన అల్లా అయితే 'రాముడు రావణుని చంపెను' ఇంగ్లీషులో ఎల్లా చెపుతావు అన్నాడు. నేను చంపుట అన్న మాటకి మీరు ఇంగ్లీషు రాసి పెట్టలేదు కదా అన్నాను. ఇప్పుడు చెప్పు అన్నాడు. చెప్పాను. kill అని. ఆయన రెండు ఎల్ లు ఎందుకు అన్నాడు. నేను అట్లాంటి ప్రశ్న వేయటానికి మీకు హుకుం లేదన్నాను. అని Rama killed Ravana అని

చెప్పాను. Killed భూతకాలిక క్రియ అన్నాను. ఆయన అది సరేనయ్యా చంపటాన్ని ముఖ్య పెట్టావేమి అన్నాడు. నేనంతే నన్నాను. ఆయన నవ్వి ఎవడు చంప బడాలో వాడు తప్పించుకు పోతాడు సుమా' అన్నాడు. ఆయన చమత్కారం నాకు తొందరగా అర్థం కాలే. కొంత సేపటికి అయింది. నావంటి బుద్ధిమంతులు లోకంలో ఉంటారు కదా. వాళ్ళ కోసం ఇందులో ఉన్న చమత్కార మేమిటో చెపుతాను. నిజానికి ఇల్లా భాషని చూస్తే ఆ భాష నిలువదు. ఏ భాషా నిలువదు. సంస్కృతం ఒక్కటే నిలుస్తుంది. అందులో నుంచి పుట్టిన భాషలు కనుక భారత దేశపు భాషలు నిలువ వచ్చు. ఇవి శబ్దాలూ, అర్థాలూ నేర్చుకోవటం కాదు. రాముడు రావణుని చంపెను; అన్న వాక్యము ఉంటే రావణుని అన్న శబ్దం వెనుక ఉన్నది. 'చంపెను' అన్న శబ్దం తరువాత వచ్చింది. చావటం జరినం దన్నమాట. ఎవడు చంపబడ్డ వాడో వాడు తత్పూర్వమందే చెప్పబడ్డాడు. చంపుట అన్న ధాతువులోని అర్థం వాడికి తగులక తప్పదు. ఇదొక మోస్తరు విలక్షణమైన ఊహ. అక్కడ ఎవ్వడూ చంపటమూ లేదు చావటమూ లేదు. కాని ఆ క్రియ యొక్క ఫలము ఎవణ్ణి చెందుతున్నదో వాణ్ణి వెనక పెట్టటం మూలంగా వాడికి తగిలినది. ఇంగ్లీషులో అట్లా తగలటానికి వీలులేదు. మాటల యొక్క వరుస ఇట్లా ఉండాలి కాని అట్లా ఉండ కూడదని ఒక చమత్కారమైన తత్త్వ దృష్టితో ఆయన వ్యాఖ్యానం చేశాడు. అది చమత్కారంగా అన్నాడు. ఇది ఎంతమంది కర్థ మవుతుందో నాకూ తెలియదు. నాకు అర్థమైందని తెలిసిన తరువాత ఆయన మళ్ళీ ఇలా అన్నాడు, ఇంకా చమత్కారాన్ని కొనసాగిస్తూ. Rama killed అని నువ్వన్నావు. Ravana అనక ముందు వాడక్కడ నుంచి లేచి పోతాడనుకో. నీకేం చేయాలో తెలుసునా మసుస్తూ ఒక మేకనో, కుక్కనో తెచ్చుకొని అక్కడ పెట్టుకోవాలి. ముందరే రావణున్ని అక్కడ పెట్టావనుకో ఇంకెట్లా పోతాడు, చచ్చి తీరవలసిందే నన్నాడు. నేను 'బాబూ! చాలు ఈ చమత్కారం' అన్నాను. తిక్కన్న అన్నాడు, ఇందాకటిబట్టి ఊరకున్న వాడు, "అబ్బాయి, ఇది చమత్కారం కాదు. భాష. భాషలంటే భావాలని అక్కడ ఉన్నటువంటి శబ్దాలూ వాక్యాల ద్వారా మనం తెలుసుకోవటం. మనుష్యుని యొక్క బుద్ధి ఎప్పుడూ ప్రసరిస్తూ ఉంటుంది. దాని మనస్సు చలిస్తూ ఉంటుంది. ఇది మనో లక్షణం. ఆ మనస్సు యొక్క నడకకు అనుకూలంగా భాషని నిర్మించుకోవాలి. వాక్య విన్యాసం అట్లా ఉండాలి. చంపెను అనటం తోటే ఎవణ్ణో ఇదివరకే తెలియాలి. తరువాత తెలియట మనేది మనస్సులో ఉన్న పరమ సూక్ష్మాంశము నకు బద్ధమైన విషయం. ఇంత వరకు మేం చదివింది ఏమీలేదు. ఈ అక్షరాలు నేర్చుకొని, పది మాటల దగ్గరకు వచ్చి ఒక్క వాక్యం కాడికి వచ్చే అప్పటికి [illegible] ఇంత ఘోరంగా ఉన్నది. ఈ భాషని ఈ దేశంలో, బంగారం వంటి

దేశంలో, సంస్కృతంలో నుంచి పుట్టిన తెలుగుభాష చదువుకున్న దేశంలో, పసిపిల్లల అందరి బుద్ధుల మీదా, అందరి మనస్సుల మీదా వందల పండ్లుగా మీరు రాస్తున్నారు. వాళ్ళకి తెలియకుండా వాళ్ళ మనస్సులలో ఉన్న పరమ సూక్ష్మమైన, పరమ పరమ సుకుమారమైన మనోవృత్తి ఎంత బాధ పడు తున్నదో ఎంత బరువవు తున్నదో మీకు తెలియటం లేదు. అందుకనే కాబోలు మీరందరూ ఇంత తెలివి కల వాళ్ళుగా ఉన్నారు" అన్నాడు. అప్పుడు విష్ణుశర్మ ఇలా అన్నాడు, "ఇదిగోనయ్యోయి! ద్వితీయా విభక్తి ప్రత్యయం లేకుండా ఉండటం చాలా తప్పు. అసలు విభక్తి లేకుండా ఉండ కూడదయ్యా. ఒక విభక్తి ప్రత్యయం కోసం ఇంకొక విభక్తి ప్రత్యయం ఊహించుకో వచ్చు. కాని అది ద్వితీయా విభక్తిలో చేయటం బాగుండదు. చూడు Rama killed Ravana అన్న శబ్దం ఎప్పుడూ అక్కడ పడి చావాలసిందే. మన భాషలో రావణుని చంపాడు రాముడు. రావణుని రాముడు చంపాడు. రాముడు చంపాడు రావణుని. రాముడు రావణుని చంపాడు. ఇన్ని విధాలుగా చెప్పాము. అన్ని వాక్యాలకి తలా ఒక అర్థం వస్తుంది. రావణుని చంపాడు రాముడు. రాముడు ప్రత్యేకంగా రావణుని చంపాడనే అర్థం వస్తుంది. ఆ అర్థం నీకు తెలిసే అట్టుగా ఇంకా నాలుగు వాక్యాలు చెపుతాను చూడు, హిరణ్యకశిపుణ్ణి చంపాడు నరసింహమూర్తి. కంసుణ్ణి చంపాడు కృష్ణుడు. రావణున్ని చంపాడు రాముడు. ఇప్పుడు చూశావా. రావణ శబ్దం మీద ద్వితీయా విభక్తి వేస్తే దాన్ని మొదట ఉంచితే ఈ అర్థం వచ్చింది. రెండో వాక్యం ఉన్నది. రావణుని రాముడు చంపాడు. ఈ వాక్యానికి అర్థం ఎట్లా వస్తున్నదో చూడు. ఇంద్రజిత్తుని లక్ష్మణుడు చంపాడు. రావణుని రాముడు చంపాడు. మూడో వాక్యం రాముడు చంపాడు రావణుని. ఇంకోడు కాదని అర్థం. ఇన్ని అర్థాలు ఎట్లా వస్తున్న వంటారు. ద్వితీయా విభక్తి ప్రత్యయం ఉండటం మూలంగా, ఆ శబ్దాన్ని మూడు చోట్ల ఉపయోగించటం మూలంగా వస్తున్నవి. విభక్తి ప్రత్యయం లేకపోతే ఆ అర్థాలు రావు. ఈ షోకులు లేవు. భాషని ఒడుపుగా వాడటానికి వీలులేదు. ఈ భాష గొప్పభాష అంటున్నావు. సులభంగా అనేకార్థాలు చెప్పటానికి వీలున్నట్లు లేదే. తృతీయా విభక్తి చెప్ప మన్నాడు. నేను ఇందాక చెప్పాగదా. by the man అనాలి. అట్లాగే by the lion. lion అంటే సింహము. అంటే స్పెలింగు చెప్పమన్నాడు. చెప్పాను. ఆయన ఇదుగోనయ్యా! ఈ lion కేమిటి గాని 'గో' అంటే వెళ్ళు అన్న శబ్దం బాగుందయ్యా. గం గఛ్‌లో నుంచి వచ్చింది. మన గో శబ్దానికి వ్యుత్పత్తి కూడా అదేను. మొత్తానికి వాళ్ళ భాషకూడా సంస్కృతంలో నుంచే పుట్టిం దేమో అన్నాడు. నేను సంస్కృతం లోనుంచే పుట్టిందండీ. ఫారసీ, అరబ్బీ లాటిన్ గ్రీకూ సంస్కృతం ఇవన్నీ పూర్వం ఏదో ఒక భాష ఉండేదట. దాని

లో నుంచి పుట్టినవని అంటున్నారు అన్నాను. ఆయన ఏభాష ఉండేది అన్నాడు. నేను నాకు తెలియదండీ. ఒక భాష ఉండి ఉండాలి. అందులోనుంచి ఈ భాష లన్నీ పుట్టి ఉండాలి అని వాళ్ళంటున్నారు. అంటే ఆయన ఆ భాష ఏమిటో తెలుసునా అన్నారు. నేనన్నాను, తెలియదండీ. అని వాళ్ళు ఊహా చేశారు అన్నాను. ఆయన ఎందుకు చేశారు అన్నాడు. నేను నవ్వి వాళ్ళు ఊహా చేశారంటే ఎందుకు చేశారంటా రేమిటి? అట్లా ఊహించారు. ఎందుకు ఊహించారంటే ఎవరు చెప్పగలుగుదు రన్నాను. ఆయన "అది ఏమిటయ్యా ఒకళ్ళొక విధంగా ఊహించా రంటే, ఒక హేతువు చేత ఊహిస్తారు. మేము ఇప్పుడు నీదగ్గరకు వస్తామని ఊహించాము. ఊరకే ఊహించామా, నిన్ను బాగు చేదామని వచ్చాము. అల్లాగే నీ కేమైనా కారణము తెలుసు నేమా అడిగాను" అని అన్నాడు. నేనన్నాను. శతవిధాల కారణం ఇట్లా అయి ఉంటుంది. మనుష్యుడు మొట్ట మొదట టిబెట్ ప్రక్కన ఏసియా మైనర్ అని ఉంది. అక్కడ పుట్టాడని ఒక సిద్ధాంతం ఉంది. అక్కడ ఒక భాష ఉండి ఉండాలనీ అక్కడ నుంచి మన భారత దేశానికి వచ్చిన వాళ్ళు సంస్కృతంగా ఆభాషని మార్చుకొంటే ఆయా దేశాలకి వెళ్ళిన వాళ్లి ఆయా భాషలుగా మార్చుకున్నారు. మూల భాష మాత్రం చచ్చిపోయింది. అన్నాను. ఆయన "ఎట్లా చచ్చి పోతుంది. ఆ ఏసియా మైనరులో ఆభాష ఉండి ఉండాలి" అన్నాడు. నేను ఇప్పు డక్కడ ఆభాష లేదండీ అన్నాను. ఆయన అంత లావు మనిషి భాషీపెట్టు వేసుకున్న వాడు భాషీపెట్టు తీసి ఒక కాలిమీద కూర్చొని కుడిచేయి చెక్కిలి కానించి "ఏమైపోయిం దబ్బా" అన్నాడు. తిక్కన్న పకాలున నవ్వాడు. నా కేమీ తోచ లేదు. వాళ్ళు ఏంచేసినా నాకు కొంతసేపైతే కాని అర్థం కావటం లేదు. ఇదంతా ఆక్షేపణ అన్నమాట. తిక్కన్న పగలబడి నవ్వుతుంటే నాకు కొంత సేపటికి తెలిసింది. ఈ మనిషిలో ఇంత ఆక్షేపణ ఏమిటి అని నేనన్నాను. అయ్యా! నన్నా క్షేపించడం చాలా తేలిక, మా వైనుభాన్సలరూ మా మంత్రులూ మా పెద్ద పెద్ద పండితులూ పెద్ద ప్రొఫసరులూ వాళ్ళ దగ్గిరికిపోయి ఆక్షేపించాలి తప్ప, తల గిల్లితే గుడ్డి గవ్వ చేయని నాదగ్గర ఆక్షేపిస్తే ఏమిలాభం అన్నాను. ఆయన మేము వాళ్ళ దగ్గరికెట్లా వెళ్ళతామయ్యా. వాళ్ళు సుఖంగా నిదుర పోతారాయె. వాళ్లకి కలలే రావాయె. కలలువస్తేకదా మేము వాళ్ళదగ్గరికి వెళ్లటం. నేను రెండు మూడు సార్లాలోచించాను. వాళ్ల కెవళ్లకైనా కలలో కనిపిద్దామని. వాళ్లు చక్కగా మాంసాలూ అవ్వీ తిని, చక్కగా తాగి పడుకుంటారు. వాళ్ళు త్రావిన ఉత్తమజాతి మద్యం వాళ్ళ కడుపులో ఉన్న మాంసంతో కుస్తీలు పడుతూ ఉంటుంది. వాళ్ళు హాయిగా నిద్రపోతూ ఉంటారు. నాకు వాళ్లదగ్గరికి వెళ్ళటంచేత కాలేదు. ఇంత ఆలోచించాను.

ఎవడో నీవంటి దౌర్భాగ్యుడి దగ్గరకు వస్తే తప్ప నేను నా ఆక్షేపణ జిల వద లించుకో లేనని తెలిసింది. నీదగ్గరకు వచ్చాను. సరే కాని తృతీయా విభక్తి నూడు by man అంటావా, by the man అంటావా అన్నాడు. నాకూ అను మానం వేసింది. దీని దుంప తెగ. ఈ ఇంగ్లీషు పాతిక ఏళ్ళు చదివాను. ఈ the ఎక్కడ వాడాలో నాకు తెలియటం లేదు. మా కాలెజీలో తేలికగా అరవైమంది లెక్చరర్లు ఉన్నారు ఇందులో నలుగు రైదుగురు తాము పెద్ద ఇంగ్లీషు పండితులమంటూ ఉంటారు. ఒకడు Fowler's dictionary చూచి వస్తాడు. ఇంకొక డదేమిదేమని Encyclopaedia యే చూచి వస్తాడు. వాళ్ళు కుస్తీలు పడుతుంటారు. అనేక పుస్తకాలు ఉన్నవి ఇంగ్లీషు తప్పులు లేకుండా ఎట్లా మాట్లాడాలి అన్న దాన్ని గురించి. ఈ పాఠ్య గ్రంథాలే చదువలేక చస్తుంటే అవెక్కడ చదువను? కాని ఈమధ్య ఈ దేశంలో ఇంటర్మీడియటు తప్పినవాళ్ళు ఉద్యోగాలు లెకుండా తిరుగుతూ ఆ పత్రికలకీ ఈ పత్రికలకీ లేఖ కులుగా ఉంటూ ఇంగ్లీషు భాషంతా వాళ్ళకే వచ్చినట్లు నటిస్తున్నారని వింటు న్నాను. వాళ్ళ కేమైనా ఈ the ఎక్కడ వాడాలో తెలుసు నేమో. తెలియదు. నేను విష్ణుశర్మతో ఎట్లా అయితే నేమండీ తృతీయా విభక్తికి by వెనక వేయాలి అన్నాను. ఆయన ఏంచేస్తాను. వేస్తాను అన్నాడు. అని నేను వేస్తాను సరే. నీ కొంపకుచేత వేయించే అప్పటికి నీటంగు తెగుతుంది సుమా! అన్నాడు. పదిసార్లు చెపితే వాడే వేస్తాడన్నాను. ఆయన టంగు తెగటమంటే పదిసార్లు చెప్పటమే నన్నాడు నేనన్నాను. "అయ్యా! మీతో వచ్చిన ఇబ్బంది ఏమి టంటే మీ కదివరకే వ్యాకరణం వచ్చు. సంస్కృతాంధ్ర వ్యాకరణములు మీకు తెలుసు. అందుచేత ఈ బాధ పడుతున్నారు. మీకు మల్లే తెలుగు వ్యాక రణం రాని పిల్లలకు by the man మనుష్యుని చేత, by the dog కుక్కచేత, by the cat, పిల్లిచేత, అని బట్టీ పెట్టించేస్తాము. వాడికి ఈ తృతీయా విభక్తి అనీ. ప్రకృతి అనీ, ప్రత్యయమనీ, ప్రాతిపదిక అనీ ఈ గోల లేదు తెలియవు. వాడికి ఇంగ్లీషు వచ్చేస్తుంది. అల్లా వస్తున్నది. ఇంతవరకూ కోట్లాది జనం ఎట్లా నేర్చుకున్నారు. వచ్చిన యిబ్బంది మీవంటి వాళ్ళతోనే వస్తుంది". అన్నాను. ఆయన అన్నాడు కదా 'బాబుకి పెళ్ళయిందని సంతోషించాడు కాని మెళ్లై కూర్చుండే సవితమ్మ వస్తుందని తెలియదట. బాబూ! నువ్వు ఎం ఏ. ప్యాసైనావని చెపుతున్నావు. నీకు ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము, మూడు భాషల్లో పాండిత్యం ఉన్నదని నీవనుకుంటున్నావు. by the man అనాలో by man అనాలో నీకు తెలియదు. నీకు వచ్చిన ఇంగ్లీషు ఇంత బాగాఉంది. సంస్కృతమూ తెలుగూ నీకెంత వచ్చునో మాకి నెల్లాళ్ళబట్టి తెలుస్తూనేఉంది. ఈ దేశంలో ఇంగ్లీషు వచ్చిన వాళ్ళందరూ ఇట్లాంటి వాళ్ళే నన్నమాట. కనీసం నూటికి తొంభై తొమ్మండుగురికి ఇంగ్లీషు రాదు, తెలుగూ రాదని అర్థం. ఎందు

చేతరాదంటే ఒక భాష మాతృభాష అయితే ఆభాష మాట్లాడేస్తూ ఉండటము
వల్ల భాషంతా. నోటికి వస్తుంది. తరువాత ఆభాషలో ఉన్న వ్యాకరణం
తెలుసు కుంటాము. వ్యాకరణం తెలియటంతోటే పండితుడని అర్థం. నువ్వు
నాలుగు వందల పుస్తకాలు చదివినా సరే. నీకు వ్యాకరణం తెలియకపోతే
నీవు అపండితుడవు. మీ రందరూ అపండితులు. నీ మాతృభాష వ్యాకరణంతో
సహా నీకు వచ్చిందనుకో. ఇతరమైన ఏభాషనైనా సరే సులభంగా నేర్చుకో
వచ్చు మీ ఇంగ్లీషు భాష నాల్గు నెలల్లో నేను చదువుతాను. ఇదుగో ఇల్లా
గేను. శబ్దములు తెలిసికొంటే భాషలో సగం వచ్చినట్లు. నామ వాచకములు,
సర్వ నామములు క్రియలు, కాలములు మొదలైన నన్నీ తెలుసు కుంటాము.
తరువాత అభ్యాసము చేత ధారాళంగా మాట్లాడటం వస్తుంది తప్ప భాష
వచ్చేసినట్లే. ఈ రీతిగా కొన్ని నెలలలో నేర్చుకో దగిన పరభాషని మీరు
ఇరవైఏళ్లు చదువు తుంటే వచ్చిన లాభ మేమి టంటే మీకు తల్లి భాషా రాదు.
అత్త భాషా రాదు. తెలిసిందా అన్నాడు. నే నేమనను? ఊరుకుంటే నామ
ర్యాద ఏమిటి? అన్నా కదా? "అయ్యా, ఇంగ్లీషు భాష పనికిరాదు. అనే వాళ్లు
మా దేశంలో చాలామంది ఉన్నారు. దాని కోసం పని పెట్టుకొని మీరు స్వర్గా
న్నుంచి దిగి రావలసిన అవసరం నాకు కనబడటంలేదు" అన్నాను. ఆయన
"ఇంగ్లీషు భాష పనికిరాదనటం కోసం రాలేదు నేను. ఇంద్రుడు నన్ను నేర్చు
కొని రమ్మన్నాడు. నాదగ్గర ఆయన నేర్చుకొంటాడట." అన్నాడు. అని
సరేలే. ఆ the ఉంటే ఉన్నది, లేకపోతే లేదు. విభక్తి ప్రత్యయాలన్నీ నామ
వాచకాలకి వెనక వస్తవన్నమాట. చతుర్థీ విభక్తి ఏమిటి? అన్నాడు. For
the sake of అని చెప్పాను. ఒక్కొక్కప్పుడు ఒక్క For వాడితేనే చాల
న్నాను. ఆయన for కి స్పెలింగు అడిగాడు. ఎఫ్, ఓ, ఆర్, అన్నాను. ఆయన
ఓ దీర్ఘా కారానికి కదయ్యా. ఇక్కడ హ్రస్వా కారానికి వచ్చిందే మన్నాడు.
నేను దీర్ఘాకారమైతే a వస్తుంది. Far ఫార్ అని చెప్పాను. మరిన్ని హ్రస్వా
కారానికి u కూడా వస్తుంది. Fur ఫర్. అంటే బొచ్చు. అన్నాను, సరే
ఆయన చతుర్థీ విభక్తి అదే. పంచమీ విభక్తో అన్నాడు. నాకు తోచ లేదు.
ఇందులో పంచమీ విభక్తి లేదన్నాను. ఎందుకు లేదన్నాడు. నాకు ఒకటి గుర్తొ
వచ్చింది, ప్రాకృత భాషలో లేదుకదా అన్నాను అంతే, జీవుడు మళ్ళీ మాట్లా
డితే ఒట్టు. అల్లా సమాధానాలు కుదరాలి, షష్ఠీ విభక్తి అడిగాడు. T,o టు
O,f. ఆఫ్. I,n. ఇన్ ఈ మూడు షష్ఠీ అన్నాను. సప్తమీ విభక్తి అడిగాడు
on ఆన్ అని చెప్పాను. ఆయన సంతృప్తి పడ్డాడు. పరవాలేదులే.
బాగానేఉంది మీభాష అన్నాడు. అని కాని నాయనా ఇందులో ఒక పేచీ
ఉంది. నాకు చెప్పటం తేలికే. మీ పిల్లలకి చెప్పటం కష్టం. ఎందుచేత
నంటే ఒకటిచూడు. వాళ్ళకి నీవు ఇంగ్లీషు చెపుతున్నావంటే వాళ్ళకి ఎప్పుడు

మొదలు పెడుతున్నావు. ఏ ఎనిమిదేళ్ళో వచ్చిన తరువాత కదా మొదలు పెడుతున్నావు. అప్పటివరకూ వాళ్ళు తెలుగులో మాట్లాడుతున్నారు. కనుక నీవు ఇంగ్లీషు మాటలకు అర్థాలు తెలుగులో చెప్పాలన్నమాట. వాక్యాల కర్థాలు కూడా తెలుగులో చెప్పాలి. వాళ్ళ మనస్సులిదివరకూ వాళ్లకి విభక్తి ప్రత్యయాలని తెలియక పోయినా నామవాచకం పైన ఈ విభక్తి ప్రత్యయాలు చేర్చట మనేది అలవాటై ఉన్నది. ఈ భాష దగ్గరకు వచ్చేటప్పటికి వెనక్కి మళ్ళవలసి వస్తున్నది. పసిపిల్లల కేం తెలుస్తుందయ్యా, పెద్దవాళ్ళయిన తరువాత అబ్బాయి! కుడివైపుకు తిరగరా అంటే తిరుగుతాడు. పసివాళ్ళకి కుడివైపు తిరగటమంటే తెలియదాయె. మనం వాళ్ళని పట్టుకొని తిప్పి నిలుచో పెట్టాలి. ఈ కష్టం వాడి మనస్సుకి కలుగుతుందన్న మాట. వాణ్ణి కుడిపైపుకి తిప్పి నిలుచో పెట్టాలంటే చేతితో పట్టుకొని తిప్పుతావు. వాడి మనస్సు చేతితో పట్టుకొని తిప్పేది కాదు కదా. ఇంక నీవు చేయగలిగిం దేమిటంటే తెలివి తక్కువ వెధవా అని వాణ్ణి రెండు చరుపులు చరుస్తావు. ఆ తెలివి తక్కువ ఆ వయస్సులో వాడికి ఆ చదువు చెప్పే నీది కాని వాడిది కాదు. ఇంక ఏమిటయ్యా అంటే ఏడేళ్ల మీదనో, ఎనిమిదేళ్ల మీదనో, పదేండ్ల మీదనో వాడు అట్లాగే అలవాటయి, వాడికి ఏ పదహారేండ్లో పద్దెనిమిదేండ్లో వచ్చేటప్పటికి అందరితో పాటు వాడూ ధోరణిగా మాట్లాడుతాడు. అంటే ఏమవుతోంది. పదేళ్ళు వాడి బుద్ధికి సరియైన శిక్షణ లేక పోతున్నది. నియమం లేక పోతున్నది. ఊరకే వింటూ ఉండగా అలవాటుకొద్దీ ఆభాష మాట్లాడటం చేతనవుతోంది తప్ప, ఇది యిదని తెలుసుకొని వాడు ప్రవర్తించటం లేదన్న మాట నేనున్నా ననుకో, నీవు ఈవిభక్తి ప్రత్యయాలు వెనుక వెయ్యాలని చెప్పావు. గుర్తుంచుకొంటాను. నాకు తెలిసి పోయింది. నీ కొడుకే ఉన్నాడు చూడు. వాడికి అయిదారేండ్ల మీద కాని ఇది అలవాటు కాదు. ఈ అయిదారేండ్లూ వాడికి తెలుగు చెప్పు. తెలుగు వ్యాకరణం చెప్పు. ఇది శబ్దము. ఇది ప్రత్యయము, ఇది ఇది అని వాడికి అప్పుడు బాగా తెలుస్తుంది. ఆభాషని ఒక్క సంవత్సరంలో నేర్చుకుంటాడు. ఇంట గెలిచి రచ్చ గెలువు మన్నారు. మీరు రచ్చ గెలుస్తామని పోతున్నారు. ఆరచ్చ మన దేశంలో లేదు. ఇంగ్లండులో ఉంది. అక్కడి కందరూ వెళ్లటంచేత కావటం లేదు. ఇంక గెలవట మేముంది. రెండుచోట్లా గెలువటంలేదు. నీ కింగ్లీషురాదు. తెలుగూరాదు" అన్నాడు. నేనన్నాను. "అయ్యా! నాకు అజీర్ణరోగం ఉన్నమాట నిజమే. ఈ రోజుల్లో నా ఒక్కడికే ఉందా. ఈ మరబియ్యం తింటూంటే అందరికీ ఉంటోంది. అన్నం తినటంతోనే స్కూలుకి పరుగెత్తుతున్నాను. నా కన్నం ఎట్లా అరుగుతుంది. అందుచేత నాకు కలలు వస్తవి. వస్తేమాత్రం ప్రతిరోజూ మీరు వచ్చి నా నెత్తిని కూర్చోవాలని ఉందా? ఎక్కడైనా కలలు వస్తే ఏ కలకి ఆ కలే.

మీ రట్లా కాదాయె. నిన్న కల ఎక్కడ వదలిపెట్టిందో అక్కడ వచ్చి కూర్చుంటున్నారాయె. నాకిట్లా కలలు వస్తున్నవని ఎవడితోనైనా చెప్పినా నమ్మటానికి వీలులేకుండా ఉన్నది. కనుక మహాప్రభూ! మీరు నాకల్లోకి రాకుండా ఉంటే మా చవరం ఆంజనేయస్వామికి వంద కొబ్బరికాయలు కొడతానన్నాను. ఆయన అన్నాడు కదా, ఓరి పిచ్చివాడా, తొందరపడి మొక్కుకోకూడదు వంద కొబ్బరికాయలంటే మజా అనుకున్నావా? కాయ ఐదణాలోయి, మొన్న కనుక్కువచ్చాను. వంద ఐదాణాలంటే ఎంత? ఐదు వందల అణాలు. రూపాయికి ఎన్ని అణాలు అన్నాడు. పదహారు అన్నాను. మరి చూశావా? పదహారుమూళ్లు నలభై ఎనిమిది. ముప్పయ్యొక్క రూపాయిల నాలుగణాలు అవుతుంది. డబ్బెక్కడ ఉందోయినీకు. కనుక నీవు ఈ మొక్కు ఈ కలలోనే చెల్లించివేయి. మా డబ్బు ఉందిగదా. మళ్ళీ మేలుకున్న తరువాత పెట్టుకున్నావా! ఈ నెల గడ్డితినవలసిందే నన్నాడు. ఆ మాట నిజమే ఈ మొక్కు కలలోనే తీర్చేసేయాలె. సరే, వాళ్ళిద్దరినీ వెంటబెట్టుకొని బజారు వెళ్ళి వంద కొబ్బరికాయలూ కొన్నాను, తిక్కన్న గారిచేత మోయిస్తే బాగుండదు. ఇక నేనూ విష్ణుశర్మ మోయాలి. ఈ గోలెందుకని ఒక రిక్షావాణ్ని మాటాడాను. వాడు కలలో రిక్షావాడు. నిజమైన రిక్షావాడుకాదు సుమండీ. ఉత్తుత్త రిక్షావాడుకదా. పావలాకి రావచ్చుకదా! వాడు రూపాయ అడిగాడు. స్వర్గానికి వెళ్ళినా వడియేకులు తప్పలేదని కలలో రిక్షా కట్టించినా బాడుగ ఎక్కువనే అనుకుంటూ కానీ! డబ్బు వాళ్ళదేకదా! అని ఆ మొక్కు చెల్లించివచ్చాను. ఇంటికి వచ్చాను. నా వెంబడివాళ్ళిద్దరూ వచ్చారు. బాబూ! పొండయ్యా అన్నాను. వాళ్ళు వెంటనే వస్తున్నారు. మరి దేవుడికి మొక్కు చెల్లించి ఏమిలాభం. నా కర్థం కాలే. నేను వాళ్ళతో అన్నాను. "అయ్యా! మీరే చూడండి. మీ పీడ నాకు వదిలే అందుకు నేను కొబ్బరికాయలు కొట్టాను. మీరు వదలటంలేదు. విష్ణుశర్మ మా డబ్బుతోనే కొట్టావు. అందుకని వదలడంలేదు అన్నాడు. అయితే మేలుకున్నతరువాత రేపు ప్రొద్దున నిజంగా కొడతా నన్నాను. విష్ణుశర్మ అన్నాడు, ఓయి పిచ్చివాడా! మేలుకొన్నతరువాత ఆ పనిచేశావా? ముప్ఫయిఐదు రూపాయలు ఖర్చు. అందుకనే ఇప్పుడు కొట్టించాను నీచేత, నువ్వు కొట్టినట్లూ అయింది. నీకు డబ్బూ ఖర్చుకాలేదు. నీకేం నష్టం అన్నాడు. నేను "మీరు నన్ను వదలిపెట్టండి మహాప్రభో!" అన్నాను. విష్ణుశర్మ అన్నాడు. అబ్బాయి! స్వప్నములయొక్క రహస్యం నీకు తెలియదు. మేము నిన్ను వదలిపెట్టక పోవటంకాదు. నీవే మమ్మల్ని వదలిపెట్టటంలేదు. అది నీ అంతరాంతరంలో నమోదు అయి ఉన్న విషయం. ఇది ఒక చివరకు తేలేవరకూ నీమనస్సు ఈ స్వప్నాలను తెచ్చుకుంటూనే

ఉంటుంది. నీ విట్లా మొక్కుకున్నావా నీ కేంనష్టం మా డబ్బు ఖర్చవుతోంది అన్నాడు. నేను ఇది తప్పే తద్దినం కాదనుకొని, సరే కానివ్వండి చదువేమిటో అన్నాను. అని మరి ఈ కాడికి నాచేత కొబ్బరికాయి లెందుకు కొట్టించారు అన్నాను. ఆయన నీకేం నష్టం అందులో కొంతపుణ్యం నీకు కూడా ఉంటుందిలే అన్నాడు. కలలో కొట్టిన కొబ్బరికాయలకు కూడా ఉంటుందా పుణ్యం అన్నాను. ఆయన మనస్సు ప్రధానమయ్యా అనేక జన్మలు కూడా స్వప్నములతో పోతయట అని మన పుస్తకాలలో వ్రాశారు. వాటిని మీ వాళ్ళు చెపుతూనే ఉన్నారుకదా! ఇదిగో చూడు, అక్టర్సు, అభినయం వాటినిగురించి చెపుతున్నప్పుడు మీ ఉపన్యాసాలిచ్చేవాళ్లు ఇల్లాంటి కథని ఒకటి చెపుతుంటారు. మిమ్మల్ని మీరే నమ్మలేరేమి అన్నాడు. సరే! అయిన తరువాత మళ్ళీ చదువు మొదలుపెట్టాము. ఆయన క్రియలు వాడటం, ఒక చిన్న వాక్యాలు చెప్పటం, నేర్పమన్నాడు. నిన్న I go అంటే పేచీపెట్టాడు కదా! దానిమీద సరే అది అనిశ్చితమైన వర్తమానార్థకం కదా. నిశ్చితం అయిన వర్తమానార్థకం చెప్పు అన్నాడు I am going అని చెప్పాను. ఆయన అంటే వెళ్లుచున్నాను అని అర్థమేకదా అన్నాడు. అవును అన్నాను. గో అంటే వెళ్ళుకదా. చున్నాను లోదేనికేది అన్నాడు. ing ఇంగు అనే చు. am అనేది ఉన్నాను. అన్నాను. అంటే నేనున్నాను వెళ్లుచు అనికుదురు కానే ఉంది. బాగానే ఉంది అన్నాడు. అని దీనిమీద నే నర్థాలు తీయటం మొదలు పెడితే నీ విబ్బందివస్తావు. ఆ బాధ నీకెందుకులే. వాడు వెళ్లుచున్నాడు. He am going అంతేకదా అన్నాడు. నేను అల్లాకాదు బాబూ! He is going అనవలె అన్నాను. ఎందుచేతనంటే am ఉన్నాను. is ఉన్నాడు. ఉన్నావు అంటే ఏమిటని అన్నాడు. నాకు వచ్చి వెలగకాయ నోట్లో పడ్డట్టయింది. ఏమి చెప్పను. Thou art going అని చెప్పాలి. చెపుతానను కో. అది వాడి చచ్చేమాట కాదాయె. అందుచేత you అనగా నీవు మీరు అని రెండింటికి అర్థమే. అది ఎప్పుడూ బహు వచనంగా వాడాలి. is కి బహువచనం are అందుచేత you are going అనాలి. you are going అంటే నీవు వెళ్లుచున్నావని ఏకవచనమునకూ అర్థమే. మీరు వెళ్ళుచున్నారన్న బహువచనానికీ అర్థమే. అని చెప్పాను. ఆయన ఇదేమిటయ్యా ఉత్తమ పురుషకు am అన్నావు. ప్రథమ పురుషకూ is అన్నావు. మధ్యమ పురుషకు ఇంకొకటి ఉండవద్దా అన్నాడు. ఏమి లేకపోతే అన్నాను. ఆయన ఇందులో ఇదొకతెలివా? అన్నాడు. ఏమిటయ్యా? అన్నాను. I కర్త. కర్తని వదలిపెట్టి am going అన్నాము. పోవుచున్నానని అర్థం వచ్చింది. అట్లాగే ప్రథమ పురుషకికూడా is going అనటంతోటే వాడు వెళ్ళుతున్నాడనే అర్థం వచ్చేస్తుంది. అల్లా మధ్యమ పురుషకేదీ అన్నాడు. నేనన్నాను. అయ్యా ఇక్కడ ఆ పప్పు ఉడ

శవు. ఎప్పుడూ కర్త ఉండి తీరాలసిందే. అందుచేత ఎట్లాఉన్నా పరవా లేదు అన్నాను. ఆయన అన్నాడు, ఎప్పుడూ కర్త ఉండేటట్లయితే am ఎందుకు? I ఉండనే ఉంది కదా? Is సరిపోతుంది అన్నాడు. I is going I ఉండనే ఉంది. ఇంకా am ఎందుకు అన్నాడు. నేనేం చేయను. ఈ ఇంగ్లీషు భాష ఎంతో సమర్థమైన భాష. మన భాషకంటె ఎంతో శక్తిమంతమైన భాష అని అందరూ అంటూఉంటే నేనిన్నాళ్లూ నిజమే అనుకుంటూ ఉన్నాను. అరే ఇంతింత చిన్న విషయాలలో కూడా ఈ భాషలో ఇన్ని లోపాలున్న వేమిట్రా! నాకే తెలియకపోతే చిన్నపిల్లల కేమి తెలుస్తవి. ఊరకే గుడ్డెద్దు చేలో పడ్డట్టు చదువుక పోతున్నాము. నాకింకో టనిపించింది. ఇదంతా కలలో గనక సరిపోయింది. ఓయి బాబోయి, నిజంగా మేలుకొని ఉండగానే నాకీ ఊహాలన్నీ వస్తే, నేను నలుగురితో చెపితే నా ఉద్యోగం ఉంటుందో ఉండదో. పైగా నన్ను పత్రికల్లో తిడుతూ వ్రాసే వాళ్ళేమో! అని భయపడ్డాను. కాని పరమేశ్వరుడి అనుగ్రహం వల్లా, అనుగ్రహం అనటంకంటె మనదేశదృష్ట్యా ఆగ్రహం వల్ల అనటం బాగుంటుంది— ఇదంతా కలలో జరగటం చాలా మేలిచ్చింది. విష్ణుశర్మ అన్నాడు సరే! are అన్నది బహువచనమా! is కి బహువచనం are అన్నమాట. am కి బహువచన మేమిటి? అన్నాడు. దానికీ are ఏ అన్నాను. ఆయన నోరు తెరచి నాలుకతో దంతాల లోపల రాయటం మొదలు పెట్టాడు, చిత్రంగా చూస్తూ.



# తొమ్మిదవ అధ్యాయము

ఈకలలే చమత్కారంగా వున్నవి. ఒక్కొక్కప్పుడు కల వస్తూ వున్నదని తెలుస్తుంది. సామాన్యంగా మెలకువ వచ్చేవరకూ కల అని తెలియదు. ఒక్కొక్కప్పుడు కల జరుగుతూ వుండగా ఇది కల అనిపిస్తూ వుంటుంది. అందులోనే ఇది కల కాదు మేలుకొనే వున్నాము అనిపిస్తుంది. ఇన్ని పేచీతో కూడిన ఈ కలలయొక్క లక్షణం ఇదమిత్థమని చెప్పటానికి వీలు లేకుండా వున్నది. ఒకరోజున కల మొదలుపెడుతోంది అనుకుంటూవున్నాను. ఇద్దరూ కూర్చున్నారు. విష్ణుశర్మ తాంబూలం నములుతున్నాడు. నాకు వక్క-వేసుకోవటంకూడ అలవాటులేదు. తమలపాకులూ పోకచెక్కలనేవి మనింట్లో వుండవు. మా నాయనగారి తద్దినానికి మాత్రం అవి తీసుకస్తాను. మొదట రోజుల్లో రెండుమూడు తద్దినాలకి తమలపాకుల బీడాలు తీసుకవచ్చి ఇచ్చాను. ఆ బ్రాహ్మల కేముంది. వాళ్ళకి కావలసింది సంభావన. అది రొండిన పెట్టుకొని బీడా జమాయించి వెళ్ళారు. అబ్దికానికి మా మేనమామ వచ్చాడు. ఈ బీడా లివ్వటం చూచాడు. ఆయన కోపపడ్డాడు. 'అప్రాచ్యుడా! వెధవపనులూ నువ్వూను. తండ్రి తద్దినం పెట్టి బీడాలిస్తావా. ఎం. ఏ. ప్యాసైనాడివి. ఏడవక పోయినావా? ఎవడు చెప్పాడురా నీకు' అన్నాడు అప్పటినుంచీ ఒక అర్థణా పోకచెక్కలూ, తమలపాకులూ తీసుకవచ్చి మా తల్లితండ్రుల ఇద్దరి తద్దినాలకి ఇస్తాను. అటువంటప్పుడు వీళ్ళిద్దరికి నేను తమలపాకు లిస్తానా? ఈ విష్ణుశర్మ తాంబూలం జమాయిస్తున్నాడు. ఎక్కడిదిరా బాబూ అనుకున్నాను. ఎక్కడికైనా బ్రాహ్మణార్థం వెళ్ళాడేమో! మన కెందుకులే అనుకున్నాను. ఇంతలో నాకో సంగతి జ్ఞాపకం వచ్చింది. మా నాయనగారి అబ్దీకం ఇంకో నెల్లాళ్ళలో వుంది. అంతవరకూ వీళ్ళుంటే కొంత కలసివచ్చేటట్టుంది. వీళ్ళు మనింట్లో ఎట్లాగూ తింటూనే వున్నారాయె. ఇద్దరి చేతుల్లోనూ తలాకాసిని నీళ్లుపోస్తే అబ్దికమయ్యి వూరుకుంటుంది. అదట్లావుంచి విష్ణుశర్మ బాగానే కూర్చున్నాడు. తిక్కన్నగారు మాత్రం ఏదో కోపంవచ్చిన వాడికిమల్లే కూర్చున్నాడు. నా కర్థంకాలే. ఏమండీ తిక్కన్నగారూ అల్లా కూర్చున్నారేమీ అన్నాను. ఎల్లా కూర్చున్నానేమిటి అన్నాడు. నేను విష్ణుశర్మ చూడండి. దర్జాగా తాంబూల సేవనం చేస్తున్నాడు. మీరేదో మొఖం ముడకటించుక కూర్చున్నారు. ఆయన ఎక్కడికైనా బ్రాహ్మణార్థానికి వేంచేశాడేమో. తమరు కూడ వెళ్ళక పోయినారా, మీకుగూడా మంచి బీడా దొరికేది అన్నాను.

అంతలో విష్ణుశర్మ అన్నాడు "అల్లా అనకయ్యోయ్ కొత్తగా ఒక తగాదా పుట్టింది. ఇక్కడికి వచ్చిన కొత్తరోజుల్లో అయితే నాతో బ్రాహ్మణార్థానికి వచ్చేవాడేమో! ఇప్పుడు రాడు. మేము ఈ వూళ్ళో అక్కడికి ఇక్కడికి వెళ్ళి వస్తున్నాము. చాలామంది ఇళ్ళకు వెళ్ళాము. మాకో కొత్త విషయం తెలిసింది. నేనువైదీకినట. ఆయననియోగిఅట. ఇంతకూ నువ్వు వైదికివా నియోగివా అనిఅడిగాడు. నేనునియోగినే అన్నాను. అంటేతిక్కన్న "అయితేమరి వాళ్ళందరూ నీవు వైదికి వన్నారేమి" అని అడిగాడు. నేను "మతి భ్రష్టులు వాళ్ళతో ఏమిటి ? నేను నియోగినే" అన్నాను. విష్ణుశర్మ "అయితే మీరిద్దరూ నియోగులా, నే నొక్కడినీ వైదికివా" అన్నాడు. నేను "ఔను. నీవు బ్రాహ్మణార్థానికి వెళ్ళావుకదా! నియోగులు వెళ్ళరు. నేను వెళ్ళను. తిక్కన్నగారు వెళ్ళలేదు. అంతే" అన్నాను. తిక్కన్న "అదికాదయ్యా వైదీకులంటే బ్రాహ్మణార్థానికి వెళ్ళటమేనంటావా" అన్నాడు. నేను తిక్కన్నని 'అయ్యా! మీరు వైదీకులా, నియోగులా" అన్నాను. తిక్కన అన్నాడుకదా "ఈ నియోగి ఏమిటోయి నాకర్థం కావటంలేదు. నేను వైదికుడను. "వైదికధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వము కొల్తు నభీష్టసిద్ధికై" అన్నానాయె. ఏమిటో ఈ వూళ్లో అందరూ నన్ను మనం నియోగులం. మీరు వాళ్ళింటికి వెళ్ళారేమిటి అని దుయ్యబట్టు కొంటున్నారోయి. రేపు వాళ్లతో చెపుతానుండు. అతను వైదీకి కాడు నియోగేనని" అన్నాడు. అంటే నేవన్నాను "ఆం అన్నీ చెప్పారులెండి" అని. ఆయన ఏమట్లా అంటున్నావు అన్నాడు. నేను "వాళ్ళందరూ మిమ్మల్ని నియోగి అంటుంటే కాదు నేను వైదీకిని అనే మగతనం మీదగ్గర లేదుకదా. నా విషయంలో ఎట్లావస్తుంది" అన్నాను. తిక్కన్న అన్నాడు "పోనీయవోయి వెధవగోల. ఈ నియోగులూ వైదికులూ ఏమిటి. ఈ వూళ్ళో బ్రాహ్మల్లో ఈ ద్వేషాలేమిటి" అన్నాడు. నేను ఈ వూళ్ళోకాదు మహాప్రభూ! ఈ ఉత్తర సర్కారుల్లో అనండి అన్నాను. తిక్కన్న ఆ మొహం ముడుచుకోవటం మానే. కాడు, మానేసి అన్నాడుకదా. 'అబ్బాయి', నిజంగా నాకు కోపంవచ్చింది. ఎందుచేతనంటె నీవు ఎంతసేపటికీ ఆ విష్ణుశర్మకి చదువుచెప్పటమే ప్రధానంగా చూస్తున్నావుకాని నావిషయం ఏమన్నా ఆలోచించావా అన్నాడు. నేను 'బాబూ', కాలేజీలోకి తీసుకవెళ్ళితిని. మీరు ఒకటనగా ఒకటేపద్యం చదివారు. ఆ చదవటం ఏమిటో కొంత నెల్లూరివైపు చదవటంగా ఉంది. మరికొంత ఏడువందల యేండ్లక్రింద మేళంగాఉంది. మీ ఉచ్చారణే మావాళ్ళకి తెలియలేదు. మీ సంగీతం మావాళ్ళ కసలర్థం కాలేదు. మేము మీరు భారతంలో వ్రాసిన తెలుగే ఇవ్వాళ వాడుతున్నాము. అయినా మీరు మాట్లాడుతుంటే ఆ పద్యం చదువుతూ ఉంటే ఏదో క్రొత్తగాఉంది. మిమ్మల్ని తీసుకువెళ్ళి నేను పురమందిరంలో కాని, పుస్తక భాండాగారంలో కాని ఉపన్యాసంపెట్టిస్తే నా

పేరువు దక్కుతుందో దక్కదో తెలియకుండా ఉన్నది. అయిసాత్రిప్యాళ పురమందీ రంలో మీ ఉపన్యాసం పెట్టించాను. మనం బయలుదేరి వెళ్ళు తున్నాము. మీరు డ్రెస్ వేసుకోండి అన్నాను. విష్ణుశర్మ కదలలే. నేను "ఏమయ్యా బయలు దేరవేమి?" అన్నాను. ఆయన "నాతో ఎందుకు?" అన్నాడు. నేను కాదుబాబూ! రండి అన్నాను. ఆయన "అబ్బాయి, నీ సంగతి నాకు తెలుసు. అక్కడికి వెళ్ళిన తరువాత ఆయన fail అవుతాడు. నన్ను నీవు మృగాల కూతలు కూయమంటావు. మంగళహారతి పళ్ళెం పడతావు. మళ్ళీ నియోగి నంటావు, అన్నాడు. నేను నువ్వెక్కడ పట్టావురా బాబూ నాకు నిన్ను జంతువుల కూతలు కూయమనను అన్నాను. అంటే ఆయన నువ్వు కూయమనే దేమిటోయి, ఆ సభలోవాళ్ళే కూయమంటారు. వాళ్ళు ఈ తిక్కన్నని ఉపన్యాసా లివ్వనిస్తారా పెట్టనిస్తారా. కూర్చో కూర్చో అని కేకలు వేస్తారు. నన్ను "కూయి కూయి" అని అరుస్తారు. అన్నాడు. నే నాశ్చర్యపోయి ఇదంతా నీ కెట్లా తెలుసు బాబూ! అన్నాను. ఆయన నాయనా! నీ యింట్లో ఊరకే తింటూ కూర్చున్నా మనుకున్నావా! మాకు వీలైనప్పుడల్లా ప్రపంచక జ్ఞానాన్ని గడించు కుంటూనే ఉన్నాము. మొన్న ఏదో నాటక మాడుతున్నారంటే చూడ బోయినాము. పాండవ విజయం నాటక మట. అందులో నారదుడు వచ్చాడెందుకో. ఎందుకయ్యా తిక్కన్నా అన్నాడు. తిక్కన్న నాకూ తెలియదు. నేను నాటకం రాయలేదు గదా అన్నాడు. విష్ణుశర్మ "నువ్వు రాయలేదులే. వ్యాసుడి భారతంలో ఎప్పుడన్నా నారదుడు వచ్చాడా" అన్నాడు. తిక్కన "ఏమోనయ్యా కృష్ణరాయబార ఘట్టంలో ఏమన్నా వచ్చాడేమో. అప్పుడు చాలా మంది ఋషులు వచ్చినట్లున్నారు" అన్నాడు. విష్ణుశర్మ పోనియ్యి. వచ్చాడు. వచ్చి పాపం ఆ మానవుడు (అంటే తిక్కన్న అదేమిటయ్యా దేవర్షిని మానవు డంటావు అన్నాడు. అంటే విష్ణుశర్మ 'వట్టి మానవుడా మనం వెళ్ళాం చూడు. అదేదో కోటలో గోడలమీద బొమ్మలు చూచాం. అందులో వాడెవడో నయ్యా తెల్ల సిపాయీ అట, వాడి మీసాలు చివర ఒక నాలుగంగుళాల పొడుగులాగి దానికి తుమ్మబంక పెట్టాడు. అల్లా ఉందయ్యా ఈ నారదుని జుట్టు, వాడు దేవర్షి ఏమిటి?) వాడు పూర్వ మెప్పుడో మాకు తెలియదు. ఏదో గిర గిరా తిప్పితే తిరుగుతుందట. అది పాడుతుందట. దాన్ని వీడు పాడించాడట ఇదివరకు. సభ సభంతా (ఆయన సభ అంటూంటే తిక్కన్న అన్నాడు కదా. ఇదుగోనోయి విష్ణుశర్మా నిన్ను వాళ్ళందరూ వైదికి అంటే నే నెందు కూరకున్నా ననుకుంటున్నావు. దాన్ని సభ అంటా వేమిటి? మళ్ళీ ఇంగ్లీషు చదువుతున్నా నంటావు. దాన్ని 'ఆడియన్సు' అనాలి. ఆయన్ని కనుక్కొని ఆ మాటకి స్పెల్లింగేమిటో తెలుసుకో. ఆయన ఏమతరాలు చెప్తాడో నాకు తెలియదు. కాని ఈ శబ్దానికి మొదట

దీర్ఘాకార మున్నది. అడుగు ఏమంటాడో అన్నాడు.) నేను ఐ, ఔ, ఈ రెండక్షరాలు మొదట ఉన్నాయి అన్నాను. తిక్కన్న 'అవు'నన్నాడు. విష్ణుశర్మ నవ్వటం మొదలు పెట్టాడు. నాకు తెలియలే, కొంత సేపటికి ఎందుకయ్యా నవ్వుతా వన్నాను. ఆయనన్నాడు, 'ఔ' కదయ్యా ఐ, అ, u, ఉ. ఇదయ్యా తిక్కన్నన్నట. ఐu 'అవు' అవుతుంది కాని 'ఆ' కాదంటున్నాడు అన్నాడు. వీళ్ళ తస్సాగొయ్యా. వీళ్ళతో వేగేదెట్లాగ? ఇంత చమత్కారం ఎల్లాగ. అవునంటే నేనేదో తెలుగు మాటనుకున్నాను. ఈ పూర్వకవుల కవిత్వాలు తెలియక పోవటాని కిదే హేతువు. వీళ్ళ వెనుక ఓహ్! అర్థాల్ని పెట్టుక చస్తారు. అనుకున్నాను. మళ్ళీ విష్ణుశర్మ అన్నాడు. "ఆ ఆడియన్సు ఆ నారదుడి వేషం వేసిన వాడిని, పాపం అతడు దుర్యోధనునితో ఏదో చెపుతా మనుకున్నాడు. వాళ్ళు చెప్పనివ్వందే. ఆ పాట పాడమంటూ మొదలు పెట్టారు. పాడాడు జీవుడు. పాడకపోతే చస్తాడా? వాడైనా నేనైనా వాళ్ళు పాడమంటే పాడక పోతే, వాళ్ళు కూయమంటే కూయకపోతే స్వర్గలోకానికి వెళ్ళవలసిందే అబ్బాయి! నాకిక్కడింకా చాలా పనిఉంది. నేను వెంటనే స్వర్గలోకానికి వెళ్ళటానికి రెడీగాలేను. అందుచేత నేను సభకు రాను" అని ఖండితంగా చెప్పాడు. తిక్కన్న అన్నాడు, "రావయ్యా! విష్ణుశర్మా ఫరవాలేదు. ఈ సారి నీ కూతలని పట్టి డబ్బు సంపాదించడులే. టికట్లిదివరకే అమ్మాడు" అన్నాడు. నేను "ఓరి బాబోయి, ఈ రోగం తిక్కన్నకి కూడా పుట్టిందే అనుకున్నాను. సరే. నేనూ తిక్కన్న బయలుదేరాము. మా సందు చివర మేం వెనక్కి తిరిగి చూసేటప్పటికి ఆయన వస్తున్నాడు. ఎల్లా వస్తున్నాడో తెలుసునా! పెద్ద సంతర్పణ లైతే గుండిగతో పులుసు కాస్తారనుకోండి. ఆ గుండిగంతా మసి అవుతుంది. దాన్ని రెండువైపులా పట్టుకొని అటూ ఇటూ తిప్పుతూ తోసుక వెళుతుంటారు, అట్లా వస్తున్నాడు. మే మిద్దరమూ నవ్వుకున్నాము. ఎట్లాగయితేనేమి? మీటింగుకి వెళ్ళాము. నేను టికట్లమ్మాను. అయిదు రూపాయలూ, పదిరూపాయలూ అమ్మాను. మహారాజ పోషకులూ, పోషకులూ, అభిమానులూ అని మూడు తరగతులు పెట్టాను. మహారాజ పోషకు లంటే వేయి నూట పదార్లివ్వాలి. రాజ పోషకులంటే నూట పదార్లివ్వాలి. అభిమానులు పాతికకి తక్కువ కాకుండా ఎంత ఇచ్చినా సరే. మీరు నవ్వుండి నవ్వుకపోండి. పదివేలు వసూలు చేసాను. ఎందుకురా మహారాజ పోషకులు అంటారు మీరు. మీటింగుకి మహారాజ పోషకు లేమిటంటారు? నేనంటాను. కొందరు గ్రంథమాలలు పెడుతున్నారు. ఆ పేరుతో ఇల్లా సంపాదిస్తున్నారు. సంపాదించటం కాదనుకోండి. ఎవడు వాళ్ళయం దభిమానం కలవాడు ఒకడు మహారాజ పోషకుడవుతాడు. అట్లాగే నాకూను తిక్కన్నగారి పేరు మూలంగా అయిదు

గురు మహారాజ పోషకులని సంపాదించాను నేను. ఏమి చెప్పానో తెలుసునా, తెలుగు భారతంలో రహస్యాలన్నీ తిక్కన్నగారు నాకు చెప్పేశారు. తిక్కన్న గారి స్వంతవ్యాఖ్యానంతో పదిహేను పర్వాలు నేను తిరిగి అచ్చు వేయించబోతు న్నానని చెప్పాను. ఈ మహారాజ పోషకులూ, పోషకులు, అభిమానులువీళ్ళందరి "పేర్లు మొదట అచ్చు వేయిస్తానని అన్నాను. యావదస్థి మనుష్యాణాం గంగా తోయేషు తిష్ఠతి అన్నారు కదా. గంగ నీళ్ళల్లో ఎన్నాళ్ళు మనుష్యుని బొమికక ఉంటుందో అన్నాళ్లు స్వర్గ లోకంలో ఉంటాడు. అని చెప్పాను. వాళ్లు ఒప్పుకున్నారు. మరిదేమిటయ్యా. వాళ్లు మహారాజ పోషకులేమిటి? వాళ్ళపేరు ఆపుస్తకంలో ఉండటం మనుష్యుని బొమిక గంగ నీళ్ళల్లో ఉండటం వంటిదా? అని మీరడుగుతారేమో. సరిగా నా ఉద్దేశ మదే. వాళ్ళపేరు ఆపుస్తకంలో బొమికల్లో ఉంటుంది. అంతకన్న ఏం చేస్తుంది. వాళ్ళకి నేనీ అర్థం చెప్పలేదనుకోండి. శ్లోకం మాత్రం వదిలాను. అదంతా అట్లా ఉంచండి. ఎందుకు చెప్పానంటే వచ్చిన వాళ్ళందరూ పెద్ద మనుష్యులు, వెధవ కోతిమూక కాదు. వాళ్ళ కిష్టం లేకపోతే లేచిపోతారు. లేకపోతే ప్రక్కవాడితో ఏదో నెమ్మదిగా అంటారు. అంతకన్న అల్లరి ఉండదు. వది మాటలెందుకు: సభ దివ్యంగా జరిగింది. తిక్కన్న గారు మూడు గంటల సేపు మాటాడారు. **Pin drop silence.** కాని,ఒక్కటే ఏమిటంటే ఉపన్యాసం చివరకు వచ్చేటప్పటికి ఊళ్ళోఉన్న ఐదారు స్కూళ్ళల్లోని తెలుగు మాస్టర్లు తప్ప ఇంకెవ్వడూ లేడు. అయితే మనకేం నష్టం. ఇంటికి వచ్చాము. తిక్కన్నగారన్నాడు కదా! సరే నచ్చాయి. నేను వ్రాసిన పదిహేను పర్వాల మీదా నీకు వ్యాఖ్యానం చెపుతాను. ఆ వ్యాఖ్యానంతో భారతం అచ్చు వేయి. నేను నీకు కలలో కనిపించి నందుకు చారితార్థ్యం కలుగుతుంది" అన్నాడు. నేను ఈయన దగ్గర వ్యాఖ్యానం వింటూ కూచోనా?. ఈయన అక్షర అక్షరానికి నేనీమాట ఎందుకు వేశాను. నేను ఈ అన్వయం ఎందుకు ఇల్లా మలిచాను. ఇక్కడ ఈ చమత్కారం చేశాను. ఇవన్నీ ఈయన చెపుతాడు. నే నివన్నీ రాస్తాను. చివర కదెన్ని పేజీ లవుతుందో. కాధని ఇంకా అయిదారు ఊళ్ళల్లో ఇంకో పాతిక వేలు ప్రోగుచేసినా ఆ డబ్బంతా ఈ వ్యాఖ్యానంతో సహా భారతం అచ్చేసే అందుకే సరిపోతుంది. ఇక ఆ పుస్తకాలు పుచ్చుకొని అయ్యా ఇవ్వి ఆరు సంపుటాలు. ఒక్కొక్క సంపుటం ఇరవై రూపాయలు. మీ లైబ్రరీ చేత కొనిపించండి— మీ కాలేజీ చేత కొనిపించండి— ఈ యాచనగా తిరగాలి. ఈ బాధంతా ఎవడు పడతాడు. డబ్బు వసూలు చేస్తే చేస్తామనుకోండి. అచ్చువేయవలసిన బాధ్యత మనకేమీ లేదు. అంతగా కాదంటే ఒక సంపుటం వేస్తాము సరిపోతుంది. కాని ఈయన దగ్గర కూర్చుని ఇవన్నీ ఎవడు చదువు కొంటాడు. తరువాత నేను అపుస్తకాలు అచ్చు వేయి

ప్రాను వేయించను. ఈయన కేం తెలుస్తుంది. సరే నని ఊ అన్నాను. నేనన్నాను కదా అని ఆయన ఆరోజున పాఠం చెపుతాను కూర్చో అన్నాడు. చచ్చాములురా బాబూ! అనుకొని అయ్యా, అయ్యా, అప్పుడే కాదు. ఎందుచేతనంటే ఇంకా కొన్ని పెద్ద పెద్ద ఊళ్ళున్నవి. అక్కడకు వెళ్ళి మిమ్మల్ని చూపించాలి. అనాదిలో మీది గుంటూరు కదా. మొట్ట మొదట అక్కడికి వెళదాము. తరువాత మీ నెల్లూరు వెళదాము. తరువాత రాజమహేంద్రవరము వెళదాము. చివరికి విశ్వవిద్యాలయానికి వెళ్ళి రావాలి తప్పదు అన్నాను. ఆయన సరే నన్నాడు. గుంటూరు వెళ్ళాము. అక్కడ ఎవళ్లకీ పూర్వం తిక్కన్న ఆవూళ్ళో ఉండేవాడని తెలియనే తెలియదు, ఎన్ని ఇండ్లకని పోయి నేను చెప్పను. విసుగెత్తి కాగితా లచ్చువేయించి పంచిపెట్టాను. ఆఊళ్ళో కాలేజీలో హాల్లో సభ పెట్టాము. ఆఊళ్ళో ఒక చిన్న పేచీ పుట్టింది. ఆహాల్లోదో ఇంకెక్కడిదన్నానో ఒక రంగులతో వేసిన పెద్ద తిక్కన్న బొమ్మని తీసుకవచ్చారు. తిక్కన్న బొమ్మ వేస్తే నూటపదార్లిస్తా మన్నారట. ఆ బొమ్మకా నూటపదార్లు వచ్చినవి. ఆ బొమ్మను తీసుకవచ్చి ఎదురుగుండా పెట్టారు. ఆ బొమ్మవలె ఈ తిక్కన్న లేడు. అని వాళ్ళంటారు. నేనన్నాను కదా, తిక్కన్న వలె ఆబొమ్మ లేదయ్యా, అన్నాను. వాళ్ళు ఒప్పుకోలేదు. ఆ బొమ్మవలె తిక్కన్న లేడంటారు. వచ్చిన ఇబ్బంది ఎక్కడున్నదంటే ఆ బొమ్మ వ్రాసినాయన మళ్ళీ తిరిగి నూటపదార్లు ఇచ్చివేయవలసి వస్తుందేమోనని భయం. క్రమంగా ఇది పెద్ద తగాదా అయింది. దెబ్బలాటకిందికి వచ్చే అట్టుంది. ఉన్నదుండగా ఉయ్యూరు మీద మేడూరు పడ్డదని నేను మాట్లాడకుండా తిక్కన్న గారిని గోకాను. అదృష్టం కొద్ది విష్ణుశర్మని గుంటూరు తీసుకెళ్ళలేదు. మేమిద్దరం నెమ్మదిగా అలాగా ఆవెనక రోడ్డు వెంటపడి రైలుస్టేషనుకి వచ్చాము అదృష్టం కొద్దీ రైలు ప్లాటుఫారం మీదే ఉంది. ఎక్కాము. రైలు కదిలింది. రైల్లోనుంచి తొంగి చూస్తే వెనుకనుంచి వస్తున్నారు కొన్ని వందలమంది. 'దొంగ తిక్కన్నను నరకండి. కృతక తిక్కన్నకూ అవజై' ఇల్లా ఉంది మోత. నాకు గుండెల్లో గుబుకు గుబుకు మంటోంది. ఒక్కొక్కప్పుడు ఈ రైలింజనులూ బయలుదేరినట్లే బయలుదేరి టుస్సుమని ఆవిరి వదలిపెట్టి ఆగి ఊరుకుంటవి. అల్లా జరిగిందా ఇవ్వాళ ఆయింజన్ డ్రైవరికి రెండో బ్రహ్మహత్యా పాతకాలు కట్టుకొన్నవే. కాని జరగలేదు. ఇంటికి చేరాము. వస్తూ ఆలోచించాము. ఇది ఒక అదృష్టమేరా. నెల్లూరు వెళ్ళవలసినా రాజమండ్రి వెళ్ళవలసినా గుంటూరు మీదుగా వెళ్ళక్కరలేదు. అమ్మయ్య అనుకొన్నాను. కాని మీరాశ్చర్య పోతారు. గుంటూరిలో వదలిపెట్టానా ఇద్దరు ముగ్గురిని మహా పోషకులనుగా చేర్చాను. ఈ సంగతి తిక్కన్నతో చెప్పి 'నేను నియోగినా వైదికినా' చెప్పవయ్యా అన్నాను. ఆయనే ఒప్పుకున్నాడు. ఓరిబాబోయి, నీవు

నాకన్న గొప్ప నియోగివని. సరిపోయిందా? వ్రాసి ఇమ్మన్నాను. ఎప్పటికైనా ఉద్యోగానికి అక్కరకు వస్తుంది. కాదయ్యా. రేపాయన భారతమే ప్రథమ సంపుటం అచ్చువేయిస్తాను. అందులో ఆయన దస్తూరి నమోజు అయి ఉంటుంది కదా. దానికి బ్లాక్ చేయిస్తాను. అప్పుడు ఈయన తిక్కన్న కాదని ఎట్లా అంటారో చూస్తాను. అదే దస్తూరీ, దస్కతు ఉంటూ ఉంటే. దీని కన్న బొమ్మ ఎక్కువ సాక్ష్యమేమిటి? ఎవడైనా . మరీ ఎదిరించాడా? ఆ బొమ్మలో తిక్కన్నచేత దస్కతు చేయించుకు రావోయి అంటాను. చేయించుకురా. రెండూ tally చేద్దాము, మీ దస్కతు కూడా మా దస్కతు మల్లే ఉంటే మీ బొమ్మ తిక్కన్నదే అని ఒప్పుకుంటాను అంటా. ఆయనని నెల్లూరు పోదాం రమ్మన్నాను. ఆయన ఓరిబాబూ! చాలులేరా నాయనా, గుంటూరులో చావు తప్పి కన్ను లొట్టపోయి బయట పడ్డాను. ఆ నెల్లూరులో ఏమవుతుందో అంత కన్న నువ్వొకనీసం నాఅవతారికఅయినాపాఠంచదువుకోవోయి అన్నాడు. నేనన్నాను. "ఓకవి బ్రహ్మా? మీకు నెల్లూరి సంగతి తెలియదు. అక్కడ మనకు బ్రహ్మరథం పడతారు. నామాట వినండి" అని బతిమాలి బామాలి చివరికి ఒప్పించి ఒక రోజున నెల్లూరు బయలుదేరాము. తత్పూర్వము పత్రికల్లో ప్రకటన చేశాను. స్వర్గాన్నించి తిక్కన్నగారు వచ్చారు. ఫలానా రోజున నెల్లూరును దర్శించ బోతున్నారు అని. స్టేషనులో మా రైలాగింది. ప్లాటుఫారం కిట కిట లాడిపోతున్నది. పాపం! వాళ్ళందరూ తిక్కన్నగారు ఫస్టు క్లాసులో దిగుతా రనుకొన్నారు. మేం థర్డు క్లాసులో దిగాము. అందుచేత నేనే తిక్కన్నగారు ఇక్కడ ఉన్నారు ఇక్కడ ఉన్నారని అరవవలసి వచ్చింది. ఆయన మెడలో దండలు వేశారు. ఎన్ని వేశారంటే ఆయన మొహం కనబడటంలేదు. నేను సంతోషించాను. చాలా సంతోషించాను. ఎందు కంటె ఒక వేళ ఎవరైనా ఈ ఊళ్ళో పూర్వం తిక్కన్న బ్రతికున్నప్పుడు ఆయనను చూచినవాడున్నాడేమో. తీరా ఈయనను చూచి ఈయన తిక్కన్న కాదంటే చచ్చిందే గొడ్డు. మేము ఆయనని నడిపించుకొని తీసుకవెళ్ళి మోటారు కారులో కూర్చోబెట్టాము. ఇంక వూరేగింపు సాగింది. ఫస్టుక్లాసు సన్నాయి మేళం. పదిమాట లెందుకు? అవూళ్ళోఉన్న మహమ్మదీయులు కూడా ప్రొసెషన్ వెడుతుంటే ముందర నడుస్తూ 'కవిబ్రహ్మకూ జయ్. ఉభయ కవిమిత్రకూ జై—సర్వాంధ్ర భారత రచయితకూ జయ్. తెలుగు పలుకుబడికి జై' ఇల్లాఅరవటం మొదలు పెట్టారు. సభలోకి వెళ్ళాము. తిక్కన్నగారి కొక పెద్దకుర్చీ వేశారు కూర్చోబెట్టారు. ఆఊళ్ళో తిక్కన్న గారంటే ఇంత గౌరవమని చెప్పటానికి వీలులేని ధనవంతులున్నారు. వారందరూ రంగస్థలంమీద కూర్చున్నారు. కుర్చీలమీద కూర్చున్నారు. ఇంక అభినందన పత్రికలు మొదలు పెట్టినవి. సాయంత్రం నాలుగు గంటలకి సమావేశం ప్రారంభిస్తే రాత్రి తొమ్మిద

యుండీ. వాళ్ళు తన్నాగోయ్యా, వాళ్ళు వదలిపెట్టరే ఒక పాతిక సన్మాన పత్రాలు నాటక కంపెనీవాళ్ళట వాళ్ళే చదివించారండీ! రావటం పూలదండ వేయటం. ప్రతి సన్మాన పత్రం ఒకటే నమూనా. అరు పారాగ్రాఫులూ. ప్రతి పేరా మొదట ఒక సంబోధన. ఆసంబోధనంతా పెద్ద సమాసం. వేణీ సంహారంలో చూడండి అశ్వత్థామని కర్ణుడు, కర్ణుని అశ్వత్థామ పిల్చుకొంటూ ఉంటారు. 'ఓరీ! రథకారకుల కలంకా! దుర్యోధన దయాప్రసాదితాల్పాంగ రాజ్య సమాప్త గర్వచేతస్కా'; 'ఓరీ! బ్రాహ్మణ కులకలంకా, వృథాశస్త్ర ధారీ—,ఇల్లాటి సంబోధన లుంటవి, ఆసన్మాన పత్రికల్లో. ఆఒక్కొక్క సమాసం చదివేటప్పటికే చదివేవాడికి దంతపటుత్వం కొంత తగ్గుతూ ఉంటుంది. అల్లా రాత్రి సన్మాన పత్రాలయ్యే టప్పటికి తొమ్మిదయ్యింది. ఇక్కడికి అపండి అంటారు. ఎవడో వస్తాడు, నాసన్మాన పత్రం ఒక్కటేనండీ ఒక్కటే నండీ అని బతిమాలుతాడు. ప్రాధేయ పడతాడు. దేవిరిస్తాడు. ఏంచేయాలి. ఇల్లా వెళుతూనేఉంది. రాత్రి పది అయింది. ఇక తిక్కన్నగారి ఉపన్యాసం మరునాడే నన్నారు. ఇంటికి తిరిగి వచ్చాము ఇల్లంటే ఎక్కడ మాకు తెలియదు. మళ్ళీ మమ్ముల నాకారులో ఎక్కించారు. ఆదండల మధ్య తిక్కన్నను కూలపదేశారు. ఎక్కడకో వెళ్లాము. మెతుకులు వేశారు. ఆపై డాబామీద తిక్కన్నగారూ నేనూ పడుకున్నాము. తిక్కన్నగా రన్నాడు కదా, ఈ ఊళ్ళో ఏమన్నా డబ్బు సంపాదించావా అన్నాడు. నేను ఈ ఊరు చాల గడుసు ఊరండీ! తేలికగా అట్లా ఇవ్వరు. ఈ ఊళ్ళో ఒక ఎత్తుంది లెండి. మీస్వంత వ్యాఖ్యానంతో మీ భారతమంతా అచ్చువేస్తే డబ్బంతా ఒకాయనే ఇవ్వగలడు. కాని ఆయనకి మీరు తిక్కన్న అనే నమ్మకం కుదుర్చాలి. అన్నాను. ఆయన వచ్చాడా సభకి అన్నాడు తిక్కన్న. నేనన్నాను. మనం ఎక్కిన కారు శతవిధాల వారిదే అయి ఉంటుంది. అంటే తిక్కన్నగార న్నాడు, నన్నాయన దగ్గరకి తీసుక వెళ్లు- నేను నచ్చచెపుతా నన్నాడు. నేన న్నాను, అసలు ఒక ఛాన్సు పోయింది లెండి. ఒకాయన చచ్చిపోయినాడు. ఆయన గనుక మిమ్మల్ని తిక్కన్న అని ఒప్పుకుంటే తెలుగుదేశ మంతా జయించేవాళ్ళం. అసలు ఇద్దరు గొప్పవాళ్లు ఒక్కసారి భూమిమీద ఉండరు. ఆయన ఉన్నన్నాళ్ళూ మీరు ఈ భూలోకానికి వచ్చారు కాదాయె. మీరు వచ్చేటప్పటికి ఆయన చచ్చిపోయె. అంటూంటే తిక్కన్న అన్నాడు. అబ్బాయి! ఒకమాట చెపుతున్నా విను. అందరినీ నిదురపోనిచ్చి మన దారి మనం చూసుకొందాము. ఈ ఊళ్ళో మనం నిభాయించుకోలేము. దాని సంగతి నాకు తెలిసింది. నేను తిక్కన్న నైనా సరే, కాళిదాసు నైనా సరే. ఈ ఊళ్ళో రెండు సాహిత్యపు పార్టీలున్నాయోయి, ఏదో ఒక పార్టీకి చెందితే తప్ప మనం నిభాయించుకోలేము అన్నాడు. నేను అదేమిటండీ,

మీకు కూడా ఇల్లాంటి పట్టింపు పట్టిస్తారా, అంటే ఆయన నీకేం తెలుసు నోయి బాబూ! గుంటూరిలో జరిగిన అల్లరి నీకు తెలియలేదు నేనాకట్టాను. అది నియోగి వైదీకి అల్లరి. ఈ ఊళ్లో ఈ వ్యవహారం ఉన్నది. బతికుంటే బలు సాకుతిని బ్రతకవచ్చు. మన అదృష్టం ఏమవుతుందో ఆరాజమండ్రిలో చూచు కుందాము పద" అన్నాడు, ఏం చేస్తాను నేను. హీరో వేషం వేసేవాడే శాగి పడుకొంటే నాటక మెట్లా సాగుతుంది. కొంపకి తిరిగి వచ్చాము. తరువాత పదిరోజులకి కాబోలు రాజమండ్రికి వెళ్ళటానికి నిశ్చయము చేశాము. కానీ ఈలోపుగా పత్రికల్లో ఎంత వ్యతిరేకమైన ప్రచారం చేశారు! ఆయన తిక్కన్నే కాదన్నారు. ఆయన దొంగ అన్నారు. స్వర్గాన్నించి మనిషి దిగిరా వటము అసంభవ మన్నారు ఇదంతా విరుచుకొని నానెత్తిన పడ్డది. ఈ పెద్ద మోసము నేను చేస్తున్నానని పత్రికలనిండా వ్రాశారు. నేను రాజమండ్రి వెడదా మయ్యా అంటే తిక్కన్నగారన్నాడుకదా అబ్బాయి మననిగురించి ఇంతవ్యతి రేకప్రచారంసాగింది ఆఊళ్లో మనని బ్రతకనిస్తారంటావా.అన్నాడు. నేనన్నాను "మీకా భయం అక్కర లేదండీ. ఆ ఊరికా వూరేను, ఒక సినీమా వస్తుంది. ఒక ఊళ్ళో బాగుండలేదంటారు. ఇంకో ఊళ్ళో దానికే డబ్బు దోస్తారు. కనుక స్థలమాహాత్మ్యము, కాలమాహాత్మ్యము అని రెండుంటవి. అని చెప్పాను. రాజమండ్రి వెళ్ళాము. మీటింగు పెట్టించాను. మేం వెళ్ళక ముందే ఆ ఊళ్ళో చాల వ్యతిరేకప్రచారం చేశారు. ఒక పక్షంవాళ్ళు రానే రాలేదు. వాళ్లెప్పుడూ రారు. తక్కిన వాళ్ళు వచ్చారు. ఈయన తిక్కన్నేను అన్నారు. కానీ ఆ వ్యతిరేకపు పార్టీవాళ్ళు లోపలలోపల చాల చమత్కారాలుగా మాట్లాడుకున్నారట. గద్య తిక్కన్న ఉండగా రాలేదు. అదృష్టవంతుడని. ఆఁపేరేకాని వడ్డాది సుబ్బారాయడు గారంత గొప్పకవి అటోయి అని కొందరు. భారతం వ్రాస్తే గొప్ప ఏమిటి? భక్తచింతామణి వ్రాయమను అన్నాడట ఒక అఖాండరాయిగాడు. ఇంకోడు 'అబ్బాయి, నువ్వు లక్షచెప్పు, వేయిచెప్పు వీళ్ళందరూ కాదోయి. నిజంగా తిక్కన్నగారు వస్తే ఈ ఊళ్ళో ఆయనను మర్యాద చేయదగిన వాడొక్కడే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. ఆయన చచ్చిపోయినాడు' అన్నాడు. ఎట్లా గయితేనేం ఆ ఊళ్ళో ఒక వేయి రూపాయలు సభాముఖంగా తిక్కన్నగారికి చదివించారు. కొంతే చేతికిచ్చారనుకోండి. అది ఆ ఊళ్ళో నన్న మాటేమి? ఏ ఊళ్ళోనైనా అంతేకదా! ఇంక మిగిలింది ఒక్క విశ్వ విద్యాలయం. అది కూడా చూసేస్తే ఆ తిక్కన్నగారి బులపాటం తీరిపోతుంది. మళ్ళీ వెనక్కి తిరిగి రావట మెందుకని తోలేశాము ఆ వైపుకి. ఆ ఊళ్ళో ఎక్కడ దిగాలని ప్రశ్న. టర్నర్సు చౌల్ట్రిలో దిగాలి. ఎందుకయ్యా ఆ ఊళ్ళో టర్నర్ సత్రం ఉన్నది అంటే, అందులో దిగినవానికి అదృష్టం టర్ను అవుతుంది. దిగాము.

మరునాడు విశ్వవిద్యాలయానికి వెళ్ళాము. వీరు తిక్కన్నగారని చెప్పాను. ఎవడి దారిన వాడే పోతున్నాడు తప్ప పట్టించుకొన్నవా డొక్కడూ లేడు. తెలుగు శాఖాధ్యక్షుడు అగదిలో ఉంటా డండి వెళ్లండి అన్నారు, వెళ్ళాము. ఆ యనింటికి వెళ్ళిపోయినాడన్నారు. ఏంచేయాలి. ఇంకా కొందరు పండితు లుంటారుకదా! అని ఒకాయన దగ్గరకు వెళ్ళాము. ఆయన దయచేయండి కూర్చోండి అన్నాడు. వీరే తిక్కన్నగారండీ అన్నాను. అయన 'బాగుంది' అన్నాడు. బాగుండట మేమిటో నాకు తెలియతే. కాసేపున్న తరువాత తిక్కన్నగారితో అన్నాడుకదా! ఏమండీ మీరు 'నిశ్చింతగా' అని వ్రాశారు, 'నిశ్చింతముగా' అని ఉండనక్కరలేదా అన్నాడు. తిక్కన్న కళ్ళు చింత నిప్పు లైనవి. నేను నెమ్మదిగా బయలుదేరి బయటికి వచ్చాను, ఆయన నాతో వచ్చాడు. ఇల్లాకాదని ఆ తెలుగు శాఖాధ్యక్షుని ఇంటికే వెళ్ళాము. వాళ్ళ ఇల్లు కనుక్కొన్నాము. వెళ్ళాము. ఆయన ఇంటిదగ్గర లేడు. ఎక్కడికి వెళ్లాడో తెలియదు. ఏమి చేయాలి. ఏమైనాసరే. ఆయన వచ్చేవరకూ కూర్చోవలసిందే. రాత్రి తొమ్మిదయింది. వచ్చాడు. వచ్చి "ఎవరా కూర్చు న్నది" అన్నాడు. నేను లేచి 'అయ్యా! వీరు తిక్కన్నగారు. స్వర్గలోకం లోంచి వచ్చారు. వారు తాము వ్రాసిన భారతంలో అనేక రహస్యాలు అందరికీ తెలియటములేదు. భూలోకంలో చెప్పి పోదామని వచ్చారు. మీ దర్శనంకోసం తీసుకుని వచ్చాను అన్నాను. ఆయన 'నువ్వెవరవు' అన్నాడు. చచ్చాను పో. నేను ఫలానా స్కూల్లో మాష్టరిని అన్నాను. ఆ పాటున ఆయన అన్నాడు కదా, 'స్వర్గాన్నించి అల్లా తిక్కన్న వస్తే భూలోకంలో ఎవరి దగ్గరికి రావాలి అంటే నీకన్న ఇంకెవడూ దొరకలేదా' అన్నాడు. నేనేం చేయను? నాకు ఒళ్ళు మండిపోయింది. అన్నానుకదా! 'ఎదురుగుండానే నిల్చున్నాడుకదా. అడగండి మీ తిక్కన్నని' అని. కొంచెం గాభరాపడ్డా డాయన. పిడింత ధైర్యంగా అంటున్నాడు. ఈయన నిజంగానే తిక్కన్న ఏమో, అనుకున్నాడో ఏమనుకున్నాడో. చాలా మర్యాదగా ఆ తిక్కన్న గారిని లోపలికి దయచేయుమని తీసుక వెళ్ళాడు. నేను వాకిట్లోనే కూర్చు న్నాను, రాత్రి పన్నెండయింది. తిక్కన్నారాడు. ఎవ్వరూరారు. ఎవ్వరో వచ్చారు ఎందుకో. తిక్కన్నగారేం చేస్తున్నారు? అన్నాను. నిదురపోతు న్నారు అన్నాడు. ఇది యేమి గోలరోయి బాబూ! వచ్చి వచ్చి పులినోట్లో పడ్డామనిపించింది, అప్పుడు టర్నర్ సత్రంలో కూడా అన్నం పెట్టరు. ఏం చేయను? చలివేస్తుంది? అల్లాగే కనుక్కొని సత్రం దగ్గరికి వెళ్ళి పడుకొని నిదురపోయినాను. కొంచెం ప్రొద్దెక్కి లేచాను. కళ్లు తెరచేటప్పటికి తిక్కన్న ప్రక్కన కూర్చుని ఉన్నాడు, 'బలేవాడయ్యా బాబూ రాత్రి బలేపని చేశా'వన్నాను. అబ్బాయి రైలుకి పోదాం పదమన్నాడు. ఇదేమి టన్నాను.

చెపుతానులే పద అన్నాడు. ఏం చెపుతాడు? చెప్పవయ్యా బాబూ! నా కర్థం. కావటంలేదన్నాను. నీ కర్థం కానక్కరలేదు. పోదాంపద అన్నాడు. ఇంకేం చేస్తాము. రైలులో పడ్డాము. అది మెయిలు. మూడోక్లాసు. ఆ తిక్కన్నంటే గాలిమనిషి కనక ఆయనకేం బాధా పాడా? నా ఒళ్ళు వచ్చదైపోతుంది. కొంపకి చేరేటప్పటికి రాత్రి పదయింది. విష్ణుశర్మ తన పట్టెమంచం మీద పడుకొని అగ్నిహోత్రపు శాలువా నిగడదన్ని గుఱ్ఱుకొడుతుంటే తిక్కన యొక్క 'సింగం బాకటితో గుహాంతరమునన్' లాగా ఉంది. వస్తూనే తిక్కన్న మాట్లాడకుండా పడుకొని నిదురపోతున్నాడు. నేను నిద్దరెట్లాపోను. ఈ ప్రయాణంలో వచ్చిం దెంత? ఖర్చైం దెంత? ఇదంతా చూచుకోవాలి కదా? కూర్చున్నాను. లెక్కలు రాసుకుంటున్నాను. ఎందుకో విశ్వ విద్యాలయంలో మనకేమీ రాలేదు గదా అని తోచింది. ఎందుకోగాని ఆ తిక్కన్న నిదుర పోతుంటే పోయి అతని జేబు వెతికాను. అతని జేబులో రెండు వేల రూపాయ లున్నవి. ఓయి బాబోయి, ఇదా రహస్యం. పోదామంటే పోదామన్నాడు. నాకు తెలియకుండా డబ్బు సంపాదించాడు, నాతోచెప్పితే నేను కొట్టేస్తా ననుకున్నాడు కాబోలు అని జేబులోనుంచి డబ్బు తీయబోయినా. ఆయనకి మెలకువ వచ్చింది. ఏయి దొంగలు దొంగలని కేకేశాడు. నేను 'ఎవరు దొంగల'న్నాను. ఆయన నవ్వి అదికాదోయి, "నీకు తరువాత చెపుదా మనుకొన్నాను. నన్నాయనట్లా లోపలికి తీసుక వెళ్ళాడా, ఏం జరిగిందో చెపుతాను. నీతో ఆ వూళ్ళో చెప్పవద్దన్నాడు. చెప్పలేదు. ఆ లోపలికి తీసుక వెళ్లాడు, నన్ను కూర్చోపెట్టాడు. అక్కడినుంచీ నువ్వు వాకిట్లో కూర్చున్నావు. దొడ్డితోవగానే కబుర్లు వెళ్ళినవి. వచ్చినవి. ఆ విశ్వవిద్యాలయంలో ఉన్న పండితుల నందరినీ పిలిపించాడు, వాళ్ళందరూ ఏమిటో ఆలోచించుకున్నారు. నాకి డబ్బు తీసుక వచ్చి ఇచ్చారు. మీరు మాట్లాడకుండా వెళ్ళమన్నారు. ఆ రాత్రిపూట నన్ను కదలనివ్వ లేదు. నన్నేం చేయ మంటావు" అన్నాడు. నేను "బాబూ! నీవు మనుమసిద్ధి మంత్రివి కదా! భారతం 15 పర్వాలు వ్రాశావు కదా! ఎందుకల్లా చేశారో నీకు తెలియలేదా." ఆయన అన్నాడుకదా! "వాళ్లు ఎందుకల్లా చేశారో నాకు తెలుసు. నేను ఎందుకు అట్లా పుచ్చుకు వచ్చానో కూడా నాకు తెలుసు." అన్నాడు. వ్యవహారం ఎదురు తిరిగిందని ఏమిటి కథ అన్నాను. తిక్కన్నగారన్నాడు కదా? 'ఒరే అబ్బాయి! నేను నిజంగా తిక్కన్ననని తెలిస్తే వాళ్లందరి నోళ్లకిగింద కూడూ పోతుంది. అందుచేత వాళ్లు నన్ను పెందలాడే అక్కడినుంచి పంపిస్తా మనుకొన్నారు. నే నెందుకు బయలుదేరి వచ్చానంటే వాళ్ళేదో తెలివి కలవాళ్లమని అనుకుంటున్నారు తప్ప వాళ్లు పిచ్చివాళ్లని నాకు తెలుసు, నేను తిక్కన్నని ఋజువు ఏమిటోయి, నన్ను పోల్చి చెప్పే

పాడున్నాడా! నా దస్కతును నిరూపించే వాడున్నాడా, అసలు నాకు వయస్సెంత? నేను పరీక్ష ప్యాసైనాను. రాజ్యంలో నన్నెవ్వ డొప్పుకుంటాడు. నాకు తెలుసు. అయినప్పటికీ వాళ్లు రెండు వేలిస్తామన్నారు. నీ కెందుకు నష్టం చేయాలి. నీ యింట్లో ఇన్నాళ్లమంటీ తింటున్నాను కదా, నీ తెలివి తేటలను బట్టి నువ్వు సంపాదించు కొన్నది నే నిచ్చినట్టు కాదు కదా? ఇది మాత్రం నేను నీకిచ్చినట్టు. కానీ నేను పాఠం చెప్పేదే. నీవు వినవలసిందే. నావ్యాఖ్యతో నీవు భారతం అచ్చువేయ వలసిందే" అన్నాడు. నేను అన్నాను," ఓయి స్వామీ! నీవు కలలో వచ్చి చెప్పావంటే ఎంత నమ్ముతారో నీవు కలలో కనిపించి ఈ వ్యాఖ్యానమంతా చెప్పావన్నా అంతే నమ్ముతారు. పైగా నేను కల్పించి వ్రాశా నంటారు: నీకు హరిహర నాథుడు కలలో కనిపించి భారతం వ్రాయమన్నాడని నీవు వ్రాస్తే మహాప్రభూ! ఒక్కడు నమ్మటం లేదయ్యా. నేను తిక్కన్నని కాదాయె. నీవు హరిహర నాథుడవు కాదాయె. ఇంక మన సంగతి నమ్మి చచ్చేదేముంది ? అందుచేత మహాప్రభూ! స్వర్గానికి వేంచేస్తే మంచిది" అన్నాను. ఆయన పాపం తెల్లబోయినాడు. 'అరే నాయనా! నమ్మేవాళ్లు నమ్మితే నమ్ముతారు. లేకపోతే లేదు. నేను కొన్ని చెపుతాను తెలుసుకో కూడదటరా" అన్నాడు. నేను "సరే ఎట్లాగూ చెపుతా నంటున్నాడు కదా. ఈయన భారతాన్ని గురించి ఎవడికి కావాలి. నేనెట్లాగూ డాక్టరేటుకి ప్రయత్నం చేయాలను కుంటున్నాను. నవర భాషలను గురించి పరిశోధన చేస్తామను కుంటున్నాను. వాటిని గురించి ఈయనచేత చెప్పించుకుంటే బాగుంటుందని, అయినా ఈయనకంటే నన్నయ్యగారైతే బాగుండే దనుకొని మీరు శబర భాషలని గురించి ఏమైనా చెప్పగలరుదురా అన్నాను. ఆయన నీ యేడుపు నాకు తెలుసులే. శివకవులని గురించి నాకు చాలా తెలుసు. కాకతీయుల కాలమే గదోయి మాది. వాళ్లని గురించి చెపుతాను తెలుసుకో మన్నాడు. సరేనని కాగితం చేతితో పుచ్చుకొని కూర్చున్నాను. ఆయన ఏం చెప్పాడో తెలుసునా? ప్రభాకర శాస్త్రిలు గారు బసవ పురాణానికి వ్రాసిన పీఠిక అంతా తాను నాకు నోట్సు చెప్పాడండీ. ఇదేమిటయ్యా అంటే ఆయన ఇంకో రహస్యం చెప్పాడు. ఓరి పిచ్చివాడా! అచ్చంగా అదే అనుకున్నావా. ద్విపద భారతం పీఠిక కూడా కలిపానోయి అన్నాడు. నేను నమస్కారం చేసి 'బాబూ!దీనికి డాక్టరేటు ఇవ్వరండి' ఇంకేదైనా చెప్పండి'అన్నాను.ఆయన ఆలోచించాడు.అన్నాడుకదా'అబ్బాయి, తెలుగు దేశంలోఉన్నశివలింగముల చరిత్రనిగురించి పరిశోధన చేయుము. లేదా ఇంగ్లీషువాళ్లు రాకముందు వలందరు, పరాసులు, మొదలైన వాళ్ళు మన దేశంలో ఉన్నప్పుడు వారిచేత ఏమి మార్పు పొందినదో దానిని గురించి వ్రాయి. నేను ఈ రెండో విషయం బాగుందన్నాను. ఎందుచేత నంటే ఏది

వ్రాస్తే కాదనిటాని కేది వీలు? మెకెంజీ రికార్డుల్లో ఉందటాము. ఇంతలో విష్ణుశర్మ మేల్కొని "అబ్బాయి! చాలు" అంటే ఇంగ్లీషు ఏమిటి చెప్ప మన్నాడు. నేను Enough అన్నాను, ఆయన సరే పడుకుందాం అనుకుంటుంటే తిక్కన్న స్పెలింగు E, n, a,f, ఏనా అన్నాడు. కాదు,e, n, o,u, g,h,అన్నాను. ఇంక విష్ణుశర్మ అఫ్, ఉఘ్ అని దగ్గటం మొదలు పెట్టాడు. నేనర్థం చేసుకోవాలి. ఏమనో తెలుసునా అది ఎనఫ్ కాదు ఎనఘ్ అని. ఆ స్వర్గాన్నించి వచ్చిన వాళ్ల భాష అట్లా ఉంది. ఆ దగ్గుతో నాకు మెలకువ వచ్చింది.

—oo—

# పదవ అధ్యాయము

తిక్కన్నగారూ నేనూ ఇంటికి తిరిగి వచ్చిన తరువాత నేనేమనుకొన్నా నంటే ఈయన మనకు చదువు చెపుతా నంటాడు. అనుకున్నాను. ఈ బాధ పడటం ఎట్లాగురా అని అనుకుంటున్నాను. కాని చదువుకుంటే బాగానే ఉంటుందని ఉంది. ఆయన దగ్గర చదువుకుంటే తిక్కన్న భారతాన్నిగురించి అనేకమంది 'అబ్బో వాళ్ళకే తెలిసినట్లు మాట్లాడుతున్నారు. అల్లా కాదోయి గంగయ్యా ఇల్లాగు. ఈ తిక్కన్నగారు నాతో చెప్పారు అని నోరు మూయించవచ్చు. అయినా ఈయన ఇదివరకు చెబుదామని ఎంత ఊగాడో ఇప్పుడంత స్తబ్ధుగా ఉన్నాడు. ఏదో మందకొడిగా ఉన్నాడు. పాపం ఆయన్ని ఆ ఊరూ ఈ ఊరూ తిప్పాను. ఏదో పాలుమాలు తున్నాడను కున్నాను ఈ లోపుగా విష్ణుశర్మ హాయిగా రెండుపూటలా భోంచేయడమూ గదిలో పడుకొని నిదురపోవటమూ. ఆయన వ్యవహారం ఎంతదూరం వచ్చిం దంటే మా ఆవి ఒకసారి బాబుగారూ, ఆకుకూరలో కొంచెం తిరగమూత వేసిపెట్టండి అన్నదని, ఆయన పోపో, నేనేం వంటబ్రాహ్మడి ననుకొన్నావా, నాకే మవసరం. అన్నం పెడితే పెట్టు లేకపోతే లేదు. లేకపోతే ఏ హోట ల్లోనో తినివస్తాను అన్నాడట! మా ఆవిడకి భయం వేసింది. తాగి వచ్చా డేమో అనుకుందిట. నే నన్నాను. అదేమిటే నీ దుంప తెగ నాలుగైదు శాస్త్రాలు చదువుకున్నవాడు, తాగుతాడా అన్నాను. అది అన్నది "మీకు తెలియదు. ఈ రోజుల్లో వీడు తాగుతాడు. వీడు తాగడు" అని చెప్పటానికి వీల్లేదు. పండితులని మానేశా రనుకున్నారా? మా పుట్టింటి ఊళ్ళో ఒకాయన ఉన్నాడు. చదువుకున్నవాడే అంటే సంస్కృతం. ఆయన తాగు తాడు. మా నాన్న అడిగాడట 'ఏమండీ మీ కిది న్యాయమా' అని. ఆయన సమాధానం చెప్పాడటకదా, అది కాదయ్యా, తాగటంమొదలుపెడితే లాభం ఉన్నది. పెద్ద పెద్ద ఆఫీర్లతో స్నేహం అవుతుంది అన్నాడట. వాళ్ళూ వీళ్ళూ కలిసి తాగుతూ ఉంటారు. పనులేమైనా తేలికగా చేయించుకోవచ్చు. సరే కానీ, నేనింటికి రావటంతోటే తిక్కన్నగారేమో మొద్దువలె పడు కోవటం మొదలు పెట్టాడు. ఈ విష్ణుశర్మ "అబ్బాయి! ఈ తిక్కన్నని వెంటేసుకొని నీ సంపాదనమీద నువ్వు పడ్డావు. నేను వచ్చి ఎన్నాళ్లైం దంటావు. తేలికగా నాలుగైదు నెలలు అయి నట్టుంది. ఇక్కడ ఉండటం

నాకు బాగా లేదు. నేను స్వర్గానికి వెళ్ళిపోతాను. మిగిలిన చదువేదో చెప్పి వేసేయ్" అన్నాడు. నేను బలేవాడవే. అవగింజలో అరభాగం కాలేదు. అసలు నీకేం వచ్చునయ్యా. అక్షరాలు చదువుకున్నావు. అన్నీ కలిపి ఇరవై మాటలు వచ్చునో రావో నీకు. నీ అంతట నువ్వేం చదువుకుంటూ వస్నాను. ఆయన నవ్వాడు. ఆ సంగతి నేను వెళ్లేటప్పుడు చెపుతాను కాని నేవడిగినవి చెప్పు మన్నాడు. అబ్బాయి, ఏభాషలో అయినా మొట్టమొదట నామవాచ కా లుంటవి. వాటికి విభక్తి ప్రతయాలు చేరుస్తాము. అవి నాకు చెప్పావు. అంటే భాషలో నాలుగో వంతు చెప్పావన్న మాట. ఇంక మూడు వంతులే మిగిలింది. ఆ మూడు వంతుల్లో రెండు వంతులు మరీ తేలిక. సర్వనామాలూ అవ్యయాలూ. ఇవి రెండూ తెలుసుకోవటం చాలా సులభం. ఇక మిగిలింది క్రియలేకదా. అవి గనక నామవాచకాలకి మల్లేనే ఆ ప్రత్యయాలు చేర్చటం చెప్పావా ? సరిపోతుంది. అనేక ధాతువులూ, అనేక నామ వాచకాలూ నిఘంటువులు చూస్తాను. తెలుసుకుంటా నన్నాడు. నేను నవ్వాను. అయ్యా నిఘంటువులంటే ఏమి టన్నాను. ఆయన "ఏమిటోయి అమర ముందనుకో. దేవవర్గు అంతా ఒకచోట ఉండిపోయి. భూవర్గు, వాగ్వర్గము, ఇవన్నీ తెలిసి కోవటమేకదా, అన్నాడు, నేను "అయ్యా, మిమ్మల్ని చూస్తే జాలివేస్తుంది. మీకు నేర్పిన ఈ కొంచెం ఇంగ్లీషునుబట్టే మనకు వాళ్ళకూ ఏమీ సంబంధం లేదని తెలిసి ఉండాలి. వాళ్ళ నిఘంటువులు ఇట్లా వర్గములుగా విభజింపబడి ఉండవు. అకారాదిగా ఉంటవి. అంటే a మీద వచ్చే మాటలన్నీ ఒకచోట ఉంటవి. b మీద వచ్చే మాటలన్నీ ఒకచోట ఉంటవి. అంటే **Man, monkey** రెండూ ఒక చోటే ఉంటవి బాబూ, ఇది మనుష్యవర్గులోనూ, అది పశువర్గు లోనూ ఉండదు. అక్కడ అంతా ఒకటేను అన్నాను. ఆయన అదేమిటయ్యా మనుష్యుడూ, కోతి ఒకటేమిటి అన్నాడు. నేను అబ్బురమా ఏమిటి ? మను ష్యుడు కోతిలోంచి పుట్టాడుట, అని వాళ్ళ ప్రకృతి శాస్త్రవేత్త, అతని పేరు డార్విన్ అనుకుంటాను అతడు చెప్పాడు. నేను డార్విన్ అనుకుంటున్నాను, బాబూ, కాకపోవచ్చు. నేనిట్లా అన్నానని గనుక నీవా హైదరాబాదుపోయి చెప్పావా ? అక్కడ నా మీద పడతారు వాళ్ళు సరిగ్గా తెలియదన్న మాట కూడా వాళ్ళు నేనేదో ఇంగ్లీషుభాష. గొప్పభాషట దానికి నే నన్యాయం చేస్తున్నానట! కబుర్ల రాయళ్లు బోలెడు మందున్నారు ఎందుకు వచ్చింది. వాళ్ళతో బాధగా ఉంది. అన్నాను. అంటే విష్ణుశర్మ "కోతిలోనుంచి మనుష్యుడు పుట్టట మేమిటయ్యా' అన్నాడు. నేనేం చేయను ? ఇల్లా చెప్పాను. పరిణామ సిద్ధాంత మని ఒక టున్నదండీ. నీటి జంతువులలో నుంచి నేలమీద తిరిగే జంతువులూ వాటిల్లోంచి క్రమ క్రమంగా కోతులూ, వాటి ల్లోంచి మనుష్యులూ ఇల్లా పుట్టుకొచ్చారట. అన్నాను. విష్ణుశర్మ మొన్న

ఏదో Woman అన్నమాటకి మనుష్యుడులోంచి పుట్టింది స్త్రీ అని చెప్పినట్లు న్నావు. వాళ్ళ దేవుడు ఆరు రోజు లేదో సృష్టి చేశాడు. ఏడవరోజున రెస్టు దీసుకున్నా డన్నావు. దానికి దీనికి ఏమిటి సంబంధం అన్నాడు. నేను "మీరు అల్లా ప్రశ్నలు వేయకూడదు. ఆదివారాలు సెలవులు వచ్చే అందు కోసం దేవుడు సృష్టిచేశాడు. అసలు చదువు, విజ్ఞానము మొదలైన వాటికోసం డార్విను మొదలైన వాళ్ళు వీటిని కల్పించారు. దాని కదే, దీని కిదే అన్నాను. అని బాబూ! మేము ఇంతమందిమి ఇంగ్లీషు చదువు కుంటున్నాము. నీవు వేసినప్రశ్న ఒక్కళ్ళము వేయలేదు. కోతుల్లోనుంచి మనుష్యులు పుట్టారంటే ఒప్పుక తీరాము. అయితే భగవంతుడు కాదు కదా సృష్టిచేసింది. ఆదివారం సెలవు తీసుకోవటం అన్యాయం కదా! మాకు ఆది వారం సెలవు పోతుం దేమోనని భయం. మేము ఆప్రశ్నే వేయము. విష్ణు శర్మ "మీచావు మీరు చావండిరా" అన్నాడు. అని అవ్యయాలు చెప్పు మన్నాడు చెప్పాను. నాకు తోచినవి చెప్పాను. మధ్యమధ్య ఉచ్చారణలో మళ్ళీ తప్పులు పట్టటం మొదలెట్టాడు. నేను చేసిన కట్టడిని జ్ఞాపకం చేశాను, ఇంక సర్వనా మాలు చెప్ప మన్నాడు. సర్వనామానికి Pronoun అంటారు అన్నాను. సర్వ నామానికి Pronoun అని ఎందు కన్నారు? అన్నాడు. నాకేం తెలుసు? వాళ్లు చెప్పిందే చెప్పాను. నామమునకు బదులు వస్తుంది గనక అన్నాను. ఆయన నామానికి బదులు రావట మేమిరా అన్నాడు. నేను బదులే వస్తుంది కదా. రాముడు రావణుని చంపెను. అతడు కుంభకర్ణుని కూడ చంపెను. అతడు అన్నది రాముని బదులు వచ్చింది, అన్నాను. ఆయన "నీవు రాజమ హేంద్రవరము వెళ్ళితివి. నీవు విశ్వవిద్యాలయమునకు వెళ్లితివి" ఈనీవు దేని బదులు వచ్చింది? అన్నాడు. నేనేం సమాధానము చెప్పను. ఆయన నాతో మాట్లాడుతున్నా డాయె. నువ్వంటున్నాడాయె. నాబదులు వచ్చిం దని చెప్పనా? నాపేరు బదులు వచ్చిందని చెప్పనా? అక్కడ నాపేరే లేదాయె. పుస్తకంలో ఏదైనా కథగా వెళ్ళుతుంటే అప్పుడు ఒకడు ఇంకొకడితో మాట్లాడు తున్నట్టు వ్రాస్తే అక్కడ వాడిపేరు బదులు నీవు వాడాడు అందాము. అదైనా సమంజసంగా కనబడటం లేదు. రాముడు రావణునితో నీవు దుర్మార్గుడవు అని అంటే నీవు అన్నది రావణునికి బదులు వచ్చిందని ఎట్లా చెపుతాము. అని ఆలోచిస్తూంటే విష్ణుశర్మ అన్నాడు. అబ్బాయి, Pronoun నామవాచకానికి బదులు వచ్చే అట్టయితే నీవు నేను అనే మాటలు ఉండకూడ దోయి అన్నాడు. నువ్వనుకుంటున్నట్లే రాముడు రావణునితోబ నతడు దుర్మార్గు డనెను. అంటే సరిపోతుంది. అప్పుడు నీవూ నేనూ అనేమాట అక్కరనే లేదు. అయిపోయిం తరువాత మళ్ళీ ఇలా అన్నాడు. నాయనా సర్వనామమంటే ఏమిటో తెలుసునా? అందరికి ఉండే పేరోయి. ప్రతి వాడూ

నేను అనవచ్చు. మనం ఎవడితో మాట్లాడుతూ ఉంటామో, అప్రీతివాడూ నీవే. ఎవరిగురించి మాట్లాడామో అప్రీతివాడూ అతడే. ఇదీ సర్వనామ మంటే. ఈభాష భావశుద్ధి లేని భాష. ఇదివరకే చెప్పాకదా! ఏదో ఎరుకల భాష వంటిది. ఆజాతి ఎందుకో ఈసృష్టిలో పైకివచ్చింది. ఇతర భాషల్నిచూచి ఒకసారస్వతం, ఒకవ్యాకరణం, ఇల్లాంటివి నేర్చుకుంది. ఆత్మశుద్ధిలేని భాష. జన్మశుద్ధిలేని భాష అన్నాడు. నేను నీసొమ్మేం పోయింది. మహాప్రభూ! నీదారిని నీవుపోయి స్వర్గంలో కూర్చుంటావు. ఈమాటలు నేనెవరితో నన్నా చెప్పానా? నాకంతానికి ఉరే.నన్నాను. ఆయన ఒక్కసారి అదివేసుకుంటే సరిపోతుంది. ఎందుకువచ్చిన బాధ ఇది అన్నాడు. సరే. క్రియనిగురించి చెప్పమన్నాడు. నేను చెప్పాకదా, I go, నేనువెళ్ళుదును. ఇది అనిశ్చితమైన వర్తమాన కాలము. He goes అనవలె, They go అనవలె. ప్రథమ పురుషలో ఏకవచనానికి క్రియకి 's' చేరుతుంది. బహువచనానికి ఉండదు అన్నాను. ఆయన మొత్తానికి నామవాచకాలకీ క్రియలకీ విరోధమల్లే ఉందేమోయి నామవాచకాల్లో బహువచనానికి s చేరుతుంది. క్రియకు ఏకవచనానికి చేరుతుందేమి అన్నాడు, అని I goes తప్పా? అని అడిగాడు, నెమ్మదిగా అంటా రేమిటి? అమ్మాబూతు" అన్నాను. అని అంత తప్పనటానికి వీలు లేదు. వాళ్ళదేశంలో వాడుకభాషలో ఇల్లాగే వాడుతా రప్పుడప్పుడూ. బహువచన క్రియకు ' ' గలుపుతారు, అన్నాను. ఆయన మరింకా ఏం అల్లా చెప్పు. ఈదోషంలో సగానికి సగం వాళ్ళ భాషని బాగుచే ద్దామనుకున్న వాళ్ల దన్నమాట. వాళ్లు పాపం కొందరు సహజంగానే మాట్లాడుతారు కాబోలు సరే. ఇది అనిశ్చిత వర్తమానంకదా, నిశ్చితవర్త మాన మేమిటో చెప్ప మన్నాడు. నేను చెప్పాను. ఇంగ్లీషులో 'be' ఉండు, దీనికియొక్క మార్పులు వస్తూ ఉంటవి. నేను అయితే am అని వస్తుంది. తక్కిన ఏకవచనానికి is వస్తుంది. బహువచనాలకి are వస్తుంది. I am going, we are going, He is going, They are going ఇల్లాగు అన్నాను. ఆయన ఇదివరకు చెప్పావయ్యా ఇది. మరచిపోయినావు. సరేలే అదట్లా ఉంచు. He is going వాడు వెళ్లుచున్నాడు, వాడు వెళ్లుచున్నాడా? అని ప్రశ్న వేస్తే ఎల్లాగు అన్నాడు నేను ఈ 'be' యొక్క రూపాన్ని మొదట వేయాలి? Is he going అనాలి అన్నాను. ఆయన ఏమి టేమిటి మళ్లీ చెప్పు అన్నాడు. ఏదో ముంచుకు వచ్చిందిరా బాబూ అని మళ్లీ చెప్పాను. అంటే విష్ణుశర్మ "నాయనా ప్రశ్న వాక్యంచివర పుడుతుందా మొదటపుడుతుందా" అన్నాడు. అదికాక వాడు వెళ్ళుచున్నాడు ప్రశ్న వేసే టప్పటికి వెళ్లుచున్నాడా? అన్నాము. ఎంతసులభంగా ఉందంటావు. ఇదివరకే ఉన్న వాక్యానికి ఆ కలిపాము. సుఖంగా ప్రశ్న అయింది. రెండు ధాతువులు, అందులో ఒకదాన్ని తీసుకవచ్చి వెనకవేస్తే అది ప్రశ్న కావటం. ఇది

పిల్లలకి కష్టం కాదయ్యా అన్నాడు. నేనన్నాను, కాస్తకష్ట మేమిటి బాబూ! on the table మొదలైన వాటిల్లో ఆ prepositions వెనక వేయించటం ఈ ప్రశ్నలో యీసహాయ క్రియని వెనక వేయించటం మా పిల్లలకి చెప్పలేక నా ప్రాణం పోతున్నది. నాలుగైదేండ్లు అయితేనే కాని వాళ్ళ కభ్యాసం కావటం లేదు. ఆ స్పెల్లింగులబాధ స్పెల్లింగుల బాధగానే ఉంది. చచ్చేవరకూ చదువుగానే ఉంది. ఆ భాషమీద ఈగ వాలితే చెప్పుచ్చుకు కొడుతున్నారు. అన్ని చెప్పుదెబ్బలు తింటున్నా దానికి బుద్ధి రావటం లేదు. నన్నేం చేయమంటున్నారు. నన్నడిగితే ఈ బాధ ప్రతివాడూ పడుతూనే ఉన్నాడు. ఒక్కడికీ జ్ఞానమున్నట్లు కనపడటం లేదు. ఇందులో కొందరు జగన్మోహనులూ, రామమోహనులూ, ఇల్లాంటి మోహనులు ఉన్నారు. వాళ్ళు మోహన్ అంటే ఇతరులని మోహింపచేయడం కాదు. వాళ్ళే ఈ భాషని చూచి మోహపడటం. వాళ్ళ పేర్లచివర నకారం ఎందుకో తెలియదు. ఇది మాత్రం ఇట్లా జరుగుతుంది అన్నాను. ఆయన సరే నని భూతకాలం చెప్పమన్నాడు. భూతకాలం చెప్పాను. చెపితే కొన్ని బలహీనపు క్రియలూ కొన్ని బలంగల క్రియలాయె. ed కలిపితే కొన్నింటికి past tense. ask, అడుగుట దీనికి ed కలిపితే అడిగెను. అనిచెప్పాము ఆయన మాట్లాడెను అంటే speaked అన్నాడు. అల్లా కాదు బాబూ, దాన్ని spoke అనవలె అని, wrote, మొదలైనవి చెప్పాను. ఆయన కొంచెం పేచీయే నయ్యా ఏ చిత్తాకి ఆచిత్తా చదవాలల్లే ఉందే. భిన్న రూపం కాదాయె. ఒక్కటే రూపమాయె. దానికట్లా గాయె. దీని కిట్లా గాయె. go అనటానికి past tense కి సంబంధం లేదాయె. అది wen అంటూంటివి. doకి did అంటూంటివి. నేనేదో సులభంగా ప్రకృతి ప్రత్యయ విభేదం తెలుసుకోవటంతోటే భాష వస్తుందను కున్నాను. ఇక్కడ ప్రకృతీ లేదాయె, ప్రత్యయమూ లేదాయె. ఈ కేటాయింపుగా ఉన్న మాటలన్నీ ఒకచో టెక్కడనన్నా వ్రాసి ఉన్నాయా. ఉంటే ఆ పుస్తకం నాకియ్య అన్నాడు. నేను 'అన్నీ ఎక్కడా వ్రాసిలేవు బాబూ! కొన్నికొన్ని వ్యాకరణాలల్లో ఎక్కువ శబ్దాలు వ్రాసి ఉండవు. పైగా ఇప్పటి మా ఇంగ్లీషు చదువులో ఆ వ్యాకరణాలన్నీ దీసి పారేశారు. భాష భాషగా చదువ వలసిందే తప్ప వ్యాకరణం ద్వారా చదువకూడ దన్నారు. చదివితే భాష రావటం కష్టసాధ్యం అంటున్నారు. అల్లా అయితే పిల్లలకు భాష రావటం కష్టమౌతూందట. అందుచేత వాక్యాలు, వాక్యాలుగా రావలసిందే అన్నాను ఆయన అంటే ఏమిటో తెలుసునా? అన్నాడు. నాకు తెలియ దన్నాను. చెపుతా వినమన్నాడు. "అబ్బాయీ! మొట్టమొదట కొంత చెప్పాను. మన భాషా వ్యాకరణం మనకు వస్తే ఇతర భాషని, అందులో కొన్ని కొన్ని భేదాలుఉన్నా ఇవి నామవాచకములు, వీటి స్వరూపము ఇది, ఇవి ధాతువులు వీటిల్లో ఈ

మార్పులు వస్తవి. అని. భాషని ఏ భాషనైనా సరే వివేకము వచ్చిన తరు
వాత సులభంగా నేర్చుకోవచ్చు. చిన్నప్పటినుంచీ ఈ భాష నేర్పటం ఎందు
కంటే వివేకోదయం కలగకుండా ఉండటం కోసం. అదే అలవాటై పోతుంది.
అలవాటై పోయిన దాన్ని గురించి ఎవడూ విచారించడు ఏమిటిరా గడ్డి తింటు
న్నా వంటే పదేళ్ళబట్టీ తింటున్నా నన్నాడట. వాడికి ఎంత అలవాటై
పోయిందంటే పదేళ్ళమట్టీ గడ్డి తింటున్నా నని చెప్పడం కూడా వాడదొక
గొప్ప అనుకుంటున్నాడు. మనభాష మనం చదువుకొని పెద్దయిన తరువాత వాళ్ల
భాషనే నేర్చుకోవటం వస్తే ఆ భాష ఎంత కొకిలికి భాషో నే ననుకున్నట్లే
అందరూ అనుకుంటారు. అందుచేత ఎవళ్ళకీ సరిగ్గా జ్ఞానమే రాకముందు
భాష అనగా వ్యాకరణాన్ని ఆశ్రయించి ఉంటుంది, సర్వభాషలూ సర్వ
వాక్యములూ అన్ని మాటలూ వ్యాకరణాన్నే ఆశ్రయించి ఉంటవి. అనే
జ్ఞానం ఉదయిస్తుంది. అప్పుడు పరభాష నేర్పటం తేలిక. ఆ జ్ఞానం కలుగ
కూడదు. అందుకోసం మీకు చిన్నప్పటి నుంచీ ఇంగ్లీషు చెపుతున్నారు'
అన్నాడు. నేను అదేమిటండీ, సర్వభాషకి వ్యాకరణం మూల మంటా
రేమిటి? మాదేశంలో ఇప్పుడు పెద్దపెద్ద కవు లున్నారు. పెద్దపెద్ద రచయిత
లున్నారు. వాళ్ళు వ్యాకరణాన్ని నాశనం చేయమంటున్నారు. మనంఎట్లామాట్లా
డుతున్నామో అల్లాగే వ్రాయాలంటున్నారు అన్నాను. అంటే ఆయ నన్నాడు వాళ్ల
న్నదేమీ తప్పు లేదయ్యా. ఎల్లా మాట్లాడుతున్నారో అల్లా వ్రాస్తే వ్యాకర
ణం ఎట్లా లేకుండా ఉంటుంది. వ్యాకరణం లేకుండా అసలు ఎప్పుడూ ఎవ్వ
డూ మాట్లాడ లేడు. భాష ఉండదు. వాక్యం ఉండదు, అన్నాడు. అయితే
మనవాళ్ళు మరెందుకట్లా అంటున్నారు అన్నాను. విష్ణుశర్మ ఎందు కంటు
న్నారో ఇంద్రాకటిమట్టీ చెపుతున్న కథే. పాపం వాళ్ళకి వ్యాకరణం అనేది
వేరే ఉంటున్నదని అనుకుంటున్నారు. ఏదీ వ్యాకరణం లేకుండా ను వొక్క
మాట అను అన్నాడు. నేను "ఏడిశావులే" అన్నాను. ఆయన నేను కాదు
నువ్వు. 'ఏడిశావులే' అన్నది 'ఏడ్చితివి లే' అన్నదాని అపభ్రంశము.
ఏడ్చు ధాతువు దానిమీద ఏడిచితివి అన్న మధ్యమపురుష భూతకాలిక క్రియ.
లెమ్ము పైన చేర్చాము. ఆ లెమ్ములో ఉన్న చివరి ముకారం పోయి పూర్వా
చ్చునకు దీర్ఘం వచ్చింది. ఏడ్చితివి అన్నదానికి ఏడిశావు అని వాడుతున్నావు.
అపభ్రంశ రూపం వాడావు తప్ప వ్యాకరణం లేకుండా ఎట్లా మాట్లాడావు
అన్నాడు. అప్పుడు నాకు తెలిసింది. నిజమేనండీ మేము వ్యాకృతమైన శబ్ద
స్వరూపాలు మాత్రమే వ్యాకరణం అనుకుంటున్నాము. అదీ మేం పడే పొర
పాటు. నేనూ నువ్వూ వాడూ అన్నం తిన్నాము. నీవు వెళ్ళావు. మేడమీద
కూర్చున్నాడు. ఇవన్నీ వ్యాకరణాలతో నిండిన వాక్యాలే. వ్యాకరణం
లేకుండా భాష ఉంటుంది అనుకునే అట్లుగా మోహాభిప్రాయం కలిగే ట్లుగా

నీళ్లు చేశారన్నమాట. అంటే ఆలోచన అక్కరలేకుండా చేశారన్నమాట. అసలు వాడిని ఆలోచన లేనివాణ్ణి చేశా మనుకోండి. ఇక్కడ ఆలోచించకపోతే అక్కడా ఆలోచించడు. అప్పుడు వాడితో మనకు పేచీ లేదు. మనమెట్లా చెపితే అట్లా వింటాడు. దూడా బవవన్నా పాలు తాగుతావా, పత్తి విత్తులు తింటావా అంటే ప్రతిదానికీ తలూపుతాడు. ఈ ఒక్క భాష విషయంలో ఇంత సూక్ష్మ సూక్ష్మాలైన రహస్యాలను పిల్లలకు తెలియకుండా నీవు దాస్తున్నావు. వాడు పెద్దయిన తరువాత పరభాష చెపితే ఈ రహస్యాలు వాడికి తెలుస్తవి. చిన్నప్పుడే చెప్పిస్తే వాడికి కిగోలంతా ఏం తెలుసు. గొప్ప భాష కాబోలు అనుకుంటాడు" అన్నాడు. నే నన్నాను, "అయ్యా మీరు వట్టి గాలిమనుష్యులు. మీకు యథార్థ స్వరూపం లేదు. కలలో కనిపిస్తున్నారు. మీరు పూర్వకాలంలో ఎప్పుడో పంచతంత్రం వ్రాసినమాట నిజమే కావచ్చు. ఇప్పుడు తంత్రములు అయిదు కాదు. ఐదువంద లయినవి. లోకం ఊరికే పెరిగిపోతుంది. మీనాటి చదువుకి ఈనాటి చదువుకి ఏమీ సంబంధం లేదు. చూడండి పంచభూతము లున్నవి. భూతము అంటే Element అంటారు. ఒక పఖై ఏళ్ళక్రింద ఈ element లు తొంభైరెండో తొంభైనాల్గో ఉండేవి. ఇప్పుడెన్నో తెలుసునా? కొన్నివంద లున్నవి. అల్లా పెరిగి పోతున్నది ప్రపంచకం అన్నాను. ఆయన అబ్బాయీ! నీ ఎలిమెంట్లు పెరిగిపోతున్నా యేమో తప్ప మా పంచభూతాలు పెరిగిపోవటం లేదోయి అన్నాడు. అవ్వే పెరిగిపోవటం మొదలు పెడితే నువ్వుండవు, నే నుండను, మీ ఇంగ్లీషు చదువు కూడా ఉండ దన్నాడు. నే నన్నాను. అదేమండీ మావి పాంచభౌతిక శరీరములు కనుక ఆ భూతాలు పెరిగి పోతే మేముండక పోవచ్చు. మీవి తేజశ్శరీరాలో వాయుశరీరాలో మీ రెక్కడికి వెళ్ళతారు అన్నాను. ఆయన తేజస్సు, వాయువు రెండూ భూతాలే నోయి. నీ దుంపతెగ, నీవు ఎం. ఏ. ప్యాసైనావు, నీ తెలివి తేటలు చూస్తే పసివాడికన్న కనాకష్టంగా ఉన్నది. మీ రాలోచించ రేమిటోయి, ఏదో ఒకటి ప్రశ్న వేయటమే నాయె. వేయవచ్చునా వేయకూడదా అనే విచారణ లేదాయె. అయినా మీ దన్న తప్పేముంది ? ఆ చదువ ల్లాంటిది. అది మిమ్మల్ని ఆలోచించ నీయదు. ఆలోచించే మార్గంలోనే చదువు చెప్పటం లేదాయె. ఆలోచించే శక్తి మీ మనస్సులకు కలగటం లేదాయె. అది కలిగిన తరువాత ఆలోచించే మార్గాలు ఇవ్వి అని వాటి స్వరూపం మీకు చెప్పరాయె. మీదేం తప్పుంది" అన్నాడు. నేనేం చేయను. ఆయన 'సరే అదల్లా ఉంచు వర్తమాన కాలంలో ప్రశ్న వేయాలి అంటే be అనేమాటయొక్క రూపం వెనుక వేయాలన్నావు. ఈ భూతకాలాని కేం చేస్తావు. అక్కడ am going ఉన్నది. కనుక am ని వెనుక పెట్టమన్నావు. can see ఉన్నది. కనుక can ని వెనుక పెట్టమన్నావు. ఇక్కడ went లో

ఏముంది పెట్టే అందుకు ?" అన్నాడు. ఏంచేయను ? అన్నాను. "అయ్యా, భూతకాల మనటంతోటే సర్వదా do అనే ధాతువు ఉన్నదని అనుకోవలె. went అంటే అర్థమేమి టంటే did go అని అర్థము. do కి did past tense. అందుచేత He went అంటే He did go అని అర్థము." ఆయన అన్నాడు, బాగానే ఉంది. మళ్ళీ went ఎందుకు. spoke ఎందుకు ? wrote ఎందుకు ? అన్నాడు. నే నన్నాను. "నన్నడిగితే ఏం చెప్ప మంటావయ్యా, ఆ భాష అట్లా ఉంది. నీవు నేర్పమన్నావు నేర్పుతున్నాను" అన్నాను. అయితే సరే. Went అంటే did go అని అర్థమన్నమాట. నువ్వెందుకు చెప్పావో నాకు తెలిసిందిలే. వాడు వెళ్ళినా ? అని నేను అడిగితే ఈ did వెనక వేయటానికి చెప్పినట్టున్నావు" అన్నాడు. సరిగ్గా, అంతే అన్నాను. Did I die ? అని ప్రశ్న వేశాడు ? వేసి నీవు చావలేదు. నేను చచ్చాను. అంటే ఇంగ్లీషు ఏమిటో చెప్పమన్నాడు. నేను చెప్పాను You did not die. I died అని. ఆ పాటున ఇందాకటిమట్టి మన్నుతిన్న పామల్లే పడుకున్న తిక్కన్న, ఈ విష్ణు శర్మ కలిసి ఒక నవ్వటం మొదలెట్టారూ. నాకు బలే చిరాకు వేసింది. ఏమి టయ్యా, నీవు రెండు వాక్యాలు చెపితివి. ఇంగ్లీషు చెప్ప మంటివి. నేను చెప్పితిని. మీ ఇద్దరూ పగలబడి నవ్వుతున్నారు, మీకు etiquette తెలియ దన్నాను. ఆ తిక్కన్న అసాధ్యుడు. 'నాయనా, ఆ మాటలో k ఉందా q ఉందా' అన్నాడు. నన్ను పైనుంచి కిందకి దివాలా తీసి పారేస్తున్నా రను కోండి. నేను ఎందుకు నవ్వారో చెప్పండి అని నిగ్గతీశాను. తిక్కన్న అన్నాడు, "ఓరి అమాయకుడా ! ఆయన నిన్ను ఏమాటల కింగ్లీషు చెప్పమన్నాడు. నీవు చావలేదు. నేను చచ్చిపోయినాను. ఈ మాటలకి నీవు ఇంగ్లీషు చెప్పేటప్పటికి అర్థం ఏమి వచ్చింది, విష్ణుశర్మ చావనివాడు, నీవు చచ్చిన వాడవూ అయి నావుకదా !' అందుకని నాకు నవ్వువచ్చింది అన్నాడు. "ఈ మాత్రం మెలకువ నీకు తెలియలేదేమి" అన్నాడు. ఎందుకు తెలియలేదో తెలుసా అన్నాడు, నాయనా నీవు చిన్నప్పటినుంచీ ఇంగ్లీషు నేర్చుకొని ఉంటావు. అందుచేత పిల్లలూ ఆడుకోవటం, ఆక్షేపించుకోవటం, ఇల్లాంటి చమత్కారాలు చేసి కోవటం ఇవన్నీ నీకు తెలిసి ఉండవు. అల్లా చేసికొనే పిల్లల బుద్ధికి కొంత వాడి వస్తుంది. తెలుగు దేశపు పిల్లలు ఇల్లా అనుకుంటూ ఉంటారోయి. ఇప్పుడు మానేశారేమో మాకు తెలియదు. దారివెంట పోతూ చూస్తున్నాను. ఒక్క పిల్లవాడి మొఖాన తెలివితేటలు కనిపించటం లేదు. ఆ దిక్కుమాలిన సినిమా పాటలు పాడటం తప్ప ఇంకొకటి ఏమీ కనపడటంలేదు. పూర్వ కాలంలో పిల్లలు అంటే తెలివిగల లెక్కలు వేసికోవటం, పొడుపుకథలు చెప్పుకోవటం, ఆక్షేపించుకోవటం, ఇల్లాంటివి ఉండేవి. వాళ్ళ బుద్ధులకు నైశిత్యం వచ్చేది. ఇప్పుడు ఆ తెలివంతా on the table; In the శ్మశానము.

Did he go? Am I going? ox కి బహువచనం oxen ఈ దిక్కుమాలిన విషయాలన్నీ పెద్దయిన తరువాత సులభంగా తెలిసికో దగినవి. ఇందులో సగానికి సగం తెలుసుకోకపోయినా నష్టం లేనివి, నేర్చుకొనే అందుకు బాధ పడటంతోటే సరిపోతున్నది. సరే. ఆ భవిష్యత్కాలం చెప్పమన్నాడు. నేను మొదలు పెట్టాను. అయ్యా! రెండు సహాయక క్రియలు ఉన్నవి. ఒకటి w, i, l, l, విల్. రెండవది. S, h, a, l, l, శల్. ఇవ్వి రెండూనేర్చుకోవాలి. నేర్చుకుంటే I shall go, I will go ఇవిరెండూభవిష్యదర్థక క్రియలు అన్నాను. ఆయన రెండెందు కన్నాడు. నేనేం చెప్పను నాశార్థిం. ఉన్నవి. నేర్చుకో అంటే నాకు విసుగు వచ్చిందని ఆయన అనుకొని ఆదికాదయ్యా రెంటికీ ఏమన్నా భేదం ఉందా అని అడుగుతున్నాను అన్నాడు. నే నన్నాను, ఉన్నది మహాప్రభో! ఏంఉన్నదో నాకు తెలియదు. ఈ రెండు మాటలు వాడటం చాలాకష్టం. ఇదివరకు The అన్నమాట చెప్పాను: దా? దానిని ఉపయోగించటంలో ఉన్నకష్టం ఇక్కడా ఉంది. I will go అంటే నేను తప్పకుండా వెళతాను అని కాబోలు అని అర్థం. వాడు తప్పకుండా వెళ్ళాలి. అంటే He shall go అనాలి. సామాన్యంగా అయితే I shall go, He will go అనాలి. ఈభేదం ఉందనుకొంటాను అన్నాను. ఆయ నన్నాడు ఈమాత్రం కోసం రెండుమాట లెంద కురా? ఏది ఎప్పుడు వాడాలో తెలియక పోవట మెందుకు? తప్పకుండా అని పక్కన చేరిస్తే సరిపోతుంది కదా? అన్నాడు. మన మనటం లేదా తెలుగులో నేను తప్పకుండా వెళతాను అని. దానికోసం నేను shall వాడనా? will వాడనా అన్నవిచారణెందుకు? కొన్నాళ్ళు ఇల్లా విచారణచేసి వాడట మెందుకు? అలవాటైం తరువాత బాగా వాడితే వాడు ఇంగ్లీషు ఎంత Correct గా మాట్లాడతాడని ఇంకొక చవట సంతోషించట మెందుకు" అన్నాడు. అని ఎందుకు ఈబాధ? ఎందుకు పిల్లలని ఇట్లా బాధ పెడతారు. నీకు కూడా తెలియ దంటున్నావే. నీకుకూడా అనుమానంగానే ఉందే. ఇంతింత చిన్నవిషయాల్లో కూడా ఇన్ని సందేహాలు కలభాష మీజాతి అంతా చదవట మెందుకు? ఈతప్పులు తప్పులుగానే ఉండగా ఆతప్పులతోనే మాట్లాడుతూ మేం పెద్దపండితుల మనుకుంటా రేమిటి మరి? స్పెలింగుబాధలూ, ఉచ్చారణబాధలు, The సరిగ్గా వాడటం చేతకాకపోవటం will, shall సరిగ్గా తెలియదు. ఇంకా ఎన్ని ఉన్నయో బాబూ! ఇటువంటి భాష మీరు నేర్చుకొని అందులో తూర్పు పడమర తెలియకుండా ఏవో పుస్తకాలు చదవటం. పండితుల మనుకోవటమూనా? నాకెందుకేే? దీనిని ప్రశ్న వేయాలిస్తే Shall I go అనా అన్నమాట. అంతేనా అన్నాడు. అవు నన్నాను. అయిపోయిందా. ఇంకా ఏమైనా క్రియావిషయాలు ఉన్నయ్యా. అన్నాడు. నేను ఓయిబాబూ! అప్పుడే ఏంతేలేది? shall కి should ఉన్నది. will

కి wouldఉన్నది. ఇవ్వీ be ధాతురూపాలు. మరిన్నీ has అనే verb ఉన్నది. దానికి బహువచనము have. దానికి భూతకాలం had, shall have been, should have been must have been, వీటితోపాటు would have been done లాంటివి అనేకము ఉన్నవి, అవన్నీ ఎట్లా వాడాలో నాకు తెలియదు, నాకేమిటి? ఇంగ్లీసు భాషయందు దురభిమానం గలవాళ్ళల్లో నూటికి తొంబదితొమ్మిదిమ్ముప్పావు మందికి తెలియదు. ఇదీ ఇందులో రహస్యం అన్నాను. మరి ఎందుకురా ఈగోల అన్నాడాయన నన్నడుగుతా వేం బాబూ అని నేనన్నాను. అని 'అప్పుడే కాలేదు. Past participles ఉన్నాయి అన్నాను. అంటే ఏమిటి అన్నాడు. నాకు తెలియలేదు. సామాన్యంగా Passive Voice ఉపయోగిస్తామన్నాను. Passive Voice అంటే ఏమిటన్నాడు. రాముడు రావణుని చంపెను. ఇది Active Voice అంటారు. రావణుడు రామునిచేత చంపబడెను. ఇది Passive Voice అన్నాను ఓహో! అల్లాగా అన్నాడు. దీన్ని తెలుగులో ఏమంటారు అన్నాడు. ఏమంటారో నాకు తెలియలేదు. Active Voice అంటే కర్త్రర్థకము Passive Voice అంటే ఏమిటి? ప్రేరణార్థకం కాదుకదా! కర్మార్థకము అన్నమాట. నే ననుకుంటూ ఉండగా ఏదీ ఆ Past participle ఒకటి చెప్పు అన్నాడు. నేను do, did, done; write, wrote written అనిచెప్పా. చెప్పి It is written అది వ్రాయబడినది అంటే అది క్రాంత మన్నమాట అన్నాడాయన. బాగానే ఉందయ్యా క్రాంతాలు కూడా ఉన్నయ్యన్నమాట. మన్ ధాతువు ఉందనుకో. మతము ఆలోచించబడినది. గతము వెళ్ళిపోయినది. వీటి నన్నింటినీ మనము నామవాచకాలుగా వాడుతాము. కృతము కృతమై పోయింది, గతము గతమైపోయింది అంటాము. ఒట్లాగే వ్రాయబడ్డది వ్రాయబడ్డది. అనటానికి Written is written అనవచ్చునా అన్నాడు. అనకూడదు. that which is written is Written లేకపోతే What is written is written అనవలె అన్నాను. మళ్ళీ ఆక్రమ ఎందుకు అన్నాడు. ఏమిటయ్యా ఈభాష యేదో శక్తిమంతమైనభాష అనీ సమర్థమైన భాష అని అంటున్నారు. ఇందులో అన్నీ కష్టాలే. నేర్చుకొనే అందుకు సులభంగాలేదు. గతము గతమైనది. That which is past ఎందుకు. That ఎందుకు which ఎందుకు? అందులో ప్రతిదానికి is రావలసిందేనాయె. వాకర్థం కాలే దబ్బాయి. రేపు చదువుదాములే. రేపు అంటే ఏమిటి ఇంగ్లీషు అన్నాడు. Tomorrow అన్నాను. ఆయన మరి నిన్నటో అన్నాడు. yesterday అన్నాను. మొన్న అంటే అన్నాడు. Day before yester day. ఎల్లుండో అన్నాడు. Day after tomorrow. ఆయన రెండు పెదవులమీద తర్జని ఇట్లా అడ్డంగా పెట్టుకొని కాసేపు నావంక చూచి నాయనా నిన్న, మొన్న, రేపు, ఎల్లుండి ఈ మాటలు ఎంత సులభంగా ఉన్నవి. నీ ఇంగ్లీ

షులో చెప్పిన మాటలు ఎంతకష్టంగా ఉన్నవి. మన మాటలు రెండు రెండ క్షరాలలో తేలిపోతూ ఉండె. వాడి మాటలకి స్పెలింగులతో చ స్తు న్నా మాయె. మొన్నకి ఎల్లుండికి ఒక్కమాట లేదాయె. ఇందులో రహస్య మేమిటో చెప్పుతుంటావా? వాళ్ళకి మొన్న ఎల్లుండి పట్టింపు లేదోయి. వట్టి ఇవ్వాళటి జాతిపలె ఉంది. తప్పదుకదా అని నిన్నా రేపూ ఒప్పుకున్నారు. ఎట్లా ఒప్పుకున్నారు? రేపెమో ఎనిమిది అక్షరాలతో ఒప్పుకున్నారు. నిన్న తొమ్మిదక్షరాలతో ఒప్పుకున్నాడు. ఆ భాష సులభమైన భాష అనిగానీ ఏదో గొప్ప భాష అనికానీ అనుకొనేవాళ్లు సామాన్యంగా కూడా ఆలోచించిన వాళ్ళు కాదోయి.. నిజానికి నాకు చాలా కోప మొచ్చింది "అయ్యా! అది అంతర్జాతీయమైన భాష. మెత్తనివాణ్ని నన్ను చూచి మీరు కలలో వచ్చి నన్ను దబాయించి సంగమాత్రం చేత ఆ భాష కేమీ నష్టం లేదు లెండి. ఆ భాష గొప్పదనం ఇక్కడ కాదు. రాజకీయ విషయాలలో, సాంఘిక విషయాలలో, మరీ సైన్సు విషయాల ఉన్నది. ఆ భాష గొప్పదనం" అన్నాను. ఆయన నాయనా ఆ సైన్సు మాట నాకు తెలియదు. తక్కిన ఏ విషయంలో నైనా సరే, సంస్కృతాంధ్రా లకి మించి ఆ భాష ఉంటుందని ఎవడను కోవాలంటే మన సంస్కృతాంధ్రాలు రానివా డనుకోవాలి! నే నన్నానుకదా! 'అవును వాళ్ళే అనుకుంటు న్నారు' అని. ఆయన నవ్వి నువ్వు కాసేపు నా వైపున మాట్లాడతావు. కాసేపు వాళ్ళవైపున మాట్లాడతా వేమిటి" అని అన్నాడు. నేను "నిజమే మీరంటోంటే తెలుస్తోంది. నేనటూ ఇటూ మాట్లాడుతున్న మాట నిజమే. ఇట్లా ఎందుకు మాట్లాడుతున్నా నంటున్నారు" అని అడిగాను. తిక్కన్నగారు లేచి కూర్చుని నన్ను చెప్పమంటావా అన్నాడు. చెప్పండి బాబూ! అన్నాను. ఆయ నిట్లా మొదలుపెట్టాడు. "ఒరి నాయనా, నీ తమ్ముడికి నీ బావమరదికి అంటే నీ పెళ్ళాం తమ్ముడికి ఇద్దరికీ తగాదా వచ్చిందనుకో. న్యాయం నీ తమ్ముడి వైపుంది. అచ్చంగా తమ్ముడివైపు మాట్లాడావా నీ పెళ్ళానికి కోపం వస్తుంది. అందుచేత ఎంతసేపూ బావమరదివైపే మాట్లాడుతూ మధ్య మధ్య నీకు తెలియకుండా నీ తమ్ముడి పక్షపు మాటలు మాట్లాడుతుంటావు. సహజంగా అది నీ నెత్తురులో ఉన్న లక్షణం. బావమరదివైపు మాట్లాడటం ఆ నెత్తురులో ఉన్న సారాన్ని బయటికి పంపించే లక్షణం అన్నాడు. నేనేం చేయను. మాట్లాడకుండా ఊరకున్నాను. మళ్ళీ నే నన్నాను, అయ్యా నిజమే కాని మా పెద్దపెద్ద ఇంగ్లీషు పండితు లందరూ ఏ శాస్త్రాన్ని గురించికూడా ఇంగ్లీషులో వృద్ధి పొందినంత సంస్కృతంలో వృద్ధి పొందలే దంటున్నా రన్నాను. అంటే విష్ణుశర్మ ఏమో నోయి నేను పంచతంత్రం వ్రాశానుకదా. అది నీతి. ఈమాటకి ఇంగ్లీషేమిటి చెప్పమన్నాడు. నే నాలోచించాను. నాకొక విషయం జ్ఞాపక మొచ్చింది. ఎవడో ఒక అమెరికన్ పంచతంత్రాన్ని ఇంగ్లీషులోకి తర్జు

మా చేశాడు. నాకతని పేరు జ్ఞాపకం లేదు. అతడు ఆ పుస్తకానికి పీఠిక వ్రాస్తూ పీఠికలో వ్రాశాడు కదా! "సంస్కృత భాషలో ఈనీతి అన్న శబ్దం ఉన్నది. దీనికి సరియైన శబ్దం మన భాషల్లో ఎక్కడా లేదు! మనం తెలుసుకొన వలసిన విషయమిది. సంస్కృతం అంత గొప్పభాష'' అని వ్రాశాడు. అంటే విష్ణుశర్మ 'అది నీతిలేని భాష' అని అతడే ఒప్పుకొన్నాడన్నమాట అన్నాడు. అంటే నేను నీతి అన్నమాట లేని భాషండీ అన్నాను. అంటె విష్ణుశర్మ ''నవ్వుతూ అన్నానోయి, బావమరది స్థానంలో ఉన్న భాషకదా! ఆమాత్రం హాస్యమాడకూడదా? అన్నాడు. అంటే తిక్కన్న అన్నాడు, 'అనకూడదయ్యా, విష్ణుశర్మా' ఆ బావమరది కలెక్టరనుకో. వాడు బావమరది పరాచిక మనుకుంటాడా. కలెక్టరుని నన్నన్నా డనుకొంటాడు అన్నాడు. అంటే విష్ణుశర్మ ''బలే అన్నావయ్యా బలే అన్నా''వన్నాడు. అందుకనే పదిహేను పర్వాలు వ్రాశావు"అన్నాడు.అంటేతిక్కన్నఅందుకనే యుద్ధపర్వంలోఒకపద్యం మొదలు పెట్టాను. 'నావుడు నవ్వుబాల కనినన్' అని మొదలు పెట్టానోయి'' అన్నాడు. నేను ఇంతకూ మీరే మంటారు అన్నాను. విషుశర్మ ఇంతకూ అంటావేమిటి? ఎంతకూ? మన మేమన్నా బేరమాడామా? నువ్వు పది రూపాయలు చెప్పావా? నేను సగానికి సగం అడిగానా? మనిద్దరి మధ్యా బేరమే నడవటం లేదాయె. ఇంతకూ ఏమిటని అడిగాడు. నేను తెల్లబోయి చూస్తున్నాను. వీళ్ళతో మాట్లాడటం మహాపేచీగా ఉన్నది అప్పుడు తిక్కన్న అన్నాడు. నాయనా అంత తెల్లబోకోయి. నువ్వంత తెల్లబోయినా దొరవు కానేకావు. వాళ్ళభాష ఎంత చదివినా నీవు నల్లజాతి వాడవేతప్ప తెల్లజాతి వాడవుకాదు. నీవు ఆభాష చదివి తెల్లపడదా మనుకొంటే ఆఫ్రికాలో మనుష్యులేంకావాలి వాళ్ల మతం పుచ్చుకొంటేనే దిక్కులేదు. నువ్వు ఇంతకూ అని అనకూడ దని విష్ణుశర్మ ఎందుకన్నా డంటే దీని వలన ఏమీ లాభం లేదు. ఈ దేశంలో ప్రతిదాన్ని గురించీ చర్చలే తప్ప సారాంశ మనేది ఉండదు. నువ్వే చూడు, దేవు డున్నాడా లేడా. ఒక పత్రిక వాడి శీర్షిక పెడతాడు. తెలుగులో కవులున్నారా లేదా? ఇంకో పత్రికవా డీ శీర్షిక పెడతాడు. తెలుగులో నవలా రచయిత ఉన్నాడా లేడా? ఇదింకో శీర్షిక. గురజాడ అప్పారావు కవి అవునా కాదా? ఇదొక శీర్షిక. కృష్ణుడికి మీసాలు ఉన్నవా లేవా? ఇదొక శీర్షిక. ఇల్లా పత్రికలు శీర్షికలు పెట్టడం. ఎవడికి తోచింది వాడు రాయటం— అని తిక్కన్నగా రంటూఉంటే నేనన్నాగదా "స్వామీ! మీరు ఎంత కవిబ్రహ్మలైనా ఇక్కడ పొరపాటు పడుతున్నారు. ఎవరికి తోచింది వాళ్ళు రాయటం కాదండీ, వాళ్ళకు తొయ్యదు, అంటే తోచదు అని అనుకోండి మీరు. ఒకవేళ వాడి మనస్సులో వాడు బుద్ధిపూర్వకముగా ఇంకొకటనుకున్నా వాడు వ్రాసేది వేరు. దాని వెనక ఎంత సాంఘికం ఎంత రాజ

కీయం, మజా ఆ అండీ ఇది" అన్నాను. విష్ణుశర్మ "నిజం చెప్పావోయి, నా అయుర్దాయం కూడా పోసుకు బతుకు" అన్నాడు. తిక్కన్న నవ్వి "ఎందు కయ్యా పాపం అతన్నేడిపిస్తావు. నీకాయుర్దాయం ఇంకా ఏముంది? ఇదివరకే చచ్చావాయె." అంటే విష్ణుశర్మ అన్నాడు, అదిమాత్రం ఆశీర్వచనం కాదే మిటి ? అతని కెన్నాళ్లాయుర్దాయ మున్నదో ఆన్నాళ్ళు బ్రతకమని అర్థం" అన్నాడు. అదీ రహస్యం. నువ్వెందుకు, రైలులో వెళ్ళు. క్లబ్బుల్లో కూర్చో పదిమంది కలిసినప్పుడు విను, సరిగ్గా అక్కడెల్లాగో పత్రికల్లోనూ అల్లాగే. చర్చ, చర్చ, చర్చ, ఒక్కదానికి నిశ్చయమనేది లేదు. ఇది తీర్మానించాము. అనేది లేదు. ఇది నిశ్చయ మనేది లేదు. అంత అగావుగా ఉందోయి ఈ ఇంగ్లీషు భాష. వాడు చెప్పిందానికీ నీవు సమాధానం చెక్పలేకపోతే పూర్వ కాలంలో అవతలవాడు చెప్పింది ఒప్పుకొనేవాళ్లు. ఈ కాలంలోనో వాడు భేదంచే అందుకు అడుగుతాడు. (I beg to differ) ఇక దేని తత్త్వం ఎల్లా నిర్ణయింప బడుతుంది. సరిగ్గా ఇల్లాంటి మనః ప్రవృత్తికి ఈ ఇంగ్లీషు చదు వులో ఉన్నటువంటి పరమరహస్యానికి ఇంత దగ్గరి సంబంధం. దేశమంతా ఇంగ్లీషు చదువుతున్నారు కనుక అందరి మనస్సులూ ఇట్లాగే ఉన్నవి అందరు ఇట్లాగే మాట్లాడుతారు. కనుక ఇంగ్లీషే చదువుతారు. తెలిసిందా ఈ రహస్యం అన్నాడు. మన భాష ప్రతీదీ నిర్వచనంతో, నిశ్చయంతో జరిగే భావం, జరిగే ఊహ, జరిగే బ్రతుకు, జరిగే భాష. అక్కడంతా గాలికి వెళ్ళుతూ ఉంటుంది. ఎట్లా వెళ్ళితే అట్లాగు అన్నాడు నేను మనస్సులో గుడుసుళ్లు పడుతున్నాను. ఆలోచించాను. నిజమేరా అమెరికాలో ఆధునిక Philosophers బయలుదేరారు. శాంతాయనవాళ్ళు అయి పోయినారు. కొత్తవాళ్లు వచ్చారు. వాళ్ళు కనిపెట్టారట. దానిపేరు behaviourism అట. దానిమీద నడుస్తున్నా డిప్పుడు సంకుమయ్యి. నిజమే, ఎల్లా వెళ్ళితే అల్లా వెళ్ళుతుంది. అదే గొప్ప అనుకున్నాను. మనుష్యుడు ఇల్లాగే నడువాలి అన్న నియమమేమిటి ? అంటే అభివృద్ధి లే దన్నమాట. ఎప్పుడూ నిడివిగా సూటిగా నడవటమేనా ? చక్కగా పీతల్లే పక్కిగా నడిస్తే ఎంత బాగుంటుంది.

నేను విష్ణుశర్మతో అన్నాను "ఏమయ్యా బాబూ ! మీ మోస్తరుచూస్తే ఇంక ఇంగ్లీషు చదివేటట్టు లేదే" అని. ఆయన అన్నాడు ఇంతమట్టుకే చాలురా నాయనా ? నీతోపాటు కూర్చొని ఇరవై ఏళ్ళక్కడ ఉండమంటావు మళ్ళీ ఈ భూలోకంలో ఉంటేగాని నేను ఏ ఎం. ఏ. యో ప్యాసు కానాయె. తీరా అయింతరువాత నేను ఉద్యోగం కోసం పోతే వాడు date of birth అడిగితే ఏంచేయమంటావు. నేను ఎప్పుడు పుట్టానని లెక్క ? అన్నాడు. నేను అప్పటిదాకా ఎందుకండీ నేను చెప్పాకదా. మీకు ప్రైవేటుగా చెప్పి

ఎనిమిదో క్లాసులో ప్రవేశ పెడతానని. మీ జన్మ తేదీ పేచీ అప్పుడే వస్తుంది అని. ఆయన అందుచేత నే నిప్పుడే వెళతాను అన్నాడు. మనస్సులో రక్షించారురా బాబూ! అను కున్నాను. "మీ యిష్టం" అన్నాను. మీ ఇష్టంఅంటే ఏమిటో తెలుసునా అర్థం. దయచేసి వెళ్ళండి బాబూ అని. కాని తిక్కన్న వెళ్ళటం ఇష్టంలేదు. ఆయనచేత భారతంలో ఉన్న రహస్యాలు ఏమైనా చెప్పించుకొని అవంతా నా తెలివి తేటలల్లే వ్రాస్తామని ఒక ఊహ. తిక్కన్న నా ఊహ గ్రహించాడు. గ్రహించి అన్నాడు. "ఏమోయి, నాచేత చెప్పించుకొని నీ స్వంతంగా వ్రాస్తా మనుకుంటున్నావే అన్నాడు నే నన్నాను. "ఏం బాబూ వ్రాస్తే తప్పా. ఈ రోజుల్లో ఎవళ్ళు వ్రాసిన పుస్తకాలో కాజేసి తమ పేరు పెట్టుకుని ప్రకటించటం లేదా? మా కవు లున్నారు, ఎవడో పద్యం వ్రాసి వినిపిస్తాడు. నేను ప్రకటిస్తాను అని తీసుకుంటాడు. తన పేరుతో ప్రకటిస్తాడు. దానికన్న చెడిపోయిందా" అన్నాను. విష్ణుశర్మ "అట్లయితే అసలు వ్రాసిన కవి ఊరకుంటా డటయ్యా" అన్నాడు. నేను "ఊరకొనే కవిని చూచే చేస్తాము ఆ పని.. ఏయి! అక్కడికెళ్ళి అణా బీడీలు కొనుక్కురా, ఒకడు ఏడుస్తూ కొనుక్కు వస్తాడు. ఇంకొకడు ఏమిటయ్యా, నీకు బీడీలు కొనుక్కు రావటమేనా ఏం నా పని అంటాడు. లేకపోతే కొంచెం సాధువైతే వినపడనట్టు ఊరకుంటాడు. బీడీలు తీసుకు రమ్మన్నాడే ఆతడు బీడీలు తీసుకు రమ్మని ఎవరి నడుగుతాడు. ఎవరికి క్రాపింగుండదో వాణ్ణి అడుగుతాడు. ఎవడు కంటిమెడచొక్కా వేసుకోడో వాణ్ణి అడుగుతాడు. జాగా ఎగిరి ఫైటో అన్నాడు.

అంటే తిక్కన్న అన్నాడు "నాయనా! నిజమే. నేను ఎందుకు వచ్చానో నీవు అదే అడుగుతున్నావు. నిజమే. నేనుచెప్పే విశేషాలన్నీ నేను చెప్పానసే వ్రాసినందువల్ల వచ్చే గొప్ప ఏమున్నది నీవు స్వంతంగా ఆలోచించి వ్రాసినట్లు వ్రాస్తే వచ్చే నష్టమేమున్నది. కాని బాబూ! నేను ఆఊహాలు ఉపసంహరించు కొన్నానోయ్. ఎందుచేత నంటే నువ్వు నన్ను విశ్వవిద్యాలయానికి తీసుక వెళ్ళావు. ఆశాఖాధ్యక్షుణ్ణి నేను చూచాను. ఇతర పండితులని కూడా చూచాను. నాకు ఒక్కటి తెలిసింది. నాయనా కావ్యాలల్లో ఉండే విశేషాలు వాళ్ళ కక్కర లేదు. సంప్రదాయంగా ఊహించ నక్కర లేదు. వాళ్లు ఏదో అనుకుంటారు. అదే రైటు. పుట్టెతో బుట్టిన బుద్ధి పుడకలతో గాని పోదు. అందుచేత మేము వెళ్లుతున్నాము"

నేనిద్దరినీ రైలెక్కించాను. మనస్సులో అనుకుంటూనే ఉన్నాను. రైలెక్కా రేమిటిరా, స్వర్గానికి రైలెక్కడ ఉంది అని. ఏమో! మదరాసు నుంచి స్టాలిన్‌గ్రాడు పోతారో, న్యూయార్కు పోతారో? అక్కడినుంచి వాళ్ళ

నెవళ్ళనన్నా బతిమాలి పరాకెట్టులోనన్నా దూరా రనుకోండి, ప్రచంద్రుడి దాకానో పోతారు. అక్కడినుంచి వాళ్ళ తిప్పలు వాళ్ళు పడతారు: రైలు కదలింది. వెళ్ళిపోయినారే అనుకున్నాను. వెంటనే మెలకువ వచ్చింది. ఎక్కడున్నాను? వాకిట్లో మా మెల్లాలో తెల్లార్లూ ఆరాళ్ళల్లో పడుకుని నిద్రపోయినాను కాబోలు. మా కాలేజీ బంట్రోతు తీసుకవచ్చి వెంటనే ఒక కాగితం చేతికిచ్చాడు. నాకు Head of the department అయిందట! ఎందుకబ్బా అనుకున్నాను. ఇంతకలకన్నాను కదూ ఇదే పెద్ద పరిశోధనాయె. ఇంతకంటె చచ్చుపరిశోధనలు చేసేవాళ్ళకి డాక్టరేటు వస్తూంటే ఇంతగొప్ప కలకన్న వాణ్ణి నాకు Head of the department కాకూడదా? అబ్బే నవ్వుతూ అన్నాను. ఎవర్నీ ఆక్షేపించే అందుకు కాదు. నాకీ ఉద్యోగం ఎందు కయిందేమిటి. కలలో నయితే నేమి. మాచవరం ఆంజనేయ స్వామికి వందకొబ్బరికాయలు కొట్టాను. అందుకని.

స మా ప్త ము

